# అనామిక

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి





# అనామిక

(పత్రికలలో సీరియల్‌గాక మునుపే - నేరుగా ప్రచురింపబడిన నవల)

వాహినీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
ఏప్రిల్, 1982

ముఖచిత్రం
బాపు

ముద్రణ :
ఎస్వీ

వెల రు. 14-00

వాహినీ ప్రచురణాలయం
విజయవాడ-2

# అంకితం



"సాటిలేని సాహిత్యాభిమానులైన - మీకు
ఈ నూతన కుసుమం అంకితం—"

విహా కౌసల్య.

తెలుగు నవలా రచయిత్రులలో

సాటిలేని మేటి ప్రఖ్యాత రచయిత్రి

# ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

నవలా 'వాహిని'లోని మరో

ఉత్తుంగ తరంగం

# "అనామిక"

# అనామిక

"హాయ్ అపర్ణా ఏం చేస్తున్నావ్?"

తియ్యగా నవ్వింది అపర్ణ, ఫోన్ను సవరిం చుతూ రెండో చేతితో.

"ఏం చేస్తాను? బద్ధకంగా అటూ ఇటూ దొర్లు తున్నాను. అబ్బ, ఏమన్నా ప్రోగ్రాం వేసుకుందా మేమిటి?"

అవతలి కంఠం ఏం చెప్పిందో తెలియదు.

"ఊఁ, అయితే సరిగ్గా పదిగంటల కిక్కడ కొచ్చేయి.'

"ఫోన్ పెట్టేస్తూ, అటాచ్డ్ బాత్ రూంనుండి బయటకు వచ్చిన భర్త చూపులతో చూపులుకలిపి నవ్వింది పలుకరిం పుగా.

"అప్పుడే లేచారా?"

"అప్పుడే కాదు. ఎనిమిదిన్నర దాటుతోంది. ఎవరి కేమిటి యింత ప్రొద్దున్నే నీపై విరహబాధ కలిగింది?" అడిగాడు సతీష్ నవ్వుతూ.

"ఇంకెవరు? మమత, రాజేశ్వరి."

"ఏం ప్రోగ్రామేమిటి?"

"ఏదీ—వాళ్ళిక్కడకొచ్చాక నిర్ణయిస్తాను."

వంటమనిషి కాఫీ తెచ్చాడు.

మాటలు ఆగాయి.

"టిఫిన్ ఉప్మా, చపాతీ చేశానమ్మగారూ."

"అలాగే."

"వంట........"

"నాన్సెన్స్, లేస్తూనే న్యూసెన్స్. నేను క్రిందికి వచ్చాక చెబుతానులే అవన్నీ, వెళ్ళు."

"చిత్తం."

వార్డ్‌రోబ్ సవరించుతూన్న సతీష్ ఇటు తిరిగాడు వంట మనిషి వెళ్ళిపోయాక, "అలా విసుక్కుంటే కాస్త నెమ్మదిగా చెప్పరాదూ?"

"ఏమక్కర్లేదు. అలాగైతేనే వాళ్ళు అణగి మణగి పడి వుంటారు? అన్నది కాఫీ కప్పు చేతికి తీసుకుంటూ.

"అబ్బ, కాస్త ముఖం కడిగి త్రాగుదూ. ఎన్నాళ్ళు ఈ చిన్న పిల్లల తంతు?"

"సారీ డాళింగ్! ఆ కాఫీ పడనిదే నేనసలు మంచం దిగలేను."

"హుఁ, నా వార్డ్‌రోబ్ ఎంత చికాకుగా వుందో చూశావా? కొంచం సర్ది పెడతావా?"

అపర్ణ వదనం అప్రసన్నంగా మారిపోయింది.

"అబ్బ, అటువంటి హెడేక్ పనులు నాకెప్పుడూ చెప్పవద్దు. నాకు చీకాకు, ఓపిక వుంటే నా అల్మారాకూడ మీరే సర్దిపెట్టండి."

"ఇంకా నయం, చీరలు ఉతికి ఇస్త్రీ చేయమన్నావు కాదు!"

"ఏం తప్పా? మమత భర్త ఆవిడ చీరలుతుకుతూం డగా నేనోనాడు చూశాను తెలుసా?"

టైనాట్ వేసుకుంటూన్న సతీష్ చివాలున యిటు తిరిగాడు అసహనంగా.

"సిగ్గులేదా నీకామాట చెప్పడానికి?"

"ఎందుకూ? సమానహక్కులు!" గర్వంగా అన్నది.

"హుఁ. ఇంటినిండా నౌకర్లుండి మంచం దిగవలసిన అవసరం లేని నీకు సమాన హక్కులేం ఖర్మ-అధిక హక్కులే లభించాయి. ఇంట్లో ఓ నౌకరుకైనా గతిలేని ఓ మామూలు ఉద్యోగి భార్య అయి వుండీ మమత నీతో సరిగా పెత్త

నాలు చేయలుగుతోందంటే ఆవిడ భర్త చీరలూ ఉతుకు తాడు, గిన్నెలూ కడుగుతాడు మరి! పూర్ ఫెలో!"

"అబ్బ! ఏం? మీ మగవారి మీద అంత సాను భూతి?"

"మహాతల్లీ! ప్రొద్దున్నే ఈ తర్కం దేనికిగానీ కొంచ మైనా నువ్వు ఇంటి విషయాలు చూచుకుంటే బాగుంటుంది. ఈ మధ్య ఈ కంపెనీ లాకౌటు, హర్తాళ్‌లలో నా మెదడు బాగా వేడెక్కిపోతోంది."

"అయితే నేనేం చేయనూ? కంపెనీ విషయం డైరె క్టర్స్ చూసుకుంటారు."

"అలాగే ఇంటి విషయం నువ్వు చూచుకోవాలి. నువ్వే డైరెక్టరువి. అలా ఆ గార్డెన్ చూడు, పూల మొక్కలు ఎండిపోతున్నాయి, లాన్స్ పిచ్చిగా పెరిగాయి, కట్ చేయించాలి, నీరు పెట్టించాలి. ఈ గదుల అలంకరణ శాస్త్రమార్చాలి. అల్మారాలు సర్దాలి, నౌకర్లుంటే ఏమిటి? దగ్గరుండి నువ్వు చేయించాలి."

"బాబోయ్! నేనే? నాకంత ఓపిక లేదు. ఎలాగో ఓలాగ వుంటాయి.

"ఔను, ఇంటి విషయాలకు ఓపిక లేదు కానీ ఊరి మీద బలాదూరు మాత్రం తిరుగుతావు! ఎందుకు? ఏమి టంత ఆనందం అందులో?"

సతీష్ అడగడంలో అధికారంలేకున్నా, మృదుత్వం లోపించింది.

అపర్ణ లేచి నైట్ గౌను సవరించుకుంటూ అతడివేపు కోపంగా, అసహనంగా చూచింది.

"నా అలవాట్లు యివే, నేనిలాగే వుంటాను. నాకు పనులంటే అసహ్యం. అయినా మనకు పనులు చేసుకు బ్రతక వలసినంత ఖర్మ ఏమిటి?"

సతీష్ తర్కం మాని ఆమెను నఖశిఖ పర్యంతరం చూచాడు.

"ఔను," తనలో తాను గొణుక్కున్నాడు. "మనకు పని ఎందుకు? పనులు చేసుకొనే వాళ్ళు పిచ్చివాళ్ళు!"

కిటికీ వద్ద నిలబడి బద్ధకంగా బయటకు చూస్తూన్న అపర్ణ విసుగ్గా అన్నది.

"అబ్బ! అసలు నాకు తీరిక ఎక్కడిది? ఇదిగో యిప్పుడు స్నానం చేయాలి, ఫ్రెండ్స్ వస్తారు; తరువాత ఎక్కడికైనా వెళ్ళాలి, వచ్చేసరికి అలసిపోతాను. ఇంక పని ఎలా చేయాలి?"

"భేష్! ఒక స్త్రీ తనకూ బిడ్డలున్నారనీ, తనకూ సుఖమూ షోకులూ కావాలనీ మఱచి అహోరాత్రులు శ్రమించి దేశాన్ని పాలించుచున్నారు. తమకూటి జీవితమూ

అనుభూతులూ కావాలనేది విస్మరించి కొందరు స్త్రీలు కళా సేవ చేస్తున్నారు. తమ ఇల్లూ, వాకిలి దిద్దుకుంటూ, భర్తా బిడ్డల ఆలనపాలనలు చూచుకుంటూనే సాహిత్యసేవ చేసి పేరు గణించుతున్నారు, మరి కొందరు స్త్రీలు. మరి నీకు నీ ముఖం నీవు కడుక్కోవడానికీ, స్నానం చేయడానికీ ఓపిక లేదు!"

"పూర్ ఫెలోస్!" నిర్లక్ష్యంగా అతిశయంగా అన్నది అపర్ణ. "హాయిగా తిని తిరగక ఆ సేవా ఈ సేవా అనుకోంటూ ఊబిలో కూరుకుపోయే పిచ్చివాళ్ళకూ నాకూ పోలికేమిటి?"

"హుఁ! పూర్ ఫెలోస్ వాళ్లు కాదు. నేను! నన్ను చూచి నేనే జాలి పడాలి!"

"హుఁ!" నిరసనగా తిరిగి మంచంమీద వాలింది. విసుగుదలనంతా కాలి బూట్లపై చూపుతూ వెళ్ళిపోతూన్న భర్తను చూస్తూ.

"అడుగడుగునా నీతులు బోధించుతూ అధికారాలు చేయకపోతే మగవాళ్ళ దర్పం నిలబడదనుకుంటారు. ఈ అధికారాలు నా దగ్గర చెల్లవు."

మేడమెట్లు దిగుతూన్న సతీష్ ఆ మాటలు విని తల పంకించుతూ వెళ్ళిపోయాడు.

అయ్యగారు ఉపాహారమూ, కాఫీ తీసుకోకుండా ఎందుకు వెళ్ళిపోతున్నారో తెలియక, పిలిచే సాహసంలేక వంట మనిషి చూస్తూండిపోయాడు.

## 2

"హాయ్ మిత్రమా! ఏం చేస్తున్నావు? అయ్యో, ఇంకా నిద్రమంచం వదలలేదా?"

మమతా, రాజేశ్వరీ, అనిత వచ్చారు బిలబిలా. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచింది అపర్ణ.

"మైగాడ్! పదిన్నర! ఇంకా నువ్వు నిద్రలేవలేదూ?" రాజేశ్వరి ఆశ్చర్యంగా అడిగింది.

"ఇప్పుడే నిద్రలేచినా ఎంత చక్కగా వుంది!" మమత అన్నది. "బాప్ రే! నీ కసలు మేకప్ అవసరం లేదు. నిద్ర లేస్తూకూడ ఎంతందంగా వున్నావే?"

"అదృష్టవంతురాలివి. ఏ పనీ చేయక్కరలేదు. అన్నీ మంచంమీఁదికే అందుతాయి. నిన్నింత అందంగా సుఖంగా వుంచిన సతీష్‌గార్ని నిజంగా అభినందించాలి."

"ఆఁ ఆఁ. ఈ ఉపయం ఎంత దెబ్బలాడుకున్నామో నీకేం తెలుసు? ఆఖరుకు నా మాటే నెగ్గిందిలే. ఈ మగరాయుళ్ళ ఆటలు సాగేది నా వంటి వాళ్ళ దగ్గర కాదు."

గర్వంగా అన్నది, అపర్ణ. మంచందిగి బాత్ రూం దెస నడుస్తూ.

"ఒక్క రెండు నిముషాలు, స్నానం చేసి వచ్చేస్తా."
అంతలో ఫోన్ రావడంతో మళ్ళీ వెనక్కు వచ్చింది.
"హల్లో! ఆఁఆఁ. మీరా? ఏమిటి?"

"ఏం చేస్తున్నావ్ అపర్ణా?" ప్రేమగా పలికింది సతీష్ స్వరం, "ఇంకా మంచంమీదనే వున్నావా లేచావా"

అతడెంత ప్రేమగా పలికాడో అపర్ణ అంత వెటకరంగా జవాబు చెప్పింది.

"ఇప్పుడే లేద్దామనుకుంటున్నాను. మీరు ఫోన్ చేయకపోతే మరో గంట పడుకుందును హాయిగా."

వ్హా రెవ్హా, పద్మశ్రీలాగా నీకు నిద్రశ్రీ బిరుదివ్వాల్సిందే. ఈలోగా ఓ ఎనిమిది కప్పులైనా బెడ్ కాఫీ తాగావేమో?"

"ఎనిమిదో పన్నెండో లెఖ్ఖ పెట్టలేదు. రేపట్నుంచీ లెఖ్ఖలు వ్రాసి వుంచుతాను. ఇంతకూ ఎందుకు ఫోన్ చేశారు?"

చెవులు రిక్కించుకు వింటూన్న స్నేహితులు తాను తన భర్తనెంత అదుపాజ్ఞలలో వుంచిందో, ఎంత లెఖ్ఖ జేయకుండా ప్రవర్తిస్తుందో వినాలి. అప్పుడే తన గౌరవం ఇంకా పెరుగుతుంది వాళ్ళలో.

అందుకే అతి బింకంగా మాట్లాడుతోంది అపర్ణ.

సతీష్ నవ్వు ఆహ్లాదంగా వినవచ్చింది.

"ఏమిటోయ్ అలాఉన్నావు? ఇంకా కోపంపోలేదా? ప్రొద్దున్న ఏదో అన్నాననే కదా నీకోపం? సారీ!"

ప్రతిగా అపర్ణ నవ్వనూలేదు, తటస్థంగా మాట్లాడడం మాననూలేదు.

"ఇంతకూ ఏం సంగతి నేను జ్ఞప్తికి వచ్చానిప్పుడు?"

ఆమె బింకంగా మాట్లాడడం గమనించిన స్నేహితురాండ్రు కనుసైగలు చేసుకుంటున్నారు.

"వహ్వా, ఏం ప్రశ్న వేశావ్ ప్రాణేశ్వరీ! ఇంత బిజీ టైములో ఇంటిదగ్గరున్న శ్రీమతులను జ్ఞాపకం తెచ్చుకునే ఆఫీసర్లు ఎంతమంది వుంటారంటావు చెప్పు? ఏ పొట్టి గౌను సెక్రెటరీతోనో, గిరజాలజుట్టు టైపిస్టుతోనో చక్కగా మాట్లాడుకుంటూ............"

ఆ మాటలను వెన్నంటి ఓ కొంటె నవ్వు కూడా నవ్వాడు.

"ఏం మాటలాడవేం?" రెట్టించాడు కవ్వింపుగా.

కోపం వచ్చేసింది అపర్ణకు.

"ఏం బెదిరిస్తున్నారా? వేసుకోండి హాయిగా ఓ టైపిస్టు, ఓ రిసెప్షనిస్టు, ఇద్దరు సెక్రెటరీలు–అందరి నడుమా గోపాల కృష్ణుడులా వేషాలు వేయండి."

"ఆహా! ఎంత ఉదార స్వభావం! లోకంలో అందరి శ్రీమతులూ యిలాగే వుంటే......"

"అడుగడుగునా బృందావనాలు వెలిసేవి. సరే ఫోన్ పెట్టేస్తున్నాను."

"ఆఁఆఁ, అంతపని చేయకు, ఈ విషయం తర్వాత తేల్చుకుందాం కానీ-సాయంత్రం నేను వచ్చేసరికి చక్కగా ముస్తాబై......అంటే ప్రస్తుత అవతారం మార్చి......"

"రంభలా వుండాలి. ఔనా?"

"లేదు లేదు. ఆ సమయం వేరుకదా! ఊర్వశిలా కాదు—ఊర్వశివే అయి పోర్టికోలో నిలబడి వుంటే......"

"అయితే మధ్యాహ్నం భోజనానికి రారా?"

"అబ్బబ్బ, దేనికైనా వెంటనే 'యస్ డియర్' అనడం మాత్రం నీకు రాదు. సరే ఫోన్ పెట్టేయి."

వెంటనే క్లిక్ మన్న శబ్దం.

"ఏం మనిషి! భోజనానికి వస్తారో లేదో చెప్పలేదు అంతలోనే సరసం, అంతలోనే కోపం!"

"ఏమిటోయ్? ఆఫీసుకు వెళ్ళిన గంటన్నరలోగానే మీ వారికి నీపై ధ్యాస కలిగింది? చాలా అదృష్టవంతు రాలివే. మా వారు వారంరోజులు కేంపులో వున్నా ఓ ఉత్తరం ముక్కా, ట్రంక్ కాలూ ఏమీ వుండదు" అన్నది మమత.

"ఆ మాత్రం సరదాలూ, సరసాలూ తెలియడానికి నోచి పుట్టాలి లేవే. మన చాలీచాలని బ్రతుకులకూ అపర్ణ దర్జాలకూ పోలిక ఏమిటిలే. ఏ క్షణంలో మాట్లాడుకోవాలన్నా ఈవిడగారికి గదిగదికీ ఓ రిశీవర్. ఆఖరుకు బాత్ రూమ్‌లోనూ, ఇక్కడ బెడ్ ప్రక్కనాకూడ ఫోను, అక్కడ ఆయనగారి టేబుల్ మీద అయిదు ఫోన్‌లు! మన మెందులో జమ?" రాజేశ్వరి చేతులూ కనులూ త్రిప్పుతూ వీలైనంత అధికంగా శ్లాఘించింది.

వినీ విననట్లు చూచి, నవ్వీ నవ్వనట్లు గర్వంగా ఓ చిరుహాసం పారవేసి స్నానాలగదిలోనికి నిష్క్రమించింది అపర్ణ.

ఆమె తలుపు మూసుకున్నాక రాజేశ్వరి మమత దెస చూచి ఆక్షేపణా పూర్వకంగా కనుబొమలు విరిచింది. మమత హేళనగా కనులూ, పెదవులూ అటు యిటు త్రిప్పింది.

"ఎంత గర్వంరా బాబూ? ఆ మొగుడుగాడితో గూడ అంత టెక్కుగా మాట్లాడ్తోంది. చూశావా?" అనిత గుసగుసలతో అన్నది.

"ఏడిశాడు, అదుపులో పెట్టుకోవడం రాక అలా భరిస్తున్నాడు!" రాజేశ్వరి అన్నది.

"ఎలా పెట్తాడు? మనలాంటి మామూలు భార్య కాదుగా, పోషించుతున్నాడని పడి వుండేందుకు? అతడి

వ్యాపారానికి సరిపడినంత కట్నం తెచ్చి అతడిని ప్రిన్స్‌ను చేసిన డాయె! ఖరీదైన భార్య!"

"అయితే ఈ బిజినెస్ అంతా అతడిదేనా?"

"కాదులే, ఇతడు మేనేజింగ్ డైరక్టర్, తన కంటె ఎక్కువ పెట్టుబడిదారు లిద్దరితో కలసి చేస్తున్నాడీ పెద్ద చేతి పనుల పరిశ్రమ, ఫారిన్ ఎక్స్‌పోర్టుకూడా వుందట."

"అందుకే మరి ఈఇంటికి మనుషులకూ అడుగడుగునా యింత బడాయి!"

"ఊరుకోండి. వస్తున్నట్లూంది. మన కెందుకు?"

"ఔనులే, మనక్కావలసింది ఆవిడ ప్రాపకంలో నాల్గు డబ్బులు. ఏదో సినిమాలూ, హోటళ్ళూ బేవార్సుగా గడచి పోతాయి ఈ బంగారు పిచుక వల్ల. అంతే."

గుంభనంగా ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు.

ఏమీ ఎరగనట్లు మేగజైన్స్ తిరగేస్తూ కూర్చున్నారు.

డ్రెస్సింగ్ టేబుల్ ముందు ఆశీనురాలయింది స్నానం చేసి వచ్చిన అపర్ణ.

ఆమె అలంకరణ సామగ్రిసంతనూ విడ్డూరంగా, అసూయగా చూస్తున్నారు స్నేహితురాండ్రు.

"ఆ నెయిల్ పాలిష్-బాగుందే! ఈ షేడ్‌ను చూడడం యిదే మొదలు నేను" అన్నది మమత.

"ఫారెన్‌ది యిది." గర్వంగా చెప్పింది అపర్ణ.

"ఆ మధ్య ఆయన బిజినెస్ టూర్ వెళ్ళినప్పుడు నేనూ వెళ్ళానుగా? చాలా తెచ్చాను. చీరలూ, సింగార వస్తువులూ, టీసెట్స్, కాఫీసెట్స్, వైన్‌సెట్.

"అబ్బ, వాటికి చాలా ఖర్చయి ఉండాలి!" రాజేశ్వరి కనులు త్రిప్పింది.

"హుఁ." నిర్లక్ష్యంగా నవ్వింది. "వాటి ఖరీదుల కంటె వాటిమీద 'డ్యూటీ' ఎక్కువైంది. మీరు ఊహించ లేరుకూడ ఆ అంకెలు."

మిత్రత్రయం ముఖమండలాలు ఒక్కసారి వాడి పోయి అంతలో వెంటనే తేరుకున్నాయి!

"మాకేం తెలుస్తాయిలే అపర్ణా మీ బోటి పెద్ద అంతస్థులలో విషయాలు? ఏదో నీ మనసు మంచిది గనుక హైస్కూలులో స్నేహితులను ఇప్పటికీ గుర్తు పెట్టుకొని వదలలేక వున్నావు. ఆ మధ్య మా బియ్యే క్లాస్‌మేటు మనోరమ కన్పించి బజారులో ఎరగనట్టే ముఖం త్రిప్పుకొని వెళ్ళిపోయింది."

"మొగుడికేం బిజినెస్సేమిటి? బాగా వున్నవాళ్ళా?" అపర్ణ ముఖం చిట్లించి అడిగింది.

విరగబడి నవ్వింది రాజేశ్వరి. "ఇంకా పెళ్ళికాలేదు. ముప్పై వచ్చినా ఉద్యోగం చేస్తోందిలే."

"ఏడిసింది. అందుకు గర్వమెందుకూ? పెళ్ళైయిన వాళ్ళని చూస్తే పెళ్ళి కాని వాళ్ళకి దుగ్ధ అంతే.బియ్యేలూ ఎమ్మేలూ చూచుకొని గర్వమేందుకూ? సిగ్గుపడాలి. మా నాన్న రెండు లక్షలిచ్చి పెండ్లిచేయగల తాహతున్నది గనుక నాకు థర్డుఫారం చదువుతూండగానే పెళ్ళైయింది. సరైన తాహతుగల వాళ్ళతో. ఆ యోగమూ, యోగ్యతా లేనివాళ్ళు ఈ సురో దేవుడో మంటూ చదువుకోవాలి బియ్యేలూ, ఎమ్మేలూ, అంతలో వయస్సు ముదిరిపోయి, పెళ్ళిళ్లుకాక ఉద్యోగాలకెగబడతారు!"

అతిశయంగా బాణాలవంటి విసుర్లు విసిరేసింది. శ్రోతలు శిలలలాగా అయిపోయారు.

గమనించనట్లే అపర్ణ వంటమనిషిని పిలిచింది.

"పానకాలూ!" కోపమంతా వర్షించుతూన్న ఆధ్వనికి భవనమంతా దద్దరిల్లింది.

సదరు నామధేయుడు వచ్చి వంగి నిలచాడు ఎదుట.

"నా ముఖ్య స్నేహితులొచ్చి యింతసేపైనా కాఫీ ఫలహారాలిచ్చావా? చెప్పాలా వేరే?"

"మీరు మాట్లాడుకునేప్పుడు రావద్దంటారుకదమ్మా, అందుకూ. ఇక్కడికి తెమ్మంటారా? క్రిందకు వస్తారా?"

"వస్తాంలే. టేబుల్ మీద పెట్టు అన్నీ, చూడూ,

వంటకూడా త్వరగా కానీయ్. వీరందరికి మధ్యాహ్న భోజనాలూ యిక్కడే!"

"చిత్తం."

ఇంతకు ముందు గ్రుచ్చుకున్న విషబాణాల బాధను విస్మరించి శ్రోతాత్రయం వదనాలు వికసించాయి మరలా.

"నడవండి క్రిందికి. వస్తున్నాను." అని వారితో అంటూ గది శుభ్రపఱచ వచ్చిన పనిమనిషి లక్ష్మిని సాధిం చడంలో నిమగ్నమైంది అపర్ణ.

"ఏం, ఒళ్లు దగ్గరుందా?"

"ఏం చేశానమ్మగారూ?" ల బిత రపోతూ అడి గింది వణకిపోతూ.

"పక్కలు రోజూ మార్చాలని తెలియదూ? అవే సర్దేసి పరుస్తున్నావు మళ్ళా?"

"ఔనండి. పొరపాటైపోయింది."

బీర్వాలోనుండి మరో పూల అద్దకం వున్న దుప్పట్లు తీసి పరచింది ల

"మీరు ఆ మాక్సీయే వుంచుకుంటారామ్మా, చీర తీసి యిమ్మంటారా?"

"ఇదికాదు. ఆ బీర్వాలోది. నీలంరంగుచీర ఉంటుంది తీసి క్రిందకు తీసుకురా, భోజనాలయ్యాక వేసుకుంటాను."

ముందుగా మెట్లుదిగి క్రింది హాలులోకి వెళ్ళిపోయిన రాజేశ్వరీ బృందం మూడు మొహాలతో తమలో తాము మెల్లగా మాట్లాడుకుంటున్నారు.

"షుక్కాల్లాగా తిరుగుతున్నామని అల్లా విదిలించిపారేస్తోంది. గతిలేని వాళ్లు చదువుతారట బియ్యేలూ ఎమ్మేలూ. తనకు చదువులేని అసూయ అది!"

"జ్ఞానుకో, కానీ మనమే మనుకుంటామో అని కూడా లేదు. తమ కట్నకానుకలూ, విదేశయాత్రలూ, భర్త హోదా ఎంత గొప్పగా చెబుతోందో చూశావా?"

"ఆవిడను ఎప్పుడు కలసినా మనకి అతిశయపు మాటలూ విసుర్లూ వినక తప్పటంలేదు. ఇష్టమయ్యో చచ్చినట్టు వస్తున్నాం, భరిస్తున్నాం. మన మన భర్తలకు కాస్తయింకేమైనా మంచి ఉద్యోగాలిప్పించగలదనీ, అడపాతడపా అవసరాలకు డబ్బు సర్దుతోందనీ, ఎక్కువగా సినిమాలూ, వినోదాలూ రుచి చూపుతోందనీ—అంచేత ఇక అనుకోవద్దు, అదుగో, వస్తోంది."

లక్ష్మి చీరా, మాచింగుబ్లౌజూ, అదే రంగు బెల్టు స్లిప్పర్సూ తెచ్చి "ఎక్కడ పెట్టనండమ్మగారూ?" అన్నది.

"నీ నెత్తిమీద! ఫూల్! రోజూ పెట్టేదానవు గుర్తే లేదూ ఎక్కడ పెట్టాలో? నా గదిలో వేసువు."

"ఏం పానకాలూ వంట అవుతూందా? పడి నిద్ర పోతున్నావా?" అతడికి కూడా ఓ హెచ్చరిక పారేసింది.

"ఔతున్నదమ్మగారూ."

"ఓసారి మాలీనిలా పిలువు." అని డ్రాయింగ్ రూం లోకి నడచింది.

క్షణాలలో అతడు హాజరయ్యాడు.

"ఏం గవరయ్యా? నీ పనేమిటో నీకు తెలుసా?"

"అయ్ అయ్."

"ఏం ఆయ్ నీ ముఖం? ఏం మాకు డబ్బు చెల్లక నిన్ను పెట్టుకుంటున్నామా?"

"ఏం చేశానండమ్మా?"

"అమ్మా కాదు. అమ్మగారూ అని సరిగా పిలవడం నేర్చుకో, ఆ లాన్ లు అలా పెరిగిపోతూంటాయి. కట్ చేయ లేదేం? పూల మొక్కలకు సరిగా నీరు లేదని అయ్యగారు ఈ ఉదయం ఎంత హంగామా చేశారో తెలుసా?"

"నాకు వారంరోజులనుండి జ్వరం కదండమ్మా— అమ్మగారూ .....నిన్ననే వచ్చానండి పనిలోకి."

"ఊఁ. నడు. మళ్ళీమళ్ళీ అలాంటివి జరగకూడదు. ఎందుకు వస్తుంది వెధవ జ్వరం రోజూ? ఎదో వంక ఇంట్లో కూర్చుని తేరగా తినడానికి. పో పని చూచుకో నడూ."

"ఈ ప్రదర్శిస్తూన్న అధికారమంతా మనం చూడా లనేగా?"

రాజేశ్వరి మిగిలిన యిరువురితో గొణిగింది. అపర్ణ ఏదో ఫోన్ కాల్ వింటూంటే.

మఱలా ఆమె వచ్చి ఎదురుగా కూర్చునే సరికి ముగ్గురూ పిల్లిపిల్లలలా ముడుచుకు కూర్చున్నారు. ఆ గది అలంకరణనూ, అందలి సామగ్రినీ అబ్బురపాటుతో చూస్తూ న్నట్లు నటించుతూ.

"పద్మకూడ వస్తోందట. ఫోన్ చేసింది. చక్కగా అయిదుగురమూ వున్నాం గనుక పేక ఆడుకుందాం, భోజనా లయ్యాక మ్యాట్నీకి వెళదాం"

ఎదుటివారి అభిప్రాయమేమీ అడగకుండానే పేక కలపసాగింది.

"నీ దయ వల్ల ద్రుచుల భోజనం పెడతానంటే వద్దం టామా? హాయిగా వంట మనిషి వండి వడ్డించుతూంటే తినే యోగం మా యిళ్ళదగ్గర మాకెలాగూ లేదు. ఇక్కడైనా అనుభవిస్తాం ఆ సుఖం!"

గర్వంగా నవ్వివూరుకుంది అపర్ణ.

"కానీ అపర్ణా-నువ్వూ పద్మా పాయింటుకు వందా రెండువందలతో ఆడతారు. మీతో మేం సరితూగలేం."

"అలా ఆడితేనే ఈ ఆటలో మజా!"

"మా తోటికోడలూ, మరదీ వచ్చారు పదిరోజుల క్రిందట. ఊళ్ళో వున్న సినిమాలూ, పార్కులూ అన్నీ చూసేశాం. ఇంకేం చేయాలి. ఈవిడ 'బోర్'గా వుందంటే ఈరోజు యిటు తీసుకొచ్చాను...... రా సుమా... నేనూ అపర్ణగారూ పేకాటలో కూర్చుంటే రోజులుకూడా గడచి పోవలసిందే."

అలా ఆర్భాటంగా ప్రవేసించిన పద్మనూ, సుమనూ అంతకంటె అట్టహాసంగా ఆహ్వానించింది అపర్ణ.

ఐస్‌క్రీం, ఫ్రూట్ సలాడ్ సిద్ధంగా తెచ్చాడు పానకాలు. అతడికి తెలుసు ఎవరికేం ఇవ్వాలో!

ఆ ముగ్గురూ హాయిగా ఆడుకుంటూంటే, ఈ ముగ్గురూ చూస్తూ కూర్చుని సంతోషం నటించసాగారు.

ఒక రౌండు పూర్తయింది ఆట.

అపర్ణ మూడువందలు పోగొట్టుకున్నది. అవి సుమ గెల్చుకున్నది.

మళ్ళీ మొదలైంది.

'రాజేశ్వరీ! పానకాలుకు చెప్పు పద్మా, సుమగారూ కూడ యిక్కడే భోజనం చేస్తారని."

"ఎందుకోయ్, వెళ్ళిపోతాం." పద్మ అన్నది.

“ఏం ఫర్వాలేదు. ఇవాళ యిక్కడ నువ్వుచెయ్యి రేపు నేను అక్కడ చేస్తాను. సరేనా?”

“అలాగే” అంగీకరించింది పద్మ.

“వెళ్లు రాజేశ్వరీ; పానకాలుకు చెప్పి కొంచెం నువ్వు కూడా అతడికి సాయం చేద్దూ, మమతా-కొంచెం జీడిపప్పు వేయించుకొస్తావేమిటోయ్, మజా వస్తుంది!”

“ఛీ!”

మమతా రాజేశ్వరీలతో పాటు అనితకూడా లోనికి నడచింది.

“అన్నట్టు...... అనితా ఆ టేప్ రికార్డర్ ఆన్ చెయ్యి. ఆఁ వద్దులే. రికార్డ్ ప్లేయర్ ఆన్ చెయ్యి .నిన్న లేటేస్టు రికార్డ్సు కొన్నాను పద్మా విను. నువ్వేం కొన్నావీ మధ్య?”

“నేను యింపోర్టెడ్ సారీస్ కొన్నాను. మళ్ళా ఈ సాయంత్రం మా వారొచ్చాక షాపింగ్‌కు వెళతాను. మా సుమ దగ్గర మంచి డైమండ్ నెక్లెస్ ఉంది. అలాంటిది ఇక్కడుంటే సరే, లేకుంటే ఢిల్లీ వెళ్ళి తెచ్చుకోవాలి. ఆయనకు చెప్పాను యివాళ బ్యాంకినుంచి ‘మనీ డ్రా’ చేయమని.”

“అలాగా? అయితే నేనూ వస్తాను. వెళ్ళే ముందు నాకు ఫోన్‌చేయి. నేనూ కొంటాను, క్రొత్త డిజైన్ అయితే.”

ఈ సంభాషణ అంతా వంటగదిలో నున్న రాజేశ్వరి మమతా, అనితా వింటునే వున్నారు.

"వాళ్ళంతా ఒక సాయి వాళ్ళు. అందుచేత మనం తమతో ఆడకూడదని వంటింట్లోకి తరిమింది" అన్నది రాజేశ్వరి.

"అంతేమరి, ఆవిడా పెద్ద ఆఫీసరు భార్య కదూమరి? ఎవ్వరూ లేనపుడే మనతో ఆడుతుంది, సినిమాలు చూస్తుంది. సరీసాటీ అయినవాళ్ళుంటే మనం కనపడంగా?"

మధ్యాహ్నం ఒంటిగంటవరకూ అదే పనిగా ఆడారు ఎంతపోతోందో ఎంత వస్తోందో లెఖ్ఖలేదు. వందలు వందలు తిరుగుతున్నాయి అటూ యిటూ.

"ఇక భోజనాలకు లేవండి. మ్యాట్నీకి పోదాం." అన్నది అపర్ణ పేక విసరిపారేస్తూ.

"మీ వారు రారా భోజనానికి?" అనడిగింది సుమ.

అపర్ణ ఆమె దెస కనుబొమల విరుపుతో విసుగ్గా చూచింది. గర్వంగా జవాబిచ్చింది.

"వారులూ వీరులూ వచ్చేవరకూ తపస్సు చేస్తూ కూర్చుని పంక్తిభోజనాలు తినాలనే పిచ్చిపిచ్చి గుణాలేమీ లేవు నాకు. వస్తే పాచకాలున్నాడు. వడ్డించుతాడు. నాక్కావలసినపుడు నేను భోజనం చేసేస్తాను."

"నేనూ అంతే" పద్మ అన్నది. "మా సుమ అలాగ కాదులే. అతడు రానిదే భోజనమే చేయదు."

"చాలాసార్లు వాళ్ళు బయటే భోజనం చేస్తారు. స్నేహితులతోనో, పని కుదరకనో లేకపోతే ఆఫీసుకు చూడ వచ్చిన పెద్ద ఉద్యోగులూ, అధికారులూ వగైరా ఎవరెవరో వుంటారు చూడండీ-వాళ్ళతో, మరి అప్పుడు మీ పని? భజనేగా!" అన్నది అపర్ణ పద్మను ఉద్దేశించి హేళనగా.

సుమకు అందలి అవహేళన గ్రాహ్యమే కాలేదు. "ఔనండీ. చాల సార్లు అలానే జరుగుతుంటుంది." అన్నది అమాయకంగా.

ఫెళ్లున నవ్వింది అపర్ణ.
శృతి కలిపింది పద్మ.

"మరి మీ ఆరాధనకు ఇక ఫలమేమిటీ?" అన్నది అపర్ణ యింకా నవ్వుతూనే.

వెంటనే ఏం చెప్పవలెనో తెలియని సుమ కొంతసేపు మౌనం వహించింది.

"ఎందుకోనండీ, ఆయన ఆఫీసులో అంత శ్రమపడు తూంటారే-ఇంకా తిన్నారో లేదో అని ప్రాణం గిజగిజలాడు తుంది పాపం ఒక్కరోజూ భోజనం వేళకు చేయనంత తీరని పని, వచ్చి ఒక్కరూ భోజనం చేసేకంటె అయిన వాళ్లు

తోడుగా ప్రక్కన తింటూంటే ఆ అన్నం నోటికి సహించు తుంది"

"మరీ చెప్తారండీ మీరు. ఇదేమన్నా పాతకాలమా? మీ ఆయన అస్సలు అలా ఆజ్ఞాపించుతారేమో మిమల్ని నేను లేనిదే తినకు, ముందు తినేది పతివ్రత కాదూ అని."

అలా మాటలాడుతూనే అపర్ణ పద్మకు ఏదో కనుసైగ చేసి నవ్వుతోండడం గమనించిన సుమ ముఖం జేవురించింది. అయినా ఆమె స్వరంలో సరళత లోపింప నీయకనే మాట లాడింది.

"వారటువంటి వారు కాదండి. నన్నడిగితే అసలు వాళ్ళు చెప్పీ, ఆజ్ఞాపించీ మనచేత ఏపనీ చేయించలేరు. మన మనసును బట్టి మన ప్రవర్తన వుంటుంది. అంతే, ఆయన భోజనానికి రానినాడు ఫోన్ చేస్తారు. నన్ను చేసేయమనో, ఎదురుచూడవద్దనీ, ఏన్నోసార్లు మందలించుతారు టైముకు చెయ్యమని, అయినా నాకు మనస్కరించదు. అసలు ఆయన రానిదే ఆకలే వుండదు. తాను బయట తిన్ననాడు నేను ఓ గ్లాసు పాలో టీయో త్రాగేస్తాను. అంతే."

"అందుకే అంత లావుగా ఉన్నారు. మీ మొగం చక్కగా అందంగా ఉన్నా మీ శరీరం కొలతలు వికృతంగా ఉన్నాయి. వేళ పట్టున చక్కటి భోజనం చేయకపోతే గాస్

వగైరా ట్రబుల్స్‌తో శరీరాల రూపలావణ్యాలూ అలా పాడౌతాయి. నన్ను చూడండి ఇద్దరు పిల్లల తల్లినంటే మీరు నమ్ముతారా?"

వింటూనే సుమ నేత్రాలు ఆశ్చర్యంగా కదులాడాయి.

"పెండ్లికి ముందు ఎలా వుందో ఇప్పుడూ అంత నాజూకుగానే వున్నది నా ఫిగర్. తరచూ బ్యూటీ క్లినిక్‌కు వెళతాను. ఏటా నా కాస్మెటిక్స్‌కైతేనేం, ఈ బ్యూటీ పార్లర్స్‌కైతేనేం పదివేలుఖర్చుపెడతాను."

సుమ విస్మయంగా వింటోంది మాటలే మరచి.

"నిజంగానే మీరు చాలా అందంగా వున్నారు." అని అంగీకరించింది.

"వుండాలండీ." తృప్తి గర్వమూ తొణికిసలాడే నేత్రాలతో అన్నది అపర్ణ, "మనసేవా, ఎదురుచూడడం, వాళ్ళంటే పడి చావడం కాదు వాళ్ళకాూ-వలసింది. అందం, అది మనలో లేకపోతే, వున్నచోటికి ఆకర్షితులౌతారు."

అనంగీకారంగా తల అడ్డంగా వూపింది సుమ.

"అందరూ అలా వుండరు. "నా కోసం ఎదురు చూస్తుందే త్వరగా వెళ్ళాలి' అని అనుకుంటారు. ఆ విధముగా ఆయన ఎన్నిపనులలో వున్నా ఆ గుండెలో నేను మెదులుతూంటాను. అందం, ఆకర్షణా వివాహపు తొలి

ఘట్టాలలో మాత్రమే కొంత ప్రాధాన్యత వహించుతాయి. తర్వాత వివాహబంధాన్ని పటిష్టం చేసేది మనోసౌందర్యం మాత్రమే. అక్కడ బాహ్యసౌందర్యం విస్మరింపబడుతుంది."

"బాబోయ్! గీతోపదేశంలో మీరు దిట్ట అనుకుంటాను. కానీ ఈ పాత చింతకాయపచ్చడి నీతి శతకమంటే నాకు పరమసహ్యం" నిష్కర్షగా అన్నది అపర్ణ.

పద్మ అందుకు తందానతాన అన్నది:

"మా సుమ అంతేలే! పాతకాలం, తానేదో అర్ధాంగి పదాన్నీ విధులనూ అక్షరాలా నిభాయిస్తున్నాననుకొని గర్వపడుతుంటుంది. ఇటువంటివాళ్ళవల్లనే మగవాళ్ళు అధికులమని విఱ్ఱవీగుతుంటారు."

"హుం. నేనసలు ఆ అవకాశమీయను ఆయనకు. ఇంకా చెప్పాలంటే నామాటే ఆయన వినాలి!" అపర్ణ అహంకారంగా అన్నది.

సుమ జాలిగా నవ్వింది.

పద్మ అన్నది అపర్ణకు బలం యిస్తూ.

"నీ కంఠశోషేకాని 'సమానహక్కులు' అనేపదం మా సుమకు తెలియదు."

సుమ అన్నది పెంకెగా:

హక్కు లున్నచోట దూరాలు పెరుగుతాయి

అక్కా! అయినా వాదించి లాభం ఏమిటి? కాలగమనంలో చూద్దాం ఎవరి ఉద్దేశ్యాలు బలమైనవో?"

ఈ సవాలు అపర్ణలోని పెంకెతనాన్ని విజృంభింప జేసింది.

"ఏదో కాలక్షేపంగా ఈ ఊరు వచ్చారు, వెళ్ళి పోతారు. మనం ఇక కలుసుకొనేదెపుడు బలాబలాలు పరీక్షించుకోటానికి? ఈ సంవత్సరాంతంలో పద్మ భర్తకు ట్రాన్స్‌ఫరౌతుంది. వెళ్ళిపోతారు."

సుమ జ్ఞానివలె నవ్వింది.

"భావనకుగల బలం గొప్పది" అంటారు. మిమ్మల్ని మీ భావాలనూ నేను మరచిపోలేను. ఈ భావాలున్న మీ జీవితం నడక ఎలాగున్నదో తెలుసుకోవాలనే కుతూహలాన్ని చంపుకోలేను. ఆకుతూహలమే ఎప్పుడో ఎక్కడో మనలను మరలా తారసిల్లజేయవచ్చు.

పద్మా, అపర్ణలు ముఖముఖాలు చూచుకున్నారు.

అన్నట్లు మీరేం చదివారు? మీ గ్రూప్ ఏమిటి?" సుమ అడిగింది అపర్ణను.

పద్మ విడ్డూరంగా వికటహాసం చేసింది.

"అదే వింత. ఆవిడ చదువుకోకున్నా ఆధునికురాలు, నీవు ఎమ్మే బియ్యీడీ అయ్యీ సనాతనురాలవు!"

"ఓ!" సుమ ఈసారి నిజంగా ఆశ్చర్యపోయింది. "మీ భాషా, భావాలూ చూచి నేను చాలా పెద్ద చదువు వూహించాను సుమండీ, ఏమనుకోకండి" సంజాయిషీగా అన్నది.

"ఏముందనుకోడానికి?" అపర్ణ టెక్కుగా అన్నది. లేచి డైనింగ్ హాలులోకి దారితీస్తూ,"మాపుట్టింటివారు బాగా ధనవంతులు. లక్షలు కట్నాలు గుమ్మరించారు. అంచేత వివాహం సమస్య కాలేదు, పెండ్లిండ్లవ్వనివాళ్ళు, కట్నాలిచ్చుకోలేనివాళ్ళు-కాలక్షేపంగా చదువుకుంటూపోతారు. చదివితేనే భాష రానక్కర్లేదు. ఓ నాల్గు పుస్తకాలు చదివే ప్రతివాళ్ళకీ భాష అనర్గళంగా వస్తుంది. అంత మాత్రానికి డిగ్రీలున్నవాళ్లు గర్వపడనక్కర్లేదు."

సుమకు మరి వాదించవలసిన అగత్యం కన్పడలేదు.

సరిగా భోజనాలకు కూర్చున్నారు. పానకాలు వడ్డన కుపక్రమించాడు.

బయట కారు హారన్ విన్పించింది.

రెండునిముషాలలో సతీష్ లోనికి అడుగుపెట్టాడు.

"ఓ! వచ్చారా?" కూర్చున్నచోటునుండి లేవకనే అడిగింది అపర్ణ, చేతికి డిష్ తీసుకుంటూ.

అంతదూరంలోనే ఆగిపోయాడు క్రొత్తవారిని చూచి.

"నమస్కారం" అన్నది పద్మ పలకరింపుగా.

"నమస్కారం" అంటూ మేడమీదికి దారితీస్తూన్న సతీష్‌ను అపర్ణ మాటలు ఆపాయి.

"మీరుకూడ వచ్చేయండి భోజనానికి."

బలవంతంగా ముఖాన చిరునవ్వు పులుముకున్నాడు సతీష్.

"మీరు కానివ్వండి."

కోటును నౌఖరుకు అందించి పైకి వెళ్ళిపోయాడు.

అంతా చూ న్న సుమ అన్నది.

"ఓ! మీరాయనను 'మీరు' అంటున్నారే! 'నువ్వు' అంటారేమో అనుకున్నాను."

"అనాలనే వుంటుందికానీ నాలుక అలా అలవాటై పోయి అదే పలుకుతుంది. చిన్నప్పుడే అయిన పెళ్ళి మూలాన పెద్దవాళ్ళు అలా అలవాటుచేశారు."

సుమ అర్థయుక్తంగా నవ్వి ఊరుకుంది.

మేడమీదికి సతీష్ నిమిత్తం చల్లని మంచినీరు తీసుకు వెళ్తూన్న పానకాలు అపర్ణ ఆదేశం విని ఆగిపోయాడు.

"నువ్వు మాకు వడ్డన కానీయ్. అయ్యగారికేం కావాలో రాము చూస్తాడు. ఒరేయ్ రామూ, ఆ మంచి నీళ్ళు మేడమీదికి తీసుకుపో."

మంచినీళ్ళిచ్చి వచ్చిన రాము చెప్పాడు.

"అయ్యగారు మళ్ళీ త్వరగా ఆఫీసుకు వెళ్ళాలంటండి భోజనం పైకి తెమ్మన్నారు."

"తీసుకెళ్ళనా అమ్మగారూ?" పానకాలు అనుజ్ఞ అడిగాడు.

అపర్ణ టేబుల్ చుట్టూ చూచింది.

అందరికీ వడ్డన ముగించి, తానూ అప్పుడే కూర్చుని డిషెస్ ఒక్కటొక్కటే వడ్డించుకుంటోంది రాజేశ్వరి.

"రాజేశ్వరీ! ఆయన భోజనం సర్దు నువ్వు. రాము తీసుకెళ్తాడు... పానకాలూ నువ్వూ మా వడ్డన చూడు."

రాజేశ్వరి ముఖం ఎంత చిన్నబోయిందో అందరూ చూచారు.

"ఆ పనిచూచాక నువ్వు భోజనానికి కూర్చో, ప్లీజ్, నాకు కూర్చున్న తర్వాత మరలా లేవబుద్ధి కాదు."

ఆజ్ఞను మెత్తగా నవరించింది.

తప్పనిసరిగా లేచి ఆజ్ఞాపాలన కుపక్రమించింది రాజేశ్వరి.

అపర్ణ గర్వంగా నవ్వుకుంది.

"తాను ఎవ్వరినీ సరకు జేయదనీ, భర్తకుకూడ అడుగులకు మడుగులొత్తదనీ అందరికీ తెలియాలి. అప్పుడే తన గొప్ప!"

అంతవరకూ తన తో వాదించిన సుమ తన అధికార రాజ్యాన్ని చూచి ఎంత అసూయపడుతోన్నదో చూడాలని అటు తిరిగాయి అపర్ణ నేత్రాలు,

కానీ సుమ ఏమీ గమనించనట్లే తలవంచుకొని భోజనము చేస్తోంది.

భోజనానంతరం అపర తిలోత్తమలా ముస్తాబైంది అపర్ణ.

వచ్చి డ్రాయింగ్ రూంలో కూర్చున్న స్నేహితులతో ఆలోచనలో పడింది మ్యాట్నీకి ఏ పిక్చర్ చూడాలా అని.

"అయ్యగారు మళ్ళీ యిపుడే వెళ్ళిపోతారట అమ్మగారూ, మీరొక్కసారి పైకి రమ్మని చెప్పమన్నారు."

"ఆఁ, వస్తాన్లే."

అన్నదే కానీ అపర్ణ కదలలేదు. హ్యాండ్ బాగ్ సర్దుకోసాగింది.

"ఇప్పుడు సినిమాకు వెళ్ళి, ఆనక బజారుకు పోగలమా? మరీ ఆలసటగా వుంటుంది" అన్నది పద్మ.

"ఓ! మంచి విషయం గుర్తు చేశారు. మనీ తెమ్మనీ, త్వరగా రమ్మనీ ఆయనకు చెప్పివస్తాను. నెక్లెస్ నేనూ తీసుకోవాలి" అంటూ పైకి పరుగెత్తింది అపర్ణ.

సుమా పద్మా రాజేశ్వరి ప్రభృతులు గుంభనంగా నవ్వుకున్నారు.

"అతడికి అన్నం కావాలో, ఏంకావాలో చూచే ఓపిక లేదు. డబ్బుకోసంమాత్రం ఆతగాడి దగరకు వెళ్ళింది." అన్నది పద్మ.

సుమ ఆశ్చర్యంగా చూచింది.

"నువ్వా ఆవిడను సమర్థిస్తూ మాట్లాడావుగా ఇందాక? మళ్ళీ యిలా ప్లేట్ ఫిరాయించావేమిటి?"

"ఆఁ. ఏదో అంటాంగానీ, మరీ ఎండన పడివచ్చిన మొగుడిని చూచికూడ కుర్చీలోంచి లేవకపోతే నాకు ఉమ్మే యాలన్పించిందిలే, అతగాడెలా భరించుతున్నాడో కాని!"

సుమ తల పంకించింది.

"మీరంతా ఏదో అవసరార్థపు స్నేహితులలాగా కన్పిస్తున్నారు. కానీ నిజమైన స్నేహితులు కారు అక్కా. ఎదుట ఒకమాటా చాటున ఒకమాటా!"

ఆ విమర్శ రుచించని పద్మ రేడియో ఆన్ చేసుకూర్చుంది.

అపర్ణ వెళ్ళేసరికి యింకా భోజనం చేస్తున్నాడు సతీష్.

"ఏం పిలిచారట?"

అంటూ ఎదుట కూర్చున్నామెను "ఇలారా" అని ప్రక్క కుర్చీ చూపాడు సతీష్.

"ఏమిటి?"

"ఇప్పటికి స్నేహితులను వదలి రాగలిగావా నా కోసం?"

అతడి కంఠంలో సరసమూ లేదు, విరసమూ లేదు.

"బాగుంది, అయినా మీరూ మాతో ఎందుక్కూర్చో కూడదు? ఇక్కడ వేరుగా ఏం బాగుంటుంది?"

"అక్కడ మీ ఆడవాళ్ళందరి మధ్యనా నేనొక్కడినీ యిబ్బందిగా వుంటుంది."

"ఆహా! మీ స్నేహితులందరూ వున్న పార్టీలు నేను చూడలేదా?"

"అది వేరు, ఇది ప్రైవేటు లైఫ్, నిజానికి నా కసలు తీరికే లేదు యివాళ, అయినా కాస్సేపు నీతో కబుర్లు చెప్పు కోవచ్చు.. మెదడు చల్లబడుతుంది అని వచ్చాను."

తన మాటలకు సమాధానం రాక యిటు తిరిగి చూచాడు. అపర్ణ తల వాల్చుకుని చీర కుచ్చెళ్ళు సరిజేసు కుంటోంది.

"నా తీరిక లేని పని ఏమిటో అడగరేం?"

"ఏముంటాయి? మీ ఆఫీసు పనులేగా? నాతో కూడ ఆ హర్తాళ్, లాకౌట్లూ ఎందుకు లెండి."

నవ్వేశాడు.

"పోనీ ఏం మాటలాడదలుచుకుంటావో నీవే చెప్పు?"

"ఏం మాటలకూ తీరిక లేదనుకోండి, మధ్యాహ్నం పిక్చర్‌కు వెళ్ళాలనీ క్రింద నా ఫ్రండ్స్ వెయిట్ చేస్తున్నారు."

"ఇంకా టైముందిలే కానీ, సాయంత్రం త్వరగా వచ్చేయి, మనం బయటకు వెళదాం."

"సారీ! నాకు తీరిక లేదండీ, పిక్చర్‌నుండి అటే బజారుకు వెళదామనుకున్నాం.

సతీష్ దరహాస వదనం ఒక్కసారిగా మాడిపోయింది.

"ఎందుకూ?"

"క్రొత్త నెక్లెస్‌లు వచ్చాయట నాకు నచ్చిన డిజైన్ వుంటే కొనుక్కుంటాను."

"ఎందుకు అపర్ణా? క్రొత్తమోజులో రెండ్రోజులు పెట్టుకుంటావు. తర్వాత అది బ్యాంక్ లాకర్లో మూలిగడమేగా? ఇప్పటికే ఎన్ని సెట్లు పడివున్నాయి చెప్పు?"

"అయినా సరే. నాకు కొనవిదే తోచదు, మనీ ఓ ముప్పైవేలు అవసరం, తీసి వుంచండి. అవసరమైతే ఫోన్ చేస్తాను. తెద్దురుగాని."

"అంతగా కొనేదైతే మనిద్దరం చూచి కొనవచ్చులే, నువ్వు అంత పెద్ద బేరాలు ఒక్కతెవూ చేయకు."

"ఒక్కతెనూ కాదు. పద్మా ఆమె భర్తా వుంటారు"

"అలాగే నీ భర్త నీతో వుండాలని నీకు లేదా? డబ్బూ, నగలూ, మినహా నువ్వు నాతో మాటలాడేమాటలే లేవా?"

"ఏ ముంటాయి? మీ ఆఫీసు మాటలు మాట్లాడనా? సాయంత్రం విషయం మీరు ఉదయమే మాట్లాడుతూంటే మరి మధ్యాహ్నం భోజనం విషయం నేనడగడంలో అపరాధమేమిటో? ఫోన్ వెంటనే పెట్టేశారు!"

"ఓ! అదా అమ్మాయిగారి కోపం!"

"కోపం కాదు. అంత చిన్న విషయానికే మీకు విసుగన్పించేంత పాతబడిపోయిందా మన.

"హౌ స్టుపిట్"!

అనడమూ అతడి చేయి ఆమె భుజం చుట్టూ పడడమూ తృటిలో జరిగిపోయాయి.

"ఊఁ."

చిరుకోపం ప్రదర్శిస్తూ బుగ్గన నాప్‌కిన్‌తో అద్దుకున్న అపర్ణ అతడివేస విస్మయంగా చూచింది.

"ఏమిటి భోజనం చేస్తూ......అర్థం లేకుండా."

చెంపను మరోసారి తుడుచుకున్నది, సుతారంగా విసుక్కుంటూ.

సతీష్ బిగ్గరగా నవ్వుతూ, జేబులోనుండి కర్చీఫ్ తీసి సున్నితంగా ఆమె చెక్కిలి ఒత్తుతూ కొంటెగా చూచాడు.

"చూశావా మరి? క్రొత్తలో అది రాత్రైనా, పగలైనా నీకే విసుగుండేదా మరి? నీ ప్రశ్నలన్నిటికీ యిది ఒక్కటే సమాధానం!"

కొంటెతనం వర్షించుతూన్న అతడి చూపుల నెదుర్కొనలేని అపర్ణ తల వాల్చుకున్నది.

భోజనం ముగించి, బయటకు నడుస్తూన్న సతీష్ ఆగి మరలా వెనక్కు వచ్చాడు.

"ఏం ,అంత మౌనంగా వున్నావ్?"

అపర్ణ మాటలాడలేదు.

సతీష్ తిరిగి డ్రాయింగ్ రూంలోనికివచ్చి కూర్చుంటూ వెనుక నే వస్తూన్న అపర్ణచేయి పట్టిలాగి తన సరసన కూర్చుండ బెట్టుకున్నాడు.

"అర్థాంగి వైనంత మాత్రాన అడుగడునా అలుక ప్రదర్శించే హక్కు వుందనుకుంటున్నావన్న మాట?"

దెబ్బ తిన్నట్లు చూచింది అపర్ణ.

సతీష్ హాస్యంగా అనడంలేదనీ గంభీరత ఉట్టిపడే ఆ చూపులే స్పష్టం చేస్తున్నాయి.

అపర్ణలో పెంకితనం స్థానం చేసుకున్నది.

"ఔను, మీ దగ్గర - మీపై సర్వహక్కులూ ఉంటాయి నాకు."

"హక్కా!" రెట్టించాడు సతీష్.

అహం దెబ్బతిన్న రోషం స్పష్టంగా కానవచ్చింది ఆ కనులలో.

"హక్కు కంటె అనురాగాలపైననే నాకు మక్కువ!"

ఒక్క ఉదుటున లేచి విసురుగా కారును సమీపించాడు.

అతడి వదనంలోని క్రోధాన్ని గమనించిన డ్రైవర్ కారు డోర్ తెరచి అటెన్షన్‌లో నిలబడ్డాడు.

ఎప్పటిలాగా తిరిగితిరిగి చూడడం, చిరునవ్వులూ, చేయి ఊపడం జరగలేదు.

కారు సాగిపోతోంటే ఆలోచనతో నిలబడి పోయిన అపర్ణ చాలసేపటికి తేరుకొని లోనికి నడచింది.

తాను తొందరపాటుగా మాటలాడానని ఆమెకు అన్పించడంలేదు.

సతీష్ క్రోధంగా టకటకా మేడమెట్లు దిగడమూ అపర్ణ అరుణ వదనమూ గమనించిన రాజేశ్వరికి లోలోన సంతోషంగా అన్పించింది.

"ఏం ఒప్పుకున్నారా?" అనడిగింది.

"ఆ. ఎందుకొప్పుకోరు? నడవండి పోదాం.

"ఎలా వెళదాం?" సుమ ప్రశ్న.

"నా కారూ, డ్రైవర్ లేరే."

దర్పంగా అన్నది.

"అమ్మగారూ కారు తీయమంటారా?" రాము అడిగాడు.

"ఆఁ."

సినిమా తర్వాత నగల షాపులో ఓ గంట గడిపారు. పద్మ భర్తా, సుమ భర్తా వచ్చివారిని కలుసుకున్నారు.

"అబ్బ! ఇప్పుడు పద్దెనిమిది వేల నెక్లెస్ ఎందుకులే, వద్దు" అన్నాడు పద్మ భర్త.

కొంత తర్కం తర్వాత పద్మ రాజీకి వచ్చింది.

అయితే అపర్ణలో పట్టుదల పెరిగింది. వారిముందు తన ఆధిక్యత చూపాలంటే తాను ఆ సెట్టు పూర్తిగా కొనాలి. పూర్తిసెట్టు ఇరవైఎనిమిదివేలు.

ఆఫీసుకు ఫోన్ చేస్తే అక్కడ సతీష్ లేడనీ ఎక్కడికెళ్ళాడో తెలియదనీ హెడ్ క్లర్క్ చెప్పాడు.

గెస్టుహౌస్‌లో ఏదైనా మీటింగు వున్నదేమోనని అక్కడకు ఫోన్ చేసింది.

అక్కడా లేడు.

'ఓ!' కోపంగా పళ్ళునూరుకున్న ఆమెకు స్నేహితుల ముందు తలకొట్టేసినట్లయింది.

"రేపొచ్చి తీసుకుంటాను. వుంచండి" అని దుకాణ దారునికి చెప్పింది.

స్నేహితులు ఎగతాళిగా చూస్తున్నారేమోనని అను మానం కలిగింది.

ఉక్రోషంతో ఇల్లుజేరిన ఆమె రాత్రి పదకొండు గంటలకు కారుహారన్ విని, సతీష్ లోనికి వచ్చేవరకూ కూడ ఆగలేనంత కోపంతో పరుగునవచ్చింది వరండాలోనికి.

"మీరు సినిమాకు రమ్మంటే రాలేదని యింత అవ మానం చేస్తారా? ఎంత తలవంపులైంది స్నేహితులలో?"

కారుదిగి తలవాల్చుకు మెట్లు ఎక్కబోతూన్న సతీష్ ఇది విని పామును చూచినట్టే ఆగిపోయాడు.

పోర్టికోలో నిలబడే, పై మెట్టు మీదున్న అపర్ణను జబ్బపట్టి క్రిందకు లాగి కారుచుట్టూ త్రిప్పాడు.

"చూడు చూడు! ఏం జరిగిందో?"

అపర్ణ నిర్విణ్ణ అయింది. అయోమయంగా చూడ సాగింది.

కారు అద్దం బీటలు తీసింది.

ముందు అద్దం పగిలేపోయింది.

"యాక్సిడెంటా?" అన్నది.

మాట్లాడక లోనికి నడిచి అలసిపోయినట్లు సోఫాలో

కూలబడ్డాడు. రాముచ్చి బూట్లు విప్పి పై, కోటూ తీసు కున్నాడు. పాసకాలు మంచినీరు తెచ్చాడు.

"ఏమైంది?"

ఎదుట కూర్చుంటూ అడిగింది అపర్ణ.

'నీకు నెక్లెస్ మాత్రమే కాదు, పూలూ, కుంకుమా సకల సింగారమూ చేసుకొనే అదృష్టం దక్కింది మన డ్రైవర్ దయవల్ల ఈనాడు."

అసలే అతి నిదానంగా మాట్లాడే సతీష్ యిప్పుడు మరీ గంభీరంగా తూచి తూచి మాట్లాడుతున్నాడు.

అపర్ణ వివరణకోసం డ్రైవర్ దెస చూచింది.

డ్రైవర్ నాగయ్య అలసినట్లు నేలమీద కూర్చు న్నాడు.

"ఈరోజు చాలా పెద్దగండం గడచిందమ్మగారూ! అయ్యగారు ఏదో పెద్ద మీటింగుకు ఆఫీసర్స్ క్లబ్బుకు మధ్యాహ్నం మూడుగంటలకే వెళ్ళిపోవలసివచ్చిందమ్మ గారూ! పెద్ద పెద్దోరందరూ వచ్చారు. చాలా సేపు మాటాడుకున్నారు. అంతాఅయ్యాక ఇప్పుడు మేం వచ్చే దారిలో—ఆ పార్కు వెనక వీధి లేదమ్మగారూ—పగైతే జనం వుండరు—ఆ వీధిలో మలుపు తిరుగుతూండగా ఏకుమ్మడిన జనం వచ్చి మీదపడ్డారు దుడ్డుకర్రలతో—

నేను ఒక్కసారిగా ఏమైతే అయ్యిందని స్పీడులో లాగించేశాను కారు. లేకుంటే......" తలచుకోవడానికికూడ భయపడుతున్నట్లు కనులు పెద్దవిచేసి గుండె చేతితో సవరించుకున్నాడు నాగయ్య.

"ఏమిటో ఈ గొడవలు రోజూ? పోనీ వాళ్ళడిగిన వేమిటో యిచ్చి పారేయకూడదూ? నిక్షేపంలాంటి కారెలా అయిపోయిందో?"

"కారుపోతే కారొస్తుందమ్మగారూ? అయ్యగారూ, నేనూ బ్రతికి బయటపడ్డం ఈరోజు.

ఆ మాట నాగయ్యచేత చెప్పించుకోవలసి రావడం సిగ్గనిపించింది సతీష్‌కు.

"మీాకేం దెబ్బలు తగులలేదుగా?" కేవలము లాంఛనప్రాయంగా అడిగింది అపర్ణ.

సతీష్ నిట్టూర్చాడు.

అటువంటి తరుణంలో అర్ధాంగిగా ఆమె చూపవలసిన ఆతృత అంతేనా? ఆమెలో ఆందోళనే కన్పించదేం? అంతటి గండం దాటివచ్చాడు పతి—తన అదృష్టంగా భావించి మురిసిపోవడంలేదేం?

అక్కడ ఆత్రంగా గుమిగూడిన నౌకరూ, వంట మనిషీ అందరూ దాటినగండం గురించి ఎంతో సంతోషం వ్యక్తీకరించుతున్నారు.

"అయ్యగారి తల్లికడుపు సల్లనిది. అందుకే గండం దాటింది" అంటోంది లక్ష్మి.

పానకాలుకైతే కన్నీటి పర్యంతమెంది.

ఇంత ప్రొద్దుపోయేవరకు బయట వుండకండయ్యగారూ! ఎంత పెమాదం దాటుకొచ్చారు అయ్యగారూ అమ్మో! మళ్లా జరిగితే యింకేమైనా వుందా?"

సతీష్‌కు కాఫీ అందించడమూ, కోటు ఇవ్వడమూ, బూటు తొడగడమూ, షేవింగ్ సామగ్రి అమర్చడమూ—ఇలా అడుగడుగునా అతడికి చేరువగా మసలే రాము నోట మాటే రానట్టు సతీష్ పాదాలదగ్గర కూలబడ్డాడు, అవ్యక్త ఆవేదనతో.

సతీష్ పెదవులపై నిర్లిప్తహాసం నిలచింది.

"ఊఁ. పోయి పనిచూచుకో" అని ఆర్ద్రంగా రాము వీపుపు తట్టాడు.

"భోజనానికి లేస్తారా? స్నానం చేస్తారా?" అని అడుగుతూన్న అపర్ణ మాటలు అసందర్భంగా తోచాయి అతడికి.

మౌనంగా మేడమీదకు నడచి రెండునిముషాలలో తిరిగివచ్చాడు.

"ఇదిగో నాగయ్యా!"

చేతిలోని అయిదువందలూ డ్రైవరుకు అందించాడు నాగయ్య కదలిపోయాడు.

"ఎందుకు అయ్యగారూ? నా డ్యూటీ నేను చేశాను."

"లేదు. నిజానికి నా ప్రాణానికి ప్రాణం అడ్డువేశావు. ఆ గొడవలో కారుక్రింద వాళ్ళలో ఎవళ్ళైనా పడి వుంటే ఏమయ్యేది? అవన్నీ సందేహించకుండా సమయ స్ఫూర్తితో ప్రవర్తించావు. ఈ సాహసాన్ని నేను పైవారి దృష్టికి కూడ తెస్తాను."

కృతజ్ఞతతో మౌనంగా వుండిపోయాడు నాగయ్య.

"తీసుకో నాగయ్యా! నిజానికిది చాలా తక్కువ. ఈ సంఘటన నేనెప్పుడూ గుర్తుంచుకుంటాను. నీ కెప్పుడేం కావలసినా సంకోచించక నన్నడుగుతూండు."

"తమ దయ!"

డబ్బు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు నాగయ్య.

"అయ్యగారూ! ఉదయం నేనొచ్చేదాకా మీరు కారు తీయొద్దు రాత్రి ఎవరు మాటాడవచ్చినా మీరు లేవకండి. అసలు గేటు తీయొద్దు. ఏం రోజులివి? ఏం నమ్మకము లేదయ్యగారూ! సెలవండి మరి. ఎల్లొస్తాను అమ్మగారూ! ఇంటిదగ్గర ఒక్కతే ఆడపిల్ల! బిక్కు బిక్కుమంటూ ఎదురుచూస్తావుంటది నాకోసం!"

ఆఫీసుకు తయారైన సతీష్ అరగంట ఎదురుచూచినా నాగయ్య డ్యూటీలోనికి రాలేదు.

అసహనంగా అటూ యిటూ పచారు చేయ సాగాడు. మనసులో మాటా మంచీ ఎవరికైనా చెప్పుకోవా లన్నా నౌకర్లు మినహా ఎవరున్నారు?

అపర్ణ యింకా నిద్రలేవలేదు.

రాత్రంతా తాను నిద్రలేమితో గడిపితే అపర్ణ ఆద మఱచి నిదురపోయింది.

"రామూ! కారుతీయి నువ్వు. నాగయ్య యింటి మీదుగా పోనియ్యి."

అన్నాడు తొమ్మిదిగంటలకు క్రిందికి దిగివచ్చి.

"పానకాలు, అమ్మగారిని బయట కెళ్ళవద్దని చెప్పు. ఇంట్లోనే వుండమను. రాత్రి గొడవతో నాకు అనుమానంగా వున్నది ఏమిటో?"

పానకాలు తడబడ్డాడు.

"అయ్య......అయ్యగారూ, ఆ ముక్క కొంచెం మీరే ఫోన్ చేసి చెప్పండి ఆనక. నేను చెబితే అమ్మగారు కోపం చేస్తారు" చేతులు నులుముకున్నాడు.

"అలాగేలే."

కారు సాగిపోతోంది.

సతీష్ ఆలోచనలు తరహా తరహాలుగా సాగుతున్నాయి.

'ఏమిటీ అపర్ణ? నా రాకపోకలూ, నా సమస్యలూ ఏమీ ఆమెకు పట్టనట్లుంటుంది. ఎందుచేత? ఎంతకాలం ఇలా చిన్నపిల్లలా తిరుగుతుంది......వర్కర్ల అశాంతి అంటే మేనేజ్‌మెంట్ చుట్టూ ప్రమాదపు పరదాలు పరచుకోవడమన్నమాటే. ఎంతచెప్పినా ఈ సమస్య ఆమె మెదడులో కొంచెమైనా చోటు చేసుకోదేం? ఏ విషయంలోనూ ఓ సలహా చెప్పే చతురతాలేదు, సహకారం అందించగల సమాన సహృదయతలూ లేవు. ఎంతసేపూ నిద్ర, తర్వాత ముస్తాబూ, షికార్లు పేకాటా, హోదాకు, వయసుకూ తగిన పెద్దరికమే లేదు. ఇద్దరు పిల్లలున్నారనే విషయం అసలు గుర్తున్నట్లే వుండదు. ఎన్నడూ తనకు తానుగా వాళ్ళ ప్రసక్తి తీసుకురాదు.'

కారు సడన్ బ్రేకుతో ఆగింది.

"ఆలోచనలకు సడన్ బ్రేక్ పడింది.

"అయ్యగారూ ... ఆ జనం నాగయ్య యింటి ముందు..."

ఒక్కసారిగా సతీష్ మనసు ఏమిటోగా అయి పోయింది. అనుమానంతో హృదయం తల్లడిల్లింది. ఆ అను మానం నిజమే అయ్యింది.

నాగయ్యా గతరాత్రి పన్నెండుగంటల ప్రాంతంలో అతడి యింటి ముంగిటనే

ఎవరో ఎమిటో ఎవ్వరూ చూడలేదు.

చూచినా చెప్పలేని-చెప్పటానికి ఝుడిసే పేదవారి వాడ అది.

నాగయ్యా కూతురు గంగ-ఇరవై ఏళ్ళైనా వుండ వేమో-హృదయ విదారకంగా రోధించుతూన్నది.

రాము కళ్ళు తుడుచుకో సాగాడు.

నిశ్చేష్టుడై నిలబడి పోయాడు సతీష్, కారుదిగి.

ఘటనా ఘటనల ప్రాబల్యత ఎంత చిత్రమైనది! గత రాత్రి తనను మృత్యువు వాతనుండి రక్షించి, ఇల్లుజేర్చి, హెచ్చరికలు యిచ్చి వచ్చిన వ్యక్తి తననెవరూ రక్షించ లేని ఒంటరిపాటులో దుండగుల అమానుష కృత్యానికి బలై పోయాడు!

తలకొకరీతిగా మాట్లాడుతున్నారు పోగైన జనం,
"రామూ, ఆఫీసులో అందర్నీ రమ్మను."

సతీష్ ఆజ్ఞతో రాము కారు తీసుకు వెళ్ళిపోయాడు.

కొందరు గౌరవంగా, మరి కొందరు నిర్లక్ష్యంగా ఇంకొందరు పొగరుగా చూస్తూండగా మెల్లగా అడుగులు వేస్తూ, ఆ నాగయ్య శరీరం మీద పడి ఏడుస్తూన్న యువతిని సమీపించి, ఆమె శిరసున చేయి వుంచాడు సతీష్.

అతడి కనులనుండి నీటిబొట్లు జారి పడ్డాయి ఆమె తలపై.

"గంగా! చూడు పెద్దయ్యగారొచ్చారే!" అంటూ గంగను ఓ దార్చుతూన్న స్త్రీ ప్రక్కకు తప్పుకున్నది.

"అయ్యగారూ! అయ్యగారూ......మా నాన్న... ఎంత మంచివాడు......"

"గంగ సతీష్ పాదాలు చుట్టుకొని భోరుమన్నది.

"ఒక్కగానొక్క పిల్ల. దాని మీదే పేణాలన్నీ ఎట్టుకు బతికేవోడు. ఎవరికీ ఏనాడూ అపకారం చేసినోడు కాదు. ఆడికి రావలసిన సావుగాదిది." ఓ ముసలమ్మ అంటోంది.

"ఊర్కోయే పిల్లా. ఇంకెంత ఏడిత్తే వత్తాడు? ఊర్కో అయ్యగారొచ్చేరుగా? ఆయనే చూస్కుంటా : అంతా." మరొకామె ఊరట వాక్యాలు పలుకుతూన్న

కర్తవ్యం స్ఫురించింది సతీష్కు.

"గంగా, మీ నాన్నను తేలేను కానీ నీకేలోటూ

రానీయను. కొంచం మనస్సు దిట్టం చేసుకో."

జనం అంతకంతకు ఎక్కువ అవుతున్నారు. పోలీసులు వచ్చారు. ఇటు ఆఫీసు జనం వచ్చారు.

ఇన్స్పెక్టరు వేసే రకరకాల ప్రశ్నలకు గంగ మతి పోయినట్లు చూస్తోంది.

బయటజేరిన జనంలో కొందరు బాధ్యతలేని యువకులు గంగ భవిష్యత్తును గురించి మోటుగా మాట్లాడుకుంటున్నారు.

"వయస్సుందిగా-ఎవరో ఒకడు పుణ్యం కట్టుకుంటా డులే......

"కంపెనీ వాలిచ్చే డబ్బుకోసమైనా ఎవడో ఒకడు జేరదీయకపోడు......"

సతీషుకు ఆ అనాగరిక వాచాలత చాలా బాధ కలిగించింది.

"నాగయ్య తరపువారు - అదే కొడుకులూ వాళ్ళూ ఎక్కడున్నారు?" అనడిగాడు.

"ఇంకెవరూ లేరు బాబూ." అన్నారు యిరుగు పొరుగు.

గంగ మరలా హృదయ విదారంగా శోకించసాగింది.

"నాకింకెవరూ-కనీసం అమ్మ అయినా లేదు బాబుగారూ, నాకు మా అయ్య-అయ్యకు నేనూ తప్ప ఇంకెవ్వరూ లేరు ఏం చేయను? నేనెలా బ్రతకాలి?"

సతీషు హృదయం ద్రవించిపోయింది.

గతరాత్రి తనపై జరుపబోయిన అఘాయిత్యాన్ని తప్పించినందుకు దుండగులు అతడిపై కక్ష తీర్చుకున్నారు. అది నిస్సందేహం, అందరి అనుమానమూ అలాగే వున్నది.

సాయంకాలానికి అది అనుమానం కాదనీ, సత్యమనీ తేలింది.

కొందరి అరెస్టులుకూడ జరిగాయి.

అది శ్రామిక వాడ.

ఒకరిపై ఒకరికి ఆపేక్షలున్నా ఆపదలో ఆదుకొనే ఆర్థిక శక్తి వుండదు.

పైగా ఆడవారూ, మగవారూ, పిల్లలూకూడ తమ తమ పనుల నిమిత్తం బయటకు వెళ్ళిపోతారు.మరి ఈ ఒంటరి యువతికి రక్షణ?

పైగా ఇది హత్యకేసు కావడం వలన ఎవేవో వివరణల కోసం తరచూ పోలీసులు కూడ వస్తారు.

ఈ అమాయకురాలు ఎలా నిభాయించుకోగలదు?

తన అనుమానాలన్నిటినీ ప్రజముందూ, రక్షణోద్యోగుల ముందూ వుంచాడు సతీషు.

"నాగయ్య మరణానికి ఒక విధంగా కారణం నేను. అందువల్ల అతడి కుటుంబ బాధ్యత నేను స్వీకరించడం

న్యాయం. నన్ను రక్షించి నాగయ్య బలి అయ్యాడు. అతడి బిడ్డ ఏకాకిగా పాట్లు పడడం ఎంత మాత్రం న్యాయంకాదు. ఆమెకు మంచి వివాహం జరిపే బాధ్యత నాది. అంతవరకూ మా యింటనే వుంటుంది. తండ్రి లేని లోటూ కష్టం ఆమెకు ఏనాడూ కలుగనీయను. ఇందుకు మీ అందరి సమ్మతి కోరుతున్నాను. ......గంగ తన యిష్టాయిష్టాలు నిరభ్యంతరంగా చెప్పవచ్చు.

తర్జన భర్జనల అనంతరం ఆ వాడకట్టు అంతా విషయాన్ని గంగ యిష్టానికి వదిలి వేశారు.

తామెవరూ ఆమె సంరక్షణా భారాన్ని స్వీకరించడం సాధ్యం కాదని కూడ అంగీకరించారు.

"పోనీ......ఓ పని సేద్దామా బాబూ?" అంటూ ఓ ముసలమ్మ ముందుకొచ్చింది. "ఈ ఈధిలోనే వడ్రంగి ఈరయ్య భార్యపోయి ఏడాదిగా అవస్థపడతన్నాడు ముగ్గురు పిల్లలతో, ఆడికిచ్చి గంగను ముడెట్టేస్తే? బతుక్కి ఓదారి దొరుకుద్ది."

సతీష్‌కు కోపం వచ్చినా తమాయించుకున్నాడు. అప్రయత్నంగా అతడి చూపు గంగపై తిరిగింది.

గంగ నోటితో ఏమీ మాట్లాడకున్నా ఆమె కనులలో క్రోధమూ, అసహ్యమూ తాండవించుతున్నాయి.

సతీష్‌కు సమాధానం దొరికింది. అక్కడ జేరిన జనం అందరి కంటె కొంత భిన్నంగా, అధిక సంస్కారిగా గంగ కన్పట్టింది సతీష్‌కు.

ఆ ముసలామె మాట మద్దతు తీసుకొని, మరొక నడి వయస్కుడు మరో ప్రతి పాదన చేశాడు.

"ఆ ఎఱ్ఱియ్యా లేడూ ఎంకన్న కొడుకు - ఆడిని ఇద్దరు పెళ్ళాలు వదిలేసినారు. ఏదో కొసింత మతి స్థిరం లేదు గానీ, కొంచం డబ్బునోడ్నడే, ఆడికి కట్టబెడితే గంగకు తిండి లోపం వుండదు."

ఘోరంగా వున్న ఈ మాటలు మరి భరించలేక సతీష్ అన్నా,

"అటువంటి మాటలు యిప్పుడు వద్దు, ఆ అమ్మాయి మనస్సుకుదుట పడాలి కొంచెం అంత వరకూ మా యింట్లో వుంటుంది."

డాక్టరూ పోలీసుల తతంగమంతా అయ్యి, నాగయ్య శరీరానికి ఆఖరి సంస్కారం జరిపించి, రాత్రి ఎనిమిది ప్రాంతంలో ఇల్లు జేరాడు సతీష్.

అతడు హాలులో ప్రవేశించుతూండగానే, మేడ బాల్కనీ నుండి శివంగిలా ప్రారంభించింది అపర్ణ.

"ఏం ఈ రోజు కూడ నా మాట గుర్తులేదా? అసలు గుమ్మందాటగానే మీరు నన్ను మరచిపోతారా?

సతీష్ తల ఎత్తలేదు. సమాధానమీయలేదు.

"లక్ష్మి!" అని పిలిచాడు.

పని మనిషి పరుగున వచ్చింది.

"ముందు ఈ అమ్మాయికి భోజనం వడ్డించు. మన నాగయ్య కుమార్తె."

అప్పుడు అందరూ చూచారు సతీష్ వెనుక ఒదిగినిల బడి వున్న గంగను.

ఏడ్చి ఏడ్చి మలినమైన ముఖంతో, భయంతో బాధతో ముడుచుకుపోయి ఓ ప్రక్కన నిలబడిన ఆ యువ తిని అందరూ పరీక్షగా చూశారు.

"మన నాగయ్యను రాత్రే ఎవరో చంపేశారు!" అయ్య గారి కంటె ముందు రాము ఆత్రతగా చెప్పేశాడు.

ఒక్కసారిగా అందరూ "ఆ!" అని ప్రాన్పడి నిలచి పోయారు.

కొంతసేపు వివరాలూ, సానుభూతులతో గడచింది.

"అయితే మీరు ఉదయం నుండీ అక్కడే వున్నారన్న మాట?" అపర్ణ అడిగింది.

"ఔను." ముక్తసరిగా అన్నాడు.

"పాపకాలూ, ఆ అమ్మాయి యిక్కడే వుంటుందిక. వేళకు కాస్త భోజనం కాఫీ అన్నీ చూడు. చాలా బెంగటిల్లి

పోయింది.........లక్ష్మీ, ఆ పక్కగది ఖాళీగా వున్నది కదా! ఆ అమ్మాయి కిచ్చి, నువ్వూ ఆమెకు తోడుగా పడుకో ఏమీ ఎప్పుడూ లోటు జరగనీయకు."

"అలాగే అయ్యగారూ" లక్ష్మీ, పానకాలూ ముక్త కంఠంతో పలికారు.

"నాకో గ్లాసు వేడి పాలు తీసుకురా చాలు. భోజనం వద్దులే పానకాలూ."

మేడమీదకు దారితీసిన భర్త వెనువెనుకనే వెళ్ళింది అపర్ణ.

కోటు స్టాండు మీదకు విసిరేసి అలసిపోయినట్లు మంచాలకు అడ్డంగా వాలిపోయాడు సతీష్.

"రామూ, అయ్యగారి బూట్లు తియ్యి అన్నది అపర్ణ పాల గ్లాసు తెచ్చిన రామును.

తీసి, నిష్క్రమించాడతడు.

"పాలు త్రాగండి."

"

"మిమ్మల్నే, ఇవిగో పాలు."

అలసటగా అయిష్టంగా లేచి కూర్చుని గ్లాసు చేతికి తీసుకున్నాడు సతీష్.

"ఏం ఆ పిల్లకింకెవరూ లేరా?" అడిగింది అపర్ణ.

"లేరు. ఉన్న తండ్రిని మనం మ్రింగేశాం."

"బాగుంది, ఎవరి ఖర్మకొద్దీ వాళ్ళకు జరుగుతుంది. మనమేం చేశాం?"

"                    "

"ఇక్కడెందుకు? అనాథాశ్రమంలో జేర్చండి."

"ఆఁ. జేర్చవచ్చు—మానవత్వం మరచిపోతే."

"అరె! ప్రతి అనవసర విషయం గురించీ అతిగా ఆలోచిస్తారేం? ఎందుకీ అనవసర గోల మనతలమీద?"

సగం త్రాగిన గ్లాసు ప్రక్క టేబుల్ మీద వుంచి కోపంగా ఇటు తిరిగాడు

"ఇదుగో! నీ తలలో పూవులు ఇలా నిలబడి వున్నం దుకు" అంటూ అపర్ణ జడలో తురుముకున్న మల్లెల మాలను లాగి ఆమె కనుల ముందుంచాడు.

'చూచావా? ఈ నీ అలంకారమూ, ఆనందమూ, కులుకూ తళుకూ నిలిపిన మనిషి కూతురావె! పాపం, అంత దుఃఖంలో నీ నీడకు వస్తే పన్నెత్తి పలకరింపక పోతివి. ఓదార్పు మాట ఒక్కటైనా అన్నావా? ఇంతేనా నీ గృహిణీత్వం? పైగా నాకు అనవసర సలహాలా?"

"అయితే ఏమిటి? దాని కాళ్ళు కడుక్కు త్రాగనా?"

"తప్పలేదు. ఏదో చెయ్యి. నన్ను విసిగించకు. వెళ్ళు!"

"సరే, అదేమిటో నేనూ చూస్తాను." రోషంగా పోయి మరో మంచంమీద పడుకుంది.

"వచ్చావా నాన్నా!"

తండ్రిని చూస్తూనే ప్రాణం లేచివచ్చినట్లు ఎదురు వెళ్ళి తేలికపడిన మనసుతో నిశ్వసించింది అపర్ణ. అంతలోనే నీరసంగా ముఖం పెట్టింది.

"నిన్ను కష్టపెట్టి ఇంతదూరం రప్పించాను. ఏమనుకోకు నాన్నా! పరిస్థితి అటువంటిది"

"ఏమిటమ్మా? ఏమిటి? ఏమైంది?" అభయ ప్రసాదించుతూన్న తీరులో వున్నది శరభయ్య వదనం.

"చెప్తా. పైకినడు! భోజనం చేస్తూ విందువుగాని."

మృదుచుల భోజనాన్ని ప్రియమార ఆరగించుతూ, మధ్య మధ్యన ఇంకా ఇంకా తెమ్మని అడుగుతూ, ఇటు కుమార్తె చెబుతూన్న విషయాలను చేదుచేదుగా నంజుకుంటున్నాడు శరభయ్య.

'అయితే అల్లుడుగారు గోపాలక్రిష్ణులైనారన్న మాట!" అంతా విన్న అనంతరం అన్నాడు

అపర్ణ తలపంకించి విచారంగా చూచింది.

"ఎందుకంత బెంగ? నే వచ్చేశానుగా?"

"ఔననుకో."

"అంత నిరుత్సాహమేమిటి? వద్దు. ఇక నీకు బెంగ వద్దమ్మా! అల్లుడుగారు ఆలస్యంగా వస్తారా ఇవాళ?"

"ఆఁ."

"ఆ పిల్ల ఎక్కడ?"

"క్రింద గెస్ట్‌హౌస్‌లో."

"ఓ! అయితే రాజభోగమన్నమాట?"

అపర్ణ నేలచూపులు చూడసాగింది.

"అందగత్తేనేవిటీ?"

"పిలిపించనా, చూస్తావా?"

"వొద్దొద్దు. అంతపని అవసరంలేదు కానీ... వంట వాడినిలా పిలిపించు."

పదినిముషాలలో వచ్చి ఎదుటనిలచాడు వంటమనిషి.

"ఏం పానకాలూ బాగున్నావా?" అని ప్రేమగా కుశలమడిగాడు శరభయ్య.

"చిత్తం. ఇదేనా బాబూ రావడం? ఏడినీళ్లు పెట్ట మంటారా తానానికి? లేక ముందు భోంచేత్తారా?"

"అవన్నీ మీ అమ్మగారు చూచుకుంటారు కానీ నువ్వు అర్జంటుగా ఊరెళ్ళాలోయ్."

"చెప్పండి. ఏ వూరండి. చిటికెలో ఎల్లొత్తాను."

"అబ్బే, చిటికెలో వద్దు. రెణ్ణాల్లు పోయాకరా! లేదా

నేను ఉత్తరం రాసినప్పుడు రా! మీ ఊరెళ్లు. ఈ రాత్రికే అర్జంటు ప్రయాణం!"

తుదీ మొదలూ లేని ఈ ఆజ్ఞవిన్న పానకాలు అయో మయంగా చూస్తూ నిలచిపోయాడు.

"నేనేం తప్పుజేశానయ్యా? పనిలోనుండి తీసేస్తారా అమ్మగారూ?" దీనంగా అడిగాడు.

"పిచ్చిమాలోకం, అదేం లేదోయ్! ఇదిగో నీకు మూణ్ణెల్ల జీతం. ఎక్కడా కుదరకు సుమా! మళ్ళీ నేనుత్తరం రాయగానే బుద్ధిగా వచ్చేయాల తెలసిందా?"

"మా అయ్యగారికి సెప్పి ఎల్లుతాలెండి."

"ఆఁ ఆఁ! అదే వద్దు. నువ్వు అయ్యగారి కిప్పుడేం చెప్పకు. అసలు మాటలాడకు. నేను చెబుతాలే ఇంటినుండి ఉత్తరం వస్తే వెళ్ళిపోయావని."

"మీ ఆజ్ఞ బాబూ మరి!"

"వెళ్ళి నీ బట్టలు సర్దుకో. ఈలోగా నీకేమైనా అవస రాలుంటే డబ్బు పంపుతాం. కార్డువ్రాయి."

"చిత్తం" అంటూ వెళ్ళిపోయాడు.

"ఊఁ. అపర్ణా అర్థమైందా?"

"ఏమిటి నాన్నా నాకేం తెలియడం లేదు."

"వెఱ్ఱిదానా! ఎప్పుడూ నీ వెనుక ఈ నాన్న వుండా

లంటే ఎలా? వంటవాడు లేడు, ఆ వంకన ఆ పిల్లదాన్ని ఈడ్చు వంటింట్లోకి, మెల్లగా ఇంటిపని మనిషిగా మార్చి పారేయ్, తెలిసిందా?"

అపర్ణ వదనం ఆనందంతో వికసించింది.

"ఓ! అలాగే నాన్నా."

"చూడూ. నేను పడుకుంటాను. అల్లుడిగారినైనా ఆ పిల్లనైనా- ఎవరినైనా రేపే ఇక నేను చూచేది. ఎందుకైనా మంచిది- నేనొచ్చినట్టు ఆయన కివాళ చెప్పకు."

"నౌకర్లు చెప్పరూ?"

"ఆఁ! అంత ఆరాగా అడిగేడ్చేదెవరూ? ఇపుడే తెలిస్తే మాత్రం అన్నీ ఒకసారే జరగడం-ఎప్పుడైనా అనుమానం రావచ్చు."

"ఆరా వస్తుందటావా నాన్నా? ఆయన అసలే ముక్కోపి."

"ఆఁ ఏం రాదుగానీ—ముందుచూపు. అంతే. వంటవాడివాళపోయాడు నేను రేపు వచ్చాను. అంతే."

"ఎవరీ అమ్మాయి అపర్ణా? ఇది వరలో మనింట చూచిన గుర్తు లేదు."

"ఎవరని చెప్పేది? ఊరూ పేరు లేని మేళాలకు సత్రం అయ్యింది ఇల్లు"

విసుగుదలనంతా మేళవించి విసురుగా చెప్పిన ఆ జవాబు స్పష్టంగా విన్పించింది గంగకు.

ఫ్రిజ్ డైర్ నుండి పండ్లు తెచ్చి బల్లపై అమర్చుతూన్న ఆమెను పరిశీలనగా చూచాడు శరభయ్య.

ఆ చూపులలో నిర్లక్ష్యం వుంది. చీదరింపు వుంది.

"ఎవరివమ్మాయ్ నువ్వూ?" అని అడిగాడు అధికారం ప్రదర్శించుతూ.

టిఫెన్ ప్లేటు ముందుంచుతూ నిస్సహాయంగా చూచిందే కానీ మాటలాడ లేకపోయింది గంగ.

"నీ పేరేమిటేమిటి?" గొంతు మరి కాస్త పెంచాడు శరభయ్య.

ప్లేటులో టిఫెన్ వడ్డిస్తూ భారంగా కనులెత్తి చూచింది గంగ. అపర్ణ తండ్రి ప్రక్క కుర్చీలోనే కూర్చుని గంగ దెస చూస్తూన్న చూపులు తినివేసేట్టున్నాయి.

"మాటలు రావేమిటమ్మాయ్ నీకు?" కేకలేశాడు.

"హుఁ." విరక్తిగా చిరుహాసం చేసింది.

"మీ అమ్మాయిగారే చెప్పారు కదా, నేను పేరూ వూరూ లేనిదాన్నని?"

తండ్రీ కూతుండ్రు మండి పడుతూ చూచారు.

"తినతిండి లేకున్నా తల తిరుగుడేం తక్కువ లేదు." అంటూన్న అపర్ణ స్వరం తక్కున ఆగిపోయింది మేడ మెట్లు దిగి వస్తూన్న భర్తను గమనించి.

"రండి అల్లుడుగారూ. ఇంకా మీరు లేవలేదని చెప్పిందే అమ్మాయి?......"

"నేను అయిదుకు ముందే లేసాను."

వారిద్దరినీ, వదనం వాడి వున్న గంగనూ మార్చి మార్చి చూశాడు సతీష్.

విషయం చూచాయగా గమనించగలిగిన అతడు భార్యకూ, మామగారికీ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంటూ మరలా గంగ దెస చూచాడు. ఆమె కెటిల్‌లో కాఫీ కలుపుతోంది.

"ఏం కాఫీలు నీవు కలుపుతున్నావు? వంటవాడే మయ్యాడు?" అన్నాడు.

ప్రశ్న తనను ఉద్దేశించినదే అయినా గంగ మాట్లాడలేదు.

"వంటవాడు లేడు." కటువుగా పలికింది అపర్ణ స్వరం.

"ఏం?"

"వాడి ఇంట్లో ఏవో ఇబ్బందులున్నాయని ఊరినుండి టెలిగ్రాం వచ్చింది. రాత్రి బండికే వెళ్ళిపోయాడు."

"ఎప్పుడొస్తాడు మరలా?"

"తెలియదు. ఓ రెండు నెలలు పట్టవచ్చు."

"ఓ!"

కూర్చున్న సతీష్ లేచి ఫోన్ వద్దకు నడిచాడు. అతడి మాటలు వింటూన్న తండ్రీ కుమార్తెలు ముఖ ముఖాలు చూచుకున్నారు.

"ఆ......రావుగారూ, నేనే సతీష్‌ను......మాకు అర్జంటుగా ఓ వంటమనిషి కావాలి——ఆఁ. మా వంట వాడు రెండు నెలలు సెలవు పెట్టాడు.......సరే. పంపిస్తారుగా? ఆఁ—— వుంటాను."

తిరిగి వచ్చి కూర్చున్న సతీష్‌ను గుఱ్ఱుగా చూచింది అపర్ణ.

"ఓ రెండు నెలలకోసం ఎందుకు అంత ఆదుర్దా! క్రొత్తవాళ్ళను వెంటనే నమ్మి ఎలా పెట్టుకోనేది? ఇందరు మనుషులు ఇంట్లో వున్నారు. ఆ మాత్రం సర్దుకోలేరా?"

విస్మయంగా చూచాడు సతీష్.

"ఆశ్చర్యంగా వుంది సుమా? ఏ పసిమనిషి ఆ పనికి వుండాలనీ, లేకుంటే పనులు సక్రమంగా జరగవనీ నువ్వేగా మారాం చేస్తావు?"

అపర్ణకేమీ తోచలేదు సమాధానం చెప్పటానికి.

ముసలాయన కుమార్తె అవస్థకు అడ్డుపడ్డాడు.

ఈ రోజుల్లో క్రొత్తవాళ్ళను నమ్మి ఇంట జేర్చుకోవడంకూడా అవివేకమే అల్లుడుగారూ, ఇంతటి వర్తక వ్యాపారాలున్న గొప్పవారు మీరు, ఇందరు ఆశ్రితులలో ఏ ఒక్కరికి ఆ పని ఒప్పజెప్పితే కాదు చెప్పండి? అహుఁహుఁ! ఊరికే నామాటగా చెప్పాననుకోండి— ఇంతకూ ఈ అమ్మాయెవరూ? ఉదయంనుంచీ వంటగది పనంతా బాగానే చూచుకుంటూన్నట్లున్నది?"

అతడి మనసులో ఉన్నదేమిటో గ్రహించగలిగాడు సతీష్. అంతరంగంలో చెలరేగిన ఆగ్రహం అతడి వదనాన్ని అరుణిమతో నింపింది.

అతిప్రయత్నంతో నిగ్రహించుకోగలిగాడు ఎటువంటి అప్రియ సంభాషణ జరగకుండా.

"ఇంతకూ మీరు......... ప్రశ్న అర్ధోక్తిలో ఆపుతూ, ఇటుతిరిగి భార్య దెస చూచాడు.

అపర్ణ వదనం మరింత అప్రసన్నంగా మారింది

"నేనే రాశాను నాన్నగార్ని రమ్మని" అన్నది ఎటో చూస్తూ.

"అసలు నాకిక్కడ పని వున్నదనుకోండి...అమ్మాయి కూడ రమ్మని రాసింది...అందుకని వచ్చేశాను."

"నాతో ఏమైనా పని వున్నదా?"

ఈ సూటిప్రశ్న శరభయ్యకు కోపం కలిగించినా, పైకి ప్రశాంతంగా "లేదులెండి. అందర్నీ చూచానుగా? అదే ఆనందం. నాకు ఊళ్ళో పనులున్నాయి" అన్నాడు.

"సరే అయితే. నేను రాత్రి పొద్దుపోయివస్తాను. బహుశః మధ్యాహ్నం భోజనానికి రాను. చాలా పనులున్నాయి. అందుకే అలా అడిగాను. ఉంటారుగా నాల్రోజులు?"

"అబ్బే! పనిఅయితే ఈ సాయంత్రమే వెళ్ళిపోతాను."

"వచ్చినరోజే వెళ్ళడం దేనికి? ఎటూ వచ్చారుగా? రెండ్రోజులైనా వుండండి."

ఫలహారం ముగించుతూండగా గంగ కాఫీకప్పు అతడి ముందు వుంచింది

"గంగా! ఈ రోజు నువ్వు ఆఫీసుకు వెళ్ళాలి. నువ్వు సంతకాలు చేయాలి కొన్ని కాగితాలమీద."

"అలాగేనండి."

"ఓపని చెయ్యి. ఆఫీసుకు నాతో వచ్చేయి."

"అలాగేనండి."

తిరిగి మేడమీదికి వెళ్ళిపోతూన్న సతీష్‌ను వెన్నంటి వెళ్ళింది అపర్ణ

పేపరు చేతికి తీసుకుని బాల్కనీలో కూర్చున్న సతీష్ విసురుగా వచ్చి ఎదుట కుర్చీలో కూర్చున్న అపర్ణను ప్రశ్నార్థక వదనంతో చూచాడు

"ఏమిటి మానాన్నను మీరలాగనడంలో అర్థం?"

క్రోధంతో అపర్ణ ముక్కుపుటాలు అదురుతున్నాయి.

"నేనేమన్నాను?" కనుబొమల ముడితో అడిగాడు సతీష్.

"ఎందుకొచ్చారో చెప్పమనలేదూ మీరు మా నాన్నను? ఆయనేమైనా గతిలేక వచ్చారా? కూతురింటికి తండ్రి ఎందుకువస్తారు?"

పేపర్ టేబుల్‌మీద విసిరేసి అసహనంగా లేచి వెళ్ళి పిట్టగోడవద్ద నిలబడ్డాడు సతీష్.

"మీ నాన్నగారుగానీ నీవుగానీ గతిలేక వచ్చారని నేనెప్పుడూ అనలేదు, అనను. అవన్నీ నువ్వే అనుకుంటు న్నావు. అసలు సంగతేమిటి? కొన్నిరోజులనుండి నిన్ను చూస్తున్నాను. నా ప్రతిపనీ, మాటా నీకు వంకలెన్నేవిగా కన్పట్టుతున్నవి. ఎందుచేత?"

తగ్గని తీవ్రతతో ఖంగుమన్నది అపర్ణ స్వరం.

"వంకరపనులు వంకలెన్నేవిగానే వుంటాయి!"

దూకుడుగా గోడదగ్గఱనుండి రెండుఅంగల్లో భార్య కుర్చీవద్దకు వచ్చాడు.

"వంకర పనులా?" పండ్లబిగువున అడుగుతూన్న తీరు అతడి కోపస్థాయిని తెలియజెబుతోంది.

అపర్ణ ముఖం తిప్పుకున్నది.

"నువ్వేం మాట్లాడుతున్నావో ఆలోచించావా అసలు?" మరింత కంఠస్థాయిని పెంచాడు.

బాణంవలె రివ్వున లేచి నిలబడింది అపర్ణ

"మీరేం చేస్తున్నారో, ఎలా ప్రవర్తిస్తున్నారో ఏమైనా ఆలోచించారా అసలు?"

"అదేమిటో స్పష్టంగా చెప్పు. నా ప్రవర్తనకుకూడ వంకలా?"

"ఎందుకా సొంతడబ్బా? మీరేం శ్రీరామచంద్రులా

సత్యహరిశ్చంద్రుడులా? అతి మామూలు మనిషిగా ప్రవర్తిస్తు న్నారు."

"అదేమిటో స్పష్టంగా చెప్పు."

అతడి గర్జనకు అపర్ణ అదరిపడడమే కాదు, అటు ఇటు నాల్గు ఇండ్లలోని వారికి విన్పించి వుండవచ్చు ఆ ఉరుము.

"తెలియనట్టే అడుగుతున్నారే? ఆ పిల్లను తెచ్చి యింట పెట్టారు. వంటవాడు లేనందువల్ల ఆ పిల్ల కాస్త పని చేస్తూన్నందుకే ఎదురుగా మామగారున్నారనే బెదురైనా లేక వగలు కురిపించుతున్నారు. అదెంత అసహ్యంగా వున్నది! ఆఫ్టాల్-ఓ డ్రైవర్ కూతురేగా? ఆశ్రయంలేక వచ్చిన అనాధరాలికి అపురూపమైన మర్యాదలేం అక్కర లేదు!"

"అదా నీ ఫిర్యాదు? ఇంటి పెద్దగా ఎవరికేం కావాలో చూడడం, అడగడంకూడ నేరమా?"

"ఇంటిలో వాళ్ళకైతే ఫర్వాలేదు. పైవాళ్ళ పై అనవసర శ్రద్ధ ఎందుకని?"

"ఆ అమ్మాయి ఎవరో నీకు తెలియదూ?"

"ఏమిటి తెలిసేది? ఓ డ్రైవర్ కూతురు, మన క్రింద పనిజేసే అనేక మంది......"

"ఆపు జెయ్యి!" వినలేనట్లుగా శాసించాడు

"ఏం ఎందుకని? ఆఫ్టారాల్ ఓ పనిదాని విషయంలో....

"కాదు. నా ప్రాణదాత కుమార్తె! అందుకే మనం ఆమెను కష్టంలో ఆదుకోవాలి." కఠినంగా అన్నాడు.

"ఆదుకోవడం వేరు, నెత్తికెక్కించుకోవడం వేరు!"

"ప్రపంచ సరళికి భిన్నమైన నీ నిఘంటువులోని శబ్దార్థాలన్నీ నేర్చుకొనే వ్యవధిలేదు నాకు. ఒక్క విషయం ఆలోచించు నీ అంతస్థును వెనక్కు నెట్టి. నీ భర్త ప్రాణాలను రక్షించడానికి బలైపోయిన త్యాగమూర్తి బిడ్డ ఆమె. నేడు ఏకాకిగా నిలబడింది. మనం యిస్తున్నది కేవలం ఆమెకు రక్షణ మాత్రమే. ప్రాణానికి ప్రాణం ఇవ్వలేదు. ఇవ్వలేము."

"ప్రాణానికి ప్రాణమే యిస్తారో — ప్రాణేశ్వరినే చేసుకొంటారో- ఏం చెప్పగలం?"

"నోర్మూయ్!"

అతి ఆగ్రహంతో లేచిన సతీష్ చెయ్యి.

"ఆఁ! ఆఁ!" అనే వారింపుతో ప్రవేశించిన శరభయ్యను చూచి ఆగింది.

"ఓ!" సాలోచనగా అన్నాడు. "అయితే, మిమ్మల్ని వెనక పెట్టుకొనే బయల్దేరిందన్నమాట పోట్లాటకు!"

"లేదు లేదు. అలా ఆగ్రహం తెచ్చుకోవద్దు అల్లుడుగారూ, ఏదో చెప్పాలని వచ్చి మీ ఘర్షణ విని వెనక్కు

వుండిపోయాను. అంతే" వెకిలిగా నవ్వాడు. కోపంతో మాటలు రాక అటు ఇటు పచార్లు చేయసాగాడు సతీష్.

"ఛీ ఛీ ఛీ." తనలో తాను అనుకుంటున్నా పైకి విన్పించింది. "భార్యను కదా అనే అహంతో ప్రతి పనికీ అనవసర సవాళ్ళూ, అలవిమాలిన ఆంక్షలూ పెడుతూంటే ఆనాటి కానాడు నేనూ అనాగరికంగా మారిపోతున్నాను. ఛీ ఛీ, కట్టుకున్న భార్యపైకి చేయి ఎత్తడం—నా పద్ధతులకే విరుద్ధం."

తల విదిలించుతూ వ్రేళ్ళతో కణతలు రుద్దుకో సాగాడు.

"అదే మరి, అదే. చూశారా? ఏనాడూ లేనిది మీ ప్రవర్తనలో యిప్పుడింత మార్పు వచ్చిందంటే అనారోగ్యం ఏదో మానసికంగా ప్రారంభమైందన్న మాట! అమ్మాయి మొత్తుకొంటూన్నది కూడ అదే!"

"మామగారూ!"

"కోపం వద్దు అల్లుడుగారూ, మిమ్మల్ని తప్పు ఎంచడం కాదు, మీకు తెలియదు. చిన్నతనం, ప్రతిపనికీ ఫలితాలు వుంటాయి చూడండి—వాటిని ఆలోచించాలి. చేసేముందు, ఆ పిల్ల ఎవరైతేనేంగానీ వయసులో వున్నది. మీరు వెంట పెట్టుకు త్రిప్పడం బాగుండదు. ఎంత దయ నైనా లోకం మరో విధంగా అపార్థం చేసుకుంటుంది."

"ఓహో! అయితే మీ తండ్రీ కూతుళ్ళు కలసి నాకు పాఠాలు చెప్పటానికి నిశ్చయించుకున్నారన్నమాట! పథకం బాగుంది."

లేదు లేదు. ఏ పథకమూ లేదు, నేను కేవలం నా పని మీదనే వస్తే, మీ వాగ్వాదం వల్లవిషయం గ్రహించి పెద్దవాడను కదా అని తోచినది చెప్పాననంతే!"

"మామగారూ, మీకు కొన్ని విషయాలు చెప్పాలి కూర్చోండి."

"అయ్యో! తప్పకుండా వింటాను చెప్పండి అల్లుడు గారూ."

"మా కంపెనీలో కొన్ని గొడవలు చెలరేగాయి, వర్కర్స్ హర్తాళ్ చేశారు."

"ఔనౌను. అవన్నీ తెలుసుగా నాకు!"

"వినండి. వాళ్ళ గొడవలు కోర్టులోనే తేలేది సాధారణంగా. అందుకే నేను ప్రమాదాన్ని శంకించలేదు. నిజానికి నాకూ వాళ్ళకూ ఎటువంటి గొడవాలేదు. కానీ ఒకనాడు రాత్రి నేను క్లబ్బునుండి తిరిగి వస్తూండగా హఠాత్తుగా నా కారు మీద దాడి జరిగింది. ఒక ప్రమాదమైన మలుపులో కారు వేగం తగ్గించినపుడు సుమారు వందమంది కఱ్ఱలతో కారును చుట్టుముట్టారు. వెనుక అద్దం భళ్ళుమన్నది. నేను

నా కోటును తలపై కప్పుకొని, "పోనీయ్ యేమైనా సరే" అన్నాను డ్రైవరుతో.

అతడు మొండిధైర్యంతో అతివేగంగా లాగించాడు కారును. అదృష్టవశాత్తూ ఎవరూ కారుక్రింద పడలేదు. ఆ వేగం చూచి ప్రాణభయంతో తప్పుకొని దారిఇచ్చారు. ఇంటికివచ్చాక ఆ డ్రైవర్ని ఎంతో అభినందించింది మీ అమ్మాయికూడ నాతోబాటు. అప్పటికప్పుడు అతడికి అయిదువందలు ఇచ్చాను. తర్వాత కంపెనీవారిచేత ఇంకేమైనా ఇప్పించాలనుకున్నాను. అతడు ఆనందంగా సెలవు తీసుకున్నాడు నా యింటినుండి.

కానీ మూర్ఖుడిని. అది శాశ్వతమైన సెలవు కాబోతుందని ఊహించలేకపోయాను. వారి వైరం యాజమాన్యంతోనేగాని సాటి పనివానితోకూడా వుండగలదని అనుకోలేకపోయాను. తెల్లవారి డ్రైవర్ పనిలోనికి రాలేదు. నన్ను వారిదాడినుండి చాకచక్యంగా తప్పించిన ఫలితానికి ఆ డ్రైవర్ ఆ రాత్రే తన యింటిముందే చంపబడ్డాడు. హంతకులు పట్టుబడలేదు.

"విషయం తెలియగానే హుటాహుటి పరుగెత్తాను. శవంముందు పిచ్చిదానిలా కూర్చునివున్న గంగ ఏడ్చి ఏడ్చి సోలిపోయింది. ఆ దృశ్యం చూచిన నాకు కడుపులో కలచి

వేసింది. నాపై నాకే అసహ్యం వేసింది. ఆరాత్రే నేను వాళ్ళచేతులలో చచ్చివుంటే ఆ డ్రైవర్ బ్రతికివుండేవాడు. గంగకు ఆ దురవస్థ కలిగేదికాదు.

"అది వర్కర్స్ కాలనీ. జనం బాగానే పోగయ్యారు ఎవరికి తోచినమాట వారు విసురుతున్నారు."

"పిల్ల ఒంటరిదైపోయింది. తల్లీ తోడూనీడా అన్నీ ఆడే అయి పెంచుకొచ్చాడు" అంటోంది ఓ ముసలమ్మ.

"ఇరవైఏళ్ళయినా నిండలేదు. ఎలా బతుకుతాదీక ప్రపంచకంలో? పెళ్ళయినా జేసేడు కాదు తెలిపితక్కు వోడు" మరొకామె మాటలు అవి.

బాగా త్రాగి తూలుతున్న వాడొకడు అంటూండగా విన్నాను...

"ఎలాగో బతుకు ఈడ్చడానికి దానికేం ఖరమ? నాలాటోడెవడో ఆదుకుంటాడులే, మాంచి వొయసులో వున్న కట్టదిగదా!"

అదే ఒళ్ళు తెలియని స్థితిలో వున్న మరొకడు ఆ వాచాలతకు ఆమోదపూర్వకంగా పళ్ళికిలించుతున్నాడు.

"కంపెనీవోలు ఏదో పడేత్తారులే. ఆమాట కోసమైనా ఎవడైనా జేరదీత్తాడు." మరోడి ముందుచూపు అది.

జనం ఎంత నిరక్ష్యంగా వున్నారంటే ఒక బాధ్యత

గల పెద్దమనిషి అక్కడకు వచ్చాడనే జంకులేకనే నోటి కొచ్చినట్టు వాగుతున్నారు.

నా ప్రాణానికి ప్రాణం ఫణంగా ఒడ్డిన వ్యక్తి కుమార్తె అంత ప్రమాదావస్థలో వుంటే వ్యక్తిత్వంలేని హీనుడుగా నా యింట నేను హాయిగా కూర్చోగలనా?"

శరభయ్య తలగోక్కున్నాడు.

"ఎలా కూర్చుంటారు? మంచిమనసు మీది. కంపెనీ తరఫునుండి ఏమైనా ఇప్పించవచ్చుగదా?"

"ఇప్పించడానికి కొంత వ్యవధి పడుతుంది."

"ఆ అమ్మాయికి ఏమైనా నౌకరీ ఇప్పించలేరూ?"

"నౌకరీ ఇప్పించడానికైనా దేనికైనా కొంతకాలం తీసుకుంటుందిగదా? ఆమె తండ్రిపోయి పదిరోజులు కాలేదు. ఇంకా అలోమని ఏడుస్తూంది. కనీసం ఈ శోకస్థితిలో... ఆమె మనసు కాస్త కుదుటపడేవరకూ మనం నీడ ఇవ్వ లేమూ? ఓవంక ఏడుస్తూ ఓవంక పని ఏం చేయగలుగు తుంది?"

"అది నిజమే, కానీ చూడండి అల్లుడుగారూ! కృత జ్ఞత పేరుతో భయంకరమైన బాధ్యతలు తలకెత్తుకో కూడదు. భార్య మనసు బాధించి పరాయివాళ్ళ సుఖాలు చూడడం మంచిపనా?"

"హుఁ. నేను ఇంత వివరంగా చెప్పినదంతా బూడిదలో పోసిన పన్నీరైంది. కొంచం మానవత్వంతో ఆలోచించాలి. తీరికూర్చుని బాధపడడం మీ అమ్మాయికి వేడుక అయితే నేనేం చేసేది?"

"అంత పెద్దమాటలెందుగ్గానీ...ఏ అనాథాశ్రమాల్లోనో జేర్చరాదూ ఆ పిల్లని?"

"మామాగారూ!!!"

దిక్కులు పిక్కటిల్లాయి.

"మీ వయసు చూచి ఇంతవఱకూ యింత ఓపికగా వివరించాను. నాకెవరికీ సంజాయిషీలు చెప్పుకొనే అలవాటు లేదు. నా రెక్కలు ఒకరికి రక్షణనీయలేని బలహీనమైనవైతే—నాఇల్లు మరొకరికి ఆశ్రయమీయలేనంత చిన్నదయితే నా సుఖములు మరోపంచకు జేరాలి. పాలించవలసిన వారిని పరాశ్రయానికి పంపి బాధ్యతలు దులుపుకొనే హీనుడిని కాను."

అనేసి తనగదిలోనికి వెళ్ళి ఆఫీసు దుస్తులు వేసుకోసాగాడు.

"హుఁ. చూశావుగదమ్మా అతగాడి కోపమూ, పట్టుదలా! ఇటువంటి సమయంలో కాస్త తగ్గివుండాలి. అవకాశం చూచుకొని పనులు సాధించాలి" అన్నాడు శరభయ్య క్రిందికి వెళ్ళి కూతురితో.

"ఆయన నీతో కూడ అలాగే మాట్లాడారా నాన్నా?"

"ఆఁ. అంతకంటె పొగరుగా" రహస్యంగా అన్నట్టు అన్నాడు. అటుయిటు చూచి. "చూడమ్మా! మర్యాదకు మర్యాదే, మహా గౌరవం యిస్తాడు...మనం పుచ్చుకుంటే, కానీ మనమాట మాత్రం వినడు. చేయదలచుకున్నది చేసి తీరతాడు. అంచేత మనం తెగేవరకూ తాడు లాగొద్దు."

"అంతేనా?"

"అంతే, అతడలా గొణుగుతూనే వుంటాడు. కానీ ఆ పనులూ ఈ పనులూ చేయించి బాగా సాధించు, పడ లేక అదే పారి పోతుంది"

"ఊఁ."

"ఔనూ. నీ పిల్లలిద్దరూ ఆ హాస్టల్లో ఎందుకూ పోకులు బలిసి కానీ......"

సమాధాన మీయక నేల చూపులు చూచింది అపర్ణ.

"వెంటనే తీసుకొచ్చేయి."

ఇబ్బందిగా చూచింది.

"ఏం?"

"అక్కడైతే వాళ్ళు మంచి శిక్షణ నేర్చుకుంటారు." అన్నది నసుగుతూ

"ఆ మాత్రం శిక్షణ ఇక్కడ నువ్వు యివ్వలేవు అంతేగా?"

"

"అసలు సంగతి వాళ్ళ పనులు కాస్త చూడలేవు బారెడు ప్రొద్దెక్కాక లేచి, వంటవాడు ముఖాన కొట్టింది మెక్కి, షోకులు చేసుకుని ఫ్యూరి మీద పడాలి. తిరగాలి వీటన్నిటికీ ఆ పిల్లలు అడ్డు, అంతేగా?"

"అది కాదు నాన్నా......"

"చాల్లే......ఏదికాదు? నాకూ బోలెడు డబ్బుంది. నిన్ను కనుసన్నల్లో పెంచుకున్నాను కానీ ఆమడ దూరం విసి రేశానా ఎప్పుడైనా? పిల్లల ముద్దు ముచ్చట్లు చూచుకో కుండా ఎందుకు?"

"          "

"ఇంట్లో కాస్త సందడిగా తిరుగుతారు, పిల్లలు ఎదుట వుంటే తండ్రికి తన వయసూ, బాధ్యతలూ కూడ ఎపుడూ మరపు తగులవు, తీసుకురా."

ఆఖరి మాటలు బాగా నచ్చాయి అపర్ణకు.

"ఈ రోజే వెళతాను నాన్నా" అన్నది అంగీకా రంగా.

ఆ యిరువురూ అలా మాటలాడు కుంటూండగానే సతీష్ మేడ దిగి వచ్చాడు.

సిద్ధంగా వున్న నౌకరు తళతళ మెరుస్తూన్న బూట్లు అతడి కాళ్ళకు తొడిగాడు.

గాగుల్స్ చేత బట్టి దర్జాగా ఎవరిదెసా చూడక నడుస్తూంటే వెనక సెక్రెటరీ బ్రీఫ్‌కేస్, కొన్ని ఫైళ్ళూ పట్టుకొని వంగి వంగి నడిచాడు.

డోర్ తెరచి సిద్ధంగా నిలబడిన డ్రైవర్, అతడు ఆశీనుడు కాగానే కారును బయలు దేరదీశాడు.

తృప్తి, గర్వమూ తొణికిసలాడాయి శరభయ్య వదనంలో.

"చూశావటమ్మా, ఎంతదృష్టవంతురాలివో, అల్లుడిగారి దర్జాయే దర్జా, అందమే అందం, అనవసర చీకాకులు పెట్టుకోక హాయిగా వుండు——ఆఁ ఇంతకూ ఏదీ ఆ పిల్లను వెంటబెట్టుకు వెళ్ళలేదేం మరి?"

"ఏమో నాన్నా, ఆశ్చర్యంగానే వున్నది."

"నీ కిష్టం లేదని మానేసి వుంటాడు. మంచిదేగా? అలాగా నయానో భయానో అదుపులో పెట్టుకో, మంచి మనిషే, అనవసర రట్టు చేయకు."

ఇప్పటికి అపర్ణ వదనంలో తానే నెగ్గాననే అతిశయంతో సంతోషం తాండవించింది.

శరభయ్య తృప్తిగా నిట్టూర్చాడు.

"మరి నేను వెళ్ళి రానా?"

"ఊఁ"

"పిల్లల్ని తీసుకొస్తావుగా?" మరోసారి హెచ్చరించాడు.

"తప్పకుండా. ఇవాళే బయల్దేరుతా." తృప్తిగా సాగనంపింది తండ్రిని.

గంట తర్వాత సతీష్ పంపిన గుమాస్తా వచ్చాడు. గెస్ట్‌హౌస్ వైపు నడుస్తూన్న అతడిని అపర్ణ పిలిచింది.

"ఏమిటి?"

"కొన్ని కాగితాల మీద గంగ సంతకాలు కావాలని చెప్పారమ్మగారూ అయ్యగారు"

"ఇటు తీసుకురా."

వాటిని అటు త్రిప్పి ఇటు త్రిప్పి చూచింది అపర్ణ.

"వంట గదిలో వుంది గంగ. గెస్ట్‌హౌస్‌లో వుండే పెద్ద కుటుంబపు మనిషి కాదు. గంగతో పని వుంటే నా దగ్గరకు వచ్చి ముందు అనుమతి పొందాలి."

ఆ కఠిన మాటలకు గజగజ వణికిపోతూ "చిత్తం" అన్నాడు ఆగంతకుడు.

"ఇటు పిలుచుకురా గంగను లక్ష్మీ!"

రెండు నిముషాలలో గంగ హాజరైంది పిండి రుబ్బుతూన్న చేతితో.

తండ్రిని పోగొట్టుకున్న బెంగ ఇంకా తీరలేదు. కనులు లోతుకు పోయివున్నాయి. తలకు సంస్కారమే లేదు.

గుమాస్తా ఆమె దెస జాలిగా చూడడం అపర్ణ భరించలేకపోయింది.

"చెప్పు. ఎక్కడ సంతకం కావాలో?"

అతడు చెప్పి కాగితాలందించాడు.

"సంతకం వచ్చా, వేలిముద్రా?" నిరసనగా అడిగింది అపర్ణ గంగను ఎగాదిగా చూస్తూ.

గంగ మాట్లాడలేదు.

మౌనంగా సంతకాలు చేయసాగింది.

"గంగాభవాని!"

"ఓ! ఏం చదివావేమిటి?"

అడిగింది అపర్ణ గంగ అక్షరాల పొందిక చూస్తూ.

"మెట్రిక్ కు చదువుతున్నానమ్మా."

"అమ్మా కాదు. 'అమ్మగారూ' అని ఒళ్ళు దగ్గరపెట్టుకు మాట్లాడు."

"అలాగే అమ్మగారూ!"

"చదువుండీ ఇలా అందరి పంచలకు జేరడమెందుకూ? అంతకు తగినపని చూచుకోరాదూ?"

"నాకై నేను బ్రతకాలనే నాన్న చదివించాడమ్మా!

ఇలా నాన్న అకస్మాత్తుగా పోవాలని తెలిస్తే బ్రతికుండగానే ఏదో పని చూపేవాడేమో?"

సంతకాలు తీసుకుని వెళ్ళిపోతూన్న గుమాస్తాకు చెప్పింది అపర్ణ.

"అయ్యగారిని నాతో మాట్లాడమని చెప్పు ఓసారి."

"అలాగే అమ్మగారూ."

"పనెంతవరకు అయింది?" గంగను అడిగింది.

"వంట పూర్తి అయిందండి. పిండి రుబ్బుతున్నాను."

"త్వరగా కానిచ్చి గారెలు వేసి తెచ్చి టేబుల్ మీద పెట్టు."

ఆజ్ఞాపించి తాను మున్స్టాబు ప్రారంభించింది అపర్ణ. అరగంట అనంతరం సతీష్ ఫోన్ చేశాడు.

"ఏమిటి ఏదో మాట్లాడాలన్నావట?"

ముక్తసరిగా వున్నది సతీష్ ధోరణి.

బహుశః గంగ విషయమై ఏవో నిష్ఠురోక్తులు విన్పించడానికే సనే ఉద్దేశ్యంతో వున్న అతడు అప్రసన్నంగా వున్నాడు.

"నాకు ఇవాళా రేపూ కారు కావాలి."

"కారణం వినవచ్చా?"

"పిల్లలను కాన్వెంటునుండి తీసుకొచ్చేద్దామని."

"ఆc? ఇప్పుడేమీ సెలవులు లేవే?"

"సెలవులు లేవు. అక్కడ మాన్పించి, ఇక్కడే చదివించుదామని."

"ఏమిటీ? నమ్మలేకపోతున్నాను."

"........."

"మాట్లాడవేమిటి? ఏడాది మధ్యలో వాళ్ళని మాన్పించే అభిప్రాయం ఎందుకొచ్చింది?"

"ఏమీ లేదు. అందర్నీ చూస్తోంటే నా పిల్లలూ నా దగ్గరే వుండాలన్పించుతోంది."

" మంచిదే. ఈ విషయం నేనిదివరకే చెప్తే నామాట వినలేదు నువ్వు. వాళ్ళకు టైములకు అన్నీ అమర్చలేనని హఠం చేశావు."

"అదో పెద్ద సమస్యకాదు; ఓ ఆయాని ఏర్పఱచుతాను."

"బాగానేవుంది. కానీ ఈ ఏడు అయిపోనీ, చదువు పాడుచేయొద్దు."

"మహా వాళ్ళేం బియ్యేలూ ఎమ్మేలూ వెలగబెట్టడం లేదుగా? నేనిప్పుడే తీసుకొస్తాను."

"ఏమిటా పట్టుదల? అర్థం చేసుకోవేం? అంతగా ఇప్పుడే తీసుకొద్దామనుంటే రెండ్రోజులలో ఇద్దరం వెళ్ళి తీసుకొచ్చేద్దాం. ఇవాళ నాకు తీరిక లేదు."

"గంటలో మీరు కారునూ డ్రైవర్నూ పంపుతారా, సరే... లేకుంటే నేను టాక్సీమీద పోగలను."

తక్కున ఫోను పెట్టేసింది అపర్ణ.

పట్టరాని ఆగ్రహాన్ని ఎదుటి ఫైల్సుమీద చూపాడు సతీష్.

సరిగా అదేసమయంలో మరికొన్ని ఫైల్స్‌తో లోనికి అడుగుపెట్టిన హెడ్‌క్లర్కు హడలిపోయి తాను వచ్చిన పని మఱచి వెనక్కు పరుగెత్తాడు.

తనకు ఝుడిసి కారును వెంటనే పంపగలడనే నమ్మకతో కూనిరాగం తీస్తూ అలంకరణ చేసుకుంటూన్న అపర్ణ అద్దంలో హఠాత్తుగా ప్రత్యక్షమైన సతీష్ ప్రతిబింబాన్ని చూచి అదిరిపడి వెనుదిరిగి చూచింది.

నిజమే! తనకనులు భ్రాంతి జెందలేదు. నిలువునా క్రోధపు చూపులతో నిలబడిన అతడిని సాధ్యమైనంత నిర్లక్ష్యంగా చూచింది అపర్ణ.

"ఏం, నామీద కోపం మధ్యాన పిల్లలమీద ఎందుకు చూపెడ్తున్నావు? వంటమనిషికూడా లేని ఈ సమయంలో వాళ్ళెందు కిక్కడ?"

అతడి కంఠంలోని తీవ్రత ఆమెనేమీ చలింపజేయ లేదు.

"మీామీద కోపమా? ఇదేమిటి మధ్యన? నేను

మాట్లాడిన ప్రతిమాటా మీకు విపరీతంగా అన్పిస్తోంది ఎందుకూ?"

"విపరీతంగా...అసందర్భంగా వుంటోంది గనుక!"

"అది కేవలం మీ అనుమానం, హాస్టల్సులో కంటే ఇంట్లోనే బాగా పెంచుకోగలమని మా స్నేహితులలో చాల మంది ఈ ఏడాది పిల్లల్ని హాస్టల్స్ నుండి తీసేశారు..... ఈ ఉపయం మనం ఘర్షణ పడినపుడు కూడ మా నాన్న అదే మాట అన్నారు. పిల్లలూ, వాళ్ళపనీ అంటూ లేక తీరికగా కూర్చుని భర్తతో పోట్లాడుతున్నావు" అంటూ నాన్న కూడ నన్ను మందలించాడు. మీరూ, నాన్నా అందరూ కూడ నన్ను మందలిస్తారు. కోపిష్టిది అంటారు, ఏందుకూ? నాకో అభిప్రాయం, యిష్టం అంటూ వుండదూ? నా భర్తనూ, బిడ్డలనూ నా యిష్టప్రకారం నడిపించుకో గల స్వతంత్రత నాకు లేదూ?"

అంటూనే ఏడ్చేసింది.

కరిగి పోయాడు సతీష్ ఆమె కన్నీరు చూచి.

"ఛఛ, ఏమిటిది అపర్ణా? రా, ఇలా రా."

డ్రెస్సింగ్ టేబుల్ వద్దనుండి లేవదీసి తీసుకొచ్చి మంచం మీద తన సరసన కూర్చుండ బెట్టుకుంటూ అన్నాడు.

"అపర్ణా! ఒక్కమాట చెప్పు? నువ్వు ఇద్దరు బిడ్డల తల్లివా లేక నువ్వేఓ పసి బిడ్డవా?"

అపర్ణ యింకా వెక్కిళ్ళతోనే వున్నది.

"పిల్లలు భార్యాభర్తల అనుబంధాన్ని పటిష్టం చేసే తీపి బంధాలు. గుర్తుచేసుకో, మొదట పుట్టిన వాడు బాబు-ప్రధమ సంతానం అవతరించబోతూన్నదనే విషయం మొదటిసారిగా తెలిసినపుడు ఆకాశ విహంగమై ఎగిరింది నా మనసు, పొంగింది హృదయం. కానీ అప్పుడు నీవెలా ప్రవర్తించావు? గుర్తుచేసుకో—

డాక్టర్ని సాగనంపి వచ్చిన సతీష్ కదలి కదలి ఏడుస్తూన్న అపర్ణను చూచి ఖంగారుపడిపోయాడు.

"అపర్ణా, ఏమిటిది? ఏమిటది? ఎందుకా ఏడుపు?"

ఓదార్చేందుకు చెంతకూర్చుని, కన్నీరు తుడవబోయిన సతీష్ చేతిని విసురుగా త్రోసేసింది అపర్ణ.

"నాకీ బిడ్డ వద్దు, నా కిప్పుడే పిల్లలు వద్దు!"

ప్రశాంత వాతావరణంలో హఠాత్తుగా పిడుగులు వర్షించినట్లే అనుభవమైన సతీష్ కొంత తడవు స్థాణువై కూర్చుని పోయాడు.

"ఏమిటి? ఏమిటంటున్నావు?" లాలనగా అడిగాడు.

"ఏమంటున్నానో విన్పించలేదా ఏం?" కసరికొడ్తూ లేచి కూర్చున్న అపర్ణ దుఃఖం అధికమైంది.

"పిల్లలు, రోగాలు, రొష్టులు-ఛీ, నా కసహ్యం ఆ జీవితం, నాకు పిల్లలు వద్దు హాయిగా తిరగనీయకుండా వెధవ బరువు!"

"అ....పర్ణా!"

ఊహించని మాటలు సమ్మెటపోట్లలా తగులుతూంటే వ్రయ్యలైన హృదయంనుండి సంభోదన అతనికే విన్పించ నంత మంద్రస్థాయిలో వెలువడింది.

"ఎటువంటి స్త్రీ పిల్లలను వద్దనుకుంటుంది? అంత ఖంగారు పడిపోతున్నావేమిటి?"

"మీ కేం మగవారు, ఈ బాధలన్నీ పడవలసింది ఆడదే, ఆడదాని కష్టాలు మీ కేం అర్థమౌతాయి?"

దెబ్బ ఎక్కడ తగులవలెనో అక్కడే తగలగా శిలా సదృశుడైన సతీష్‌కు మరి తర్కించవలసిన అవసరం కన్పట్ట లేదు. మౌనంగా తన గదిలోనికి నిష్క్రమించాడు.

మహారణ్యం లాగా మారింది మనసు.

మహత్తరమైన అనుభూతిని మానసిక మథనగా మార్చిన స్త్రీ తన భార్య!

అయినా ఇదేమిటో నమ్మలేకుండా వున్నాడు.

ఆడవారు అపురూపంగా భావించే ఈ విషయాన్ని అపర్ణ అసహ్యించుకోవటంలో అర్థమేమిటి?

అర్ధరాత్రి వరకూ వేచి వున్నా ఆమె భర్తగదిలోనికి రాలేదు. సతీష్ తానే భార్య వున్న గదికి వెళ్ళాడు.

అపర్ణ నిద్రపోలేదు.

కనులు జ్యోతులవలె అరుణ వర్ణంలో వున్నాయి. చెంపకు చేయి జేర్చి దీర్ఘాలోచనలో వున్న అర్ధాంగిని మెల్లగా సమీపించి ఎదురుగా కూర్చున్నాడు.

అపర్ణ అతడిని ఛీదరింపుతో చూచింది.

గమనించనట్లే అన్నాడు లాలనా పూర్వకంగా —

"ఏమిటి అపర్ణా, నీ మనసులో వున్నదేమిటి? నాకు శాంతంగా చెప్పు!"

తీక్షణంగా చూచిన అపర్ణ తీవ్రస్వరంతో అన్నది.

"ఆడదానికి ఇది పునర్జన్మ అని తెలుసా మీకు?"

"వెనుకటి రోజులలో, ఇప్పుడు కాదు. వైద్యం బాగా అభివృద్ధి అయింది."

'అయినా ప్రమాదాలూ కష్టాలూ వుండనే ఉన్నాయి. నన్నసవసరంగా వాగించకండి. ఈ బరువును తొలగించుకోదలచుకున్నాను."

"అపర్ణా!!!"

భూకంపన జరిగినట్లే అయింది.

"ఏమిటంత పెంకెతనగి పోయావు? ఒళ్ళు తెలిసి మాట్లాడు"

"నా జీవితం, నా యిష్టం. ఈ కష్టాలు నేను భరించ లేను." తగ్గని పౌరుషంతో అన్నది.

"సాటివారందరూ నోములూ వ్రతాలతో కోరికోరి పొందే వరం—నువ్వు కాలదన్నుకుంటున్నావా?"

"అబ్బ! అమ్మమ్మల కబుర్లు విన్పించకండి."

"అపర్ణా ఎవరైనా వింటే నవ్వుతారు నీ ధోరణికి."

"నవ్వి నవ్వి చావనీండి. నాకేం? జీవితం నాది, బాధ నాది, బాధ్యత నాది."

"ఊం. కానీయ్. ఆపేశావేం?"

"ఏమిటి మీ గొడవ నాకు?"

"అపర్ణా! నువ్వేదో ఒక పిచ్చి భ్రమలో, అపోహలో వున్నావు. రేపటికి కొంచం ఆలోచించుకొని శాంతపడు. అప్పుడు మాటాడుతాను."

వెనుదిరిగి పోబోయిన అతడామె మాటలు విని ఆగాడు.

"ఆలోచించేదీ, మరి మాట్లాడేదీ ఏమీ లేదు. నేను నా జీవితాన్ని సుఖంగా అనుభవించుతాను కానీ బాధల

మయం చేసుకోను. నా అందాన్నీ, స్వతంత్రతనూ కోల్పో దలచుకోలేదు."

ఆమె మాటలలోని స్థిరత్వం సతీష్‌ను ఉగ్రుని చేసింది.

"నీ అభిప్రాయాలూ-నీ నిర్ణయాలూ నీకు వున్నట్లే అందరికీ తమ తమ అభిప్రాయాలూ ఆశలూ వుంటాయి. నువ్వూ నేనూ జీవితాలను కలబోసుకున్నాం, కలసి నడుస్తున్నాం, నడవాలని బాసలు చేసుకొన్నదే వివాహబంధమైంది. అలాగే మన నిర్ణయాలూ అభిప్రాయాలూ కలబోసుకుని ఒకటిగా నిలబడాలే కానీ ఇద్దరిలో ఎవరికీ విడిగా అభిప్రాయాలూ ఆశల్తూ వుండే హక్కులేదు. నాకు వార్ధక్య దశ వచ్చేసరికి నా కొడుకు చేతికి అందిరావాలి!"

"అబ్బబ్బ! ఆపండి మీ ఉపన్యాసం. కష్టంమీది కానప్పుడు ఎన్నైనా చెప్పవచ్చు. మీరెన్ని చెప్పినా నేను వినను!"

"విని తీరాలి!!"

భవనం దద్దరిల్లేట్లు గర్జించాడు సతీష్.

"మన పెద్దలే గనుక ఇలా ఆలోచించివుంటే మన ఉనికి ఏమయ్యేది? అనవసర ఆర్భాటం చేయకు. అపురూపమైన లాలననూ ఆదరణనూ అందుకొనవలసిన అందమైన సందర్భాన్ని ఎంత హాస్యాస్పదంగా మార్చావో చూడు! మూఢాచారాలనూ, మూర్ఖపు ఆచరణలనూ వ్యతిరేకించ

వచ్చు కానీ లోకన్యాయాన్నీ సృష్టిధర్మాన్నే కాదనే యిటువంటి వితండవాదనలు విలువను పొందవు.”

అపర్ణ వారం రోజులు గడచినా అలాగేవున్నది.

“కొందరిలో యిటువంటి మానసిక అలజడివుంటుంది. ఫర్వాలేదు, ఆవిడే సర్దుకుంటారు.” అన్నది డాక్టర్.

కానీ డాక్టర్ అంచనాకూడ తప్పింది.

ఆఖరుకు ఆఖరి ప్రయత్నంగా విషయం శరభయ్యకు తెలియజేశాడు సతీష్.

తలిదండ్రులు వచ్చి వారంరోజులుండి నచ్చజెప్పిన తర్వాత అపర్ణ కుదుటపడింది.

“గుర్తున్నదా అపర్ణా ఆ సంఘటన?”

“ఇప్పుడవన్నీ ఎందుకు?”

చీర అంచులు సవరించుకుంటూ అన్నది.

“అవసరమే ఒకసారి జ్ఞాపకం చేసుకోవడం. బాబు పుట్టాక వాడిని ఒకనాడైనా ఒడిలోనికి తీసుకోలేదు నువ్వు. పుట్టినక్షణంనుండీ ఆయాను నియమించావు. రెండేళ్ళ తర్వాత పుట్టిన పాపనూ అంతే చేశావు. అప్పు నీలో మాతృత్వం మేలుకోలేదు. మూడు సంవత్సరాల ప్రాయం లోనే ఇద్దర్నీ నర్సరీల పాలుచేశావు ఫేషన్ పేరిట. తర్వాత కాన్వెంటు, హాస్టల్సు! ఎప్పుడో ప్రెుక్కుబడిగా సెలవులకు

తీసుకురావడం పంపడం. అంతకంటె తల్లీ తండ్రిని వాళ్ళెరుగరు. 'నాన్నా అది కావాలి, ఇది కావా'లని అడిగే చనువు వాళ్ళకు లేదు. మఱమనుష్యుల్లా తయారౌతున్నారు."

"ఏమిటీ గొడవంతా యిప్పుడు?" విసుగ్గా అడిగింది.

'ఏమున్నది? మన విషయంగానీ మన పిల్లల విషయముగానీ మనమిద్దరం ఆలోచించి నిర్ణయించుకోవడమనేది జరగడంలేదు. ప్రతీదీ మరెవరో చెప్పిన మాటపైననే నీకు గురీ, నమ్మకమూ."

"........."

"ఇంటికొచ్చేసరికి పిల్లల ఆటపాటలు చూచి మురిసిపోవాలని వుండేది, విన్నావుకాదు. అలవాటుపడిపోయాను ఆ జీవితానికి. నీకు సినిమాలూ, నాకు క్లబ్బులూ వుండనే వున్నాయి. పోనీ పిల్లలు చదువుకుంటున్నారంటే ఇప్పుడా చదువును చెడగొట్టబోతున్నావు. ఇందుకుకూడా మీ నాన్నగారు సలహాయిచ్చారు! నేనూ నామాటా ఎందుకూ కొఱగానివాళ్ళమే కదూ?"

అపర్ణ ఛట్టున లేచింది.

"నా సలహానూ, యిష్టాన్నీ మీరు త్రోసి పారవైచినవుడు నేనూ యిలాగే బాధపడతానని తెలియదా?"

"సలహా సరయినదైతే నేను కాదనను. నాపై కక్ష

పిల్లలమీదికి త్రిప్పకు. అయినా మీ నాన్నగారు ఈ సలహా ఈయడంలో అర్థం?"

"అర్థమేముంది? పెద్దవారుగా ఏదో చెప్తారు అంతే!"

"ఓహో! ఆ ఆజ్ఞను ఆ క్షణమే అమలు పెట్టాలనేంత గౌరవం నీకు ఆయనపై!"

ముఖం మరోదెస త్రిప్పకొన్నది.

"ఆ గౌరవంలో వెయ్యోవంతైనా నాపై చూపితే ఆనందించుతాను. మరో రెండు నెలలు పోయాక పిల్లల్ని నేనే తీసుకొస్తాను నీవు వెళ్ళనవసరం లేదు."

"కాదు. వెళతాను, మరో రోజు అగినా మళ్ళీ నా నిర్ణయం మారిపోవచ్చు!"

"ఓ! ఆఖరి అస్త్రమా?"

"ఏమనుకున్నా సరే, ఓ ఏడు చదువు దండగైతే ఏం కొంప మునిగిపోయింది? త్వరగా చదువు ముగించి వాళ్ళేమైనా ఉద్యోగాలు చేసి మన కడుపులు నింపాలా?"

"యేమో ఏం తెలుసు? ఏ రోజెటు వంటదో మరి?"

మరి మాటలవసరం లేదన్నట్లు బయటకు నడువబోతూన్న అపర్ణను ఆపాడు.

"ఆగు, భోజనం చేసి వెళదాం. నేనూ వస్తున్నాను."

"మీ రెందుకు?"

"ఎందుకా?" ప్రతి అక్షరం ఒత్తి పలికాడు. "నేను పిల్లల పేరెంటునీ, గార్డియన్నీ, నా సంతకాలూ, అనుమతీ లేనిదే ఏ పనీ జరుగదు. తెలిసిందా?"

గది బయటకు వస్తూనే అక్కడ వున్న గంగను చూచి ఆశ్చర్యపోయాడు.

"ఏం? ఎందు కిక్కడకి వచ్చావు?"

పారిపోతూన్న గంగను నిలదీసి అడిగింది అపర్ణ.

"భోజనం సిద్దంగా వున్నదమ్మగారూ; చెప్దామని..."

"అది చెప్పడానికి గదిలోనికి రానక్కర్లేదు. మాకు తెలుసుగా భోజనాలు చేయాలని?" తీవ్రంగా అడిగింది.

గంగ తల వాల్చుకున్నది.

"మా రహస్యాలేమైనా వినాలని పొంచి వున్నట్లు న్నావు. అటువంటి వేషాలు నా దగ్గర సాగవు. తెలిసిందా? నీ హద్దులలో పడివుండు."

సతీష్ ఏమీ మాట్లాడలేదు. గంగ దీనవదనమూ, చిక్కిన ఆకారమూ అతడికి జాలి గొలిపాయి.

"వంట అంతా నువ్వే చేశావా?"

భోజనం చేస్తూ అడిగాడు గంగను.

సమాధానం అపర్ణ నుండి విన్పించింది.

"వేరే అడగాలా? తెలియడం లేదూ ఈ వెధవ రుచి చూ నే?"

గారెలు తెచ్చి వడ్డన చేసింది గంగ.

"ఇవేమిటి? ఇవెందుకూ ఈ రోజు?"

ముఖం చిట్లించి అడిగాడు.

"నాన్న వుంటారని చేయించాను. కానీ ఆయన వెళ్ళిపోయారు."

"అన్నీ టేబుల్ మీద వుంచి వెళ్ళు, నువ్వూ భోజనము చెయ్యి." అన్నాడు గంగను.

"ఇక్కడ కాదు. వంట గది ప్రక్క వసారాలో వడ్డించుకో." ఆజ్ఞాపించింది అపర్ణ.

గంగ వెళ్ళిపోయాక సతీష్ భార్యతో అన్నాడు.

"ఆ అమ్మాయికి క్రొత్తకదా? అలా కసరుకోకు పాపం. మెల్లగా చెప్పు."

"అవసరం లేదు. ఆ మాత్రం ధాటీ లేకపోతే నెత్తికెక్కుతారు."

"మరీ తండ్రి పోయి ఏడ్చేదాని చేత ఈ పిండివంటలు చేయించడం బాగుండలేదు. కొంతైనా మానవత్వం వుండాలి!"

"మీకున్నదిగా దైవత్వం? చాలు! అడుగడుగునా పాఠాలు, నీతులు! భరించలేక ఛస్తున్నాను."

"ఊఁ" నిట్టూర్చుతూ లేచాడు సతీష్.

"నీకేదీ వినే అలవాటు లేకపోయినా నాకు చెప్పే అల

వాటు పోకుండా వున్నది.

"అమ్మగారూ......మరలా ఎప్పుడొస్తారు?"

కారులో బయలు దేరుతూన్న వారి వద్దకు వచ్చి భయం భయంగా అడిగింది XOX.

"ఏం? ఎందుకు నీకు?"

"నేను..     "

"రాత్రికి వంట అక్కరలేదు. రేపు మధ్యాహ్నానికి చేసి వుంచు."

"నేనీ యింట్లో ...... ఒక్కత్తెనూ ......." XOX కనులలో భయం విపరీతంగా కానవచ్చింది.

"ఏం, పిల్లి ఎత్తుకు పోతుందా? ఇల్లంతా శుభ్రం చేసి గిన్నెలు పళ్ళాలు కడిగి అల్మారాలో సర్ది వుంచు."

కానీ XOX భయాలు సమసిపోలేదు. విపరీత ఆందోళన స్ఫష్టీకరించే కనులు సతీష్‌నూ, అపర్ణనూ మార్చిమార్చి చూస్తున్నాయి.

"నువ్వొక్కత్తెవే కాదు. ఇంట్లో యింకా యిద్దరు నౌకర్లు వున్నారు. బయట గేటు కాపలా దారు వున్నాడు. ప్రయాణమై వెళుతూంటే వెధవ సవాళ్ళు."

కోపంగా కారెక్కి కూర్చున్నది.

సతీష్ గ్రహించాడు.

ఆడపిల్ల! పరాయిచోట ... అందునా స్త్రీలులేని

యింట వుండడానికి భయపడ్తోంది. ముగ్గురు పనివాళ్ళూ మగవారు యువకులు ! ఎవరెలాంటివారో ?

ఒక్కసారి గంగ దెస చూచాడు.

'నోరున్నా లేనట్టే తనలో తానే కుమిలిపోయే రకం. ఏమీ పైకి చెప్పుకోదు. భయం, తండ్రిపోయి పదిరోజులైనా కాలేదు. ఒంటరిగా ఎన్నెన్ని భయంకరమైన ఆలోచనలతో తల్లడిల్లిపోతుంది.'

"రా, నువ్వూ మాతో. కారెక్కు" అన్నాడు.

శివంగివలె చూచింది అపర్ణ.

"ఏమిటి? ఎందుకు?"

వచ్చేటప్పుడు పిల్లలుంటారు మనతో. ఏమైనా పని వుంటుంది" అన్నాడు.

"అవసరంలేదు. వాళ్ళేం మరీ పసిపిల్లలు కాదు."

"రానీయ్ ! ఫర్వాలేదు."

"ఇక్కడ వంట? ఎందుకసలు మనమధ్య?"

ఇక ఆమెతో తర్కించలేదు సతీష్.

"డ్రైవర్ ! వెనుక డోర్ తీయ్. గంగా ! కూర్చో."

గంగకు ప్రాణసంకటంగా వున్నది పరిస్థితి. బెదురుతూ అందరిదెసా చూచి గువ్వలా వెనుకసీటులో కూర్చున్నది.

"కొంతదూరం నేను నడుపుతాలే. నువ్వూ వెనక కూర్చో" అన్నాడు డ్రైవర్ని.

పైకి విన్పించకుండా ఏదో గొణుగుతూ అసౌఖ్యంగా అటూ యిటూ కదుల్తూ చీరనూ ముంగురులనూ సవరించు కుంటోంది అపర్ణ. ఆమె ముఖమండలం పృథ్వీమండలాన్నే భస్మం చేయగలంత మహోగ్రతతో మండిపడుతోంది.

అప్రయత్నంగా కారు అద్దంలో చూచిన సతీష్‌కు గంగ పదే పదే కనులు తుడుచుకోవడం కన్పట్టింది. అతడి హృదయం ఆర్ద్రితా పూరితమైంది.

ఇటు అపర్ణ అపరకాళికా రూపాన్ని కూడ అతడు గమనించకపోలేదు.

అరగంట పిమ్మట కారు 'మహిళావికాస్' ఆవరణలో ఆగింది.

"ఓ! సుదినం సుదినం." అంటూ పరుగున వచ్చి నమస్కారాలర్పించింది ఆ నిలయం నిర్వాహకురాలు.

"ఏం కృపావతిగారూ? ఏమిటి విశేషాలు?" అంటూ కారు దిగాడు సతీష్.

"మీ దయవల్ల అంతా కుశలమేనండి. అపర్ణగారూ దిగండి మీరుకూడా. ఒక్కసారి నిలయం చూచి వెళ్ళండి."

"లేదండి, మరోసారొస్తాం. టైములేదు" అన్నది అపర్ణ దర్జాగా.

"మీ పనులేమైనా వుంటే తర్వాత చూచు కోరాదూ? పదండి" అంటూ హెచ్చరించింది భర్తను.

"చూడండి కృపావతిగారూ! ఈ అమ్మాయిని ఇవాళా రేపూ యిక్కడ వుంచండి" అని

"గంగా ఇలారా" అన్నాడు.

"చూడు గంగా! ఇక్కడ నీలాంటి అమ్మాయిలు చాలమంది వుంటారు. ఏం భయంలేదు. రేపు సాయంత్రం నేనొస్తాను మళ్ళా! ఏం?"

గంగ తల ఊపింది.

"ఆఁ వుంచండి వుంచండి. ఎవరీ అమ్మాయి?"

"మాకు కావలసిన అమ్మాయే. తండ్రి ఇటీవలే పోయాడు. నేను తప్ప ఎవరూ లేరు. కొంచం జాగ్రత్తగా చూడండి. వస్తాను."

సాగిపోతూన్న కారులోని సతీష్‌కు రెండుచేతులూ పాలభాగాన జోడించి నమస్కరించింది గంగ.

"ఎందుకా పిల్లనిక్కడకు తెచ్చారు? ఏం మనయింటి కంటె ఇక్కడ భద్రమా?"

"నీకు తెలియదేమో. మీ నాన్నగారిచ్చిన సలహా అదే అనాథ శరణాలయంలో పెట్టమని. నువ్వూ అదే అన్నావు!"

"కానీ యిప్పుడన లేదుగా?"

"నేనూ అనుకోలేదు. మనం వచ్చేవరకూ మాత్రమే ఆమె అక్కడుంటుంది."

"ఈ రెండ్రోజులూ మాత్రం మన యింట్లో వుంటే ఏం పోయేది?"

"ఏమైనా పోయాక తిరిగి యేర్పరచలేమన్నది తెలిసిందిగా? ఆమె తండ్రిని తెచ్చి యివ్వగలమా? అతడు మరణించింది నాకోసం......అలాగే మనం ఒక్కతెనూ వదలి వెళ్ళితే ఏం జరుగుతుందో? ఆడపిల్ల అన్నాక ఎంత జాగ్రత్తగా చూడాలి!"

"ఓహో! చాలా ప్రేమ కురిసిపోతోందే!

"ప్రేమకాదు. బాధ్యత!"

అడుగడుగునా దాని ఎదుటే నామాట గాదంటున్నారు!"

"అపర్ణా!"

క్రోధవివశుడై అతడిటు చూడడంతో కారుప్రక్కకు లాగి మళ్ళా అతడు ఆత్రంగా స్టీరింగు త్రిప్పడంతో సరి అయింది.

"ఇది ఘాట్ రోడ్డు. నేను నడుపుతాను అయ్యగారూ" అన్నాడు డ్రైవర్.

"ఊఁ. కానీయ్."

"దాని ధర్మమా అంటూ మనమూ దాని తండ్రిని జేరుకొందుము."

"ఊఁ." గదిమినట్లే అన్నాడు పళ్ళ బిగువున నెమ్మదిగా.

"మన భండారం డ్రైవర్‌కు కూడ తెలియాలా? నీ ధోరణి కట్టిపెట్టు 'దాని దీని' అంటూ నోరు పారేసు కుంటా వెందుకూ?"

"నా కసలు మీ ఉద్దేశ్యం అర్థంగా కుండా వున్నది."

"చాలా సింపుల్, మనవల్ల ఆ అమ్మాయి ఎవరూ లేనిదైంది. తండ్రి వుంటే తనకంటూ ఓ నీడ, అది చిన్న గుడిసే అయినా తనదంటూ ఓ యిల్లు కలిగి వుండేది. నావల్ల అవి పోగొట్టుకున్నామె నా యింటి నీడన బ్రతకడం న్యాయం. నా బాధ్యత నీదిగా కూడ భావించి ఆ అమ్మాయిని నీవు సరిగా చూస్తే నా జోక్యమే వుండక పోయేది. ఒక ఆడ దానిగా సాటి ఆడదాని కష్టమేమిటో నీకు కొంచమైనా గ్రాహ్యం కావడంలేదు. ఇంత ప్రపంచంలో ఒంటరిదై దిక్కు తెలియక ఏడుస్తూన్న ఆ పిల్ల చేత పిండివంటలు చేయించుకు తినకపోతే నీ ఆకలి తీరదా? వక్క తేవుండేందుకు భయపడ్తోంది. మన వెంట వస్తే ఏం పోయింది నీది? అందుకే అక్కడ వదిలాను."

"అక్కడే వుండనీయండి."

"నాకెవరి సలహాలూ అక్కర్లేదు. నావల్ల అనాథ అయిన ఆమెను అనాథాశ్రయం పాలు చేసే అల్పుడిని కాను. ఆమె జీవితానికి ఓదారి చూపుతాను. ఇక ఎప్పుడూ యిటు వంటి తర్కం పెట్టుకోకు నాతో."

# 6

"అబ్బబ్బ. ఊరినుంచి వస్తూనే ఈ క్రొత్త వంట మని షికి అన్నీ చెప్పి చేయించుకోవడం నాకు తలనొప్పి."

అలసటతో మంచం ఎక్కి మాట్లాడుతోంది అపర్ణ.

సతీష్ మాట్లాడలేదు. మౌనంగా పేపరు చేత బట్టి కూర్చున్నాడు.

అనుకోకుండా సెలవు రావడంతో పిల్లలు ఆనందం అధికమై ఇల్లంతా కేరింతలతో పరుగులు పెడుతున్నారు.

"అబ్బబ్బ. ఈ పిల్లలొకళ్ళు, వెధవ అల్లరి. ఒరే కుమార్, ఆపండ్రా అల్లరి. ఏయ్ చంద్రా, నిన్నే నే ఏమిటా పరుగులు?"

తల్లి బిగ్గరగా అరవడంతో కుమార్, చంద్రా అల్లరి మాని దగ్గరకు వచ్చారు.

"మమ్మీ, ఉయార్ వెరీ హంగ్రీ."

"ఏమిటీ?"

"ఓ! నీ కింగ్లీషు రాదుగా? మాకు చాలా ఆకలిగా వుంది?"

"నోర్మూసు కూర్చోండిగానీ అన్నీ ఇస్తాను." లేచి వంట గదిలోనికి వెళ్ళింది.

ఎక్కడే మున్నాయో అన్నీ నౌకరు చూపగా తెలుసుకుంటున్నాడు వంటమనిషి.

"ఏం నూకయ్యా? మేం వస్తామని తెలియదా?ముందే ఎందుకు చేయలేదు అన్నీ?"

"ఇతడినీ యిపుడిపుడే అయ్యగారి స్నేహితులు పంపారండమ్మా, మీరు వచ్చే ముందే వచ్చాడు."

"అఘోరించారు కానీ ముందు త్వరగా కాఫీ పెట్టు. ఫ్రిజ్‌లో పళ్ళుతీసి పెట్టు పిల్లలకు."

"అబ్బ, ఫ్రూట్స్ తినీ తినీ విసుగ్గా ఉన్నది మమ్మీ. వద్దు" అన్నారు ముక్త కంఠంతో.

"అయితే టిఫెన్ చేసేవరకూ ఆగండి."

"అబ్బా, అయితే ఆడుకుంటాం."

"ఎలాగో ఏడవండి. పోండి."

కసరుకొంటూ మంచం మీద వాలింది.

"మాయదారి పిల్లలు, అడుగడుగునా అన్నీ కావాలి. అబ్బ! నాన్న పిల్లల్ని తీసుకురమ్మన్నాడు, వంటమని షిని పంపేశాడు. మధ్యన నా ప్రాణానికి తెచ్చిపెట్టాడు!"

విసుగ్గా యిటు ఒత్తిగిలే సరికి గుమ్మంలో భర్త నిల బడి వున్నాడు.

అతడి కనులలో జుగుప్స, పెదవులపై హేళనా నర్తిం చాయి.

"అయితే వంట మనిషి అంతర్ధానంలోకూడ మీ నాన్నగారి సలహా వుందన్న మాట?"

లోలోన బెదరినా పైకి బింకం నటించి ముఖం త్రిప్పు కొన్నది అపర్ణ.

"అర్థమైంది మీ పథకం ఛీ" ఛీత్కారం చేస్తూ పోయాడు సతీష్.

అపర్ణకు చాలా చిరాకుగా ఉంది. తన కోపమంతా ఎవరిపై చూపాలో అర్థం కావడంలేదు. మరోసారి వంటగది లోనికి వెళ్ళి కసరుకుంది.

"బాగుందమ్మా, కోపిష్టి యజమానుల దగ్గర నేను పని చేయలేను. మీకూ మీ పనికీ ఓ దణ్ణం!"

వంట సగంలోనే ఆపి వెళ్ళిపోయాడు క్రొత్త వంట మనిషి.

"ఏదీ యింకా మాకేమీ పెట్టవా?"

అంటూ వచ్చిన పిల్లల మీదికి తిరిగింది అపర్ణ కోపం.

"ఏమిటి? అప్పలాళ్ళకు మల్లే ఒకటే పీకేస్తున్నారు? నోరు మూసుకుని వుంటారా లేదా?"

చేతి సత్తువకొద్దీ దబదబ బాదింది ఇద్దర్నీ.

"ఏమిటి తమాషా చూస్తున్నారు? మీరిద్దరూ అఘోరించండి ఈ పూటకు వంటపని" అని రామూ నాక య్యాలపై బిగ్గరగా అఱచింది.

ఇక సతీష్‌కు కలుగజేసుకోక తప్పలేదు. చూస్తూన్న దినపత్రిక విసరివేసి లేచి వచ్చాడు.

అపర్ణ దెస చూడనుకూడా చూడకుండా పిల్లలిద్దర్నీ చెరో చేత్తో పట్టి బైటకు తీసుకెళ్ళాడు.

కొద్దిసేపటికే కారు బయలుదేరడం విన్పించింది. డ్రైవర్ని కూడా పిలువలేదు.

అపర్ణ కోపం మరింత హెచ్చింది. కర్తవ్యం స్ఫురించ లేదు.

కాలుగాలిన పిల్లిలా అటుయిటు తిరుగుతూండగా అనిత వచ్చింది.

ఆమె ఎదుట తన చీకాకు విషయాలు బహిర్గతం చేసుకొనే అర్భక హృదయం కాదు అపర్ణది.

అయినా అనిత సూక్ష్మగ్రాహి. ఇంట ఏదో మార్పును గమనించింది.

"ఏమిటీ అలా 'డల్' గా వున్నావూ ? ఏడీ పాన కాలు కన్పించడేం?"

"వాళ్ళ వూరు వెళ్ళాడులే."

"మరి వంట?"

"ఎవళ్ళో ఒకళ్ళు చేస్తారు. అదేమంత పెద్ద సమస్య కాదు" అన్నది అతి దర్జాగా.

"అన్నట్టు...—మీ బంధువులెవరైనా వచ్చారా?"

'లేదే, ఏం?"

"మరి......రాజేశ్వరి చెప్పింది వారంరోజుల క్రితం మీ యింట్లో ఎవరో అందమైన అమ్మాయిని చూశానని?"

"అపర్ణ గుండె ఒక్కసారి గొంతులోకి వచ్చి నట్లయింది.

'గంగలో అందంకూడా వున్నది!'

మెదడులో మరొక విషపు పురుగు ప్రవేశించింది.

"ఆఁ. మా డ్రైవర్ కూతురులే" అన్నది సాధ్య మయినంత నిర్లక్ష్యాన్ని పలికించుతూ.

"ఓ అందమైన అమ్మాయిని ఆ మహిళాశ్రమంలో జేర్పించారని కృపావతిగారు చెప్పింది. ఏమైనా సంఘసేవల్లో అధ్యక్షులుగా వున్నారేమో...గొప్పవారుకదా అను కున్నాను."

కోపం దిగమింగుకున్నది అపర్ణ.

"అవును. సంఘసేవే. ఆ పిల్లకెవరూ లేరు అనాథ. ఏదో దారి చూపాలని ప్రయత్నం" నిర్మలంగా చెప్పింది.

"ఓహో! ఎంత మంచి మనసులు మీవి? అందుకే కాబోలు...యిప్పుడుకూడా బస్సులో వస్తూ చూశాను... అటే వెళ్తోంది మీ కారు, ఆ మహిళావికాస్ వైపు. మీ వారే నడుపుతున్నారు. అన్నట్లు కార్లో పిల్లలెవరో వున్నారు. వాళ్ళనూ అందులో జేర్చుతారు కాబోలు!"

"అనితా!"

అపర్ణలో ఆ క్షణంలో వున్నంత మహోగ్రమైన రూపు అనితకు అంతకుముందు అపరిచితం.

"వాళ్ళు మా పిల్లలు."

"ఆఁ?"

"ఊటీనుండి తీసుకొచ్చేశాం. మాట్లాడేముందు కాస్త ఆలోచించుకు మాట్లాడలేవూ?"

"సారీ అపర్ణా ...... ఆఁ ఔనూ ...... పిల్లలు ఇప్పుడెందుకొచ్చినట్టు?"

"ఇక్కడే వుంటారిక. ఇక్కడే చదివిస్తాను."

అనితకు అమితాశ్చర్యం కలిగింది.

"ఇక్కడేనా?"

"ఆఁ."

"మరి ఆయా అవసరం కదా? కుదిరిందా?"

"ఇక చేసుకోవాలి ఆ ఏర్పాట్లన్నీ."

"నీ కసలు ఆలోచనలేదు అపర్ణా ! పనివాళ్ళు మన లను విసిగించి చంపుతూన్న ఈ రోజులలో తేరగా ఓ దిక్కు మాలినది దొరికితే...దాన్నెక్కడికో పంపి రాజభోగా లనుభవించమనడమేమిటి, ఇంటిపనులు చేయించుకోక?"

"రాజభోగాలా ?"

"మరి? 'సతీష్‌గారు ఒప్పజెప్పిన అమ్మాయి' అన గానే కృపావతి ఆ పిల్లను ప్రత్యేకంగా చూస్తుంది. తానే ఎదురుసేవ చేస్తుంది కూడా! శుభ్రంగా యింటిపనులు చేయించుకో ఇక్కడుంచి. దిక్కులేనిది గనుక రెండుపూటలా తిండిపెడితే చాలు !"

"నిజమే !"

విషం బాగా ఎక్కించి నిష్క్రమించింది అనిత.

ఆవరణలో ఒంటరిగా కూర్చునివున్న గంగ సతీష్ కారు దిగగానే లేచి వచ్చింది.

అంతవఱకూ దీనంగా ఆందోళనగా వున్న ఆమె ముఖంలో కళ వచ్చింది.

సతీష్‌కు నమస్కరించిందే కానీ ఆమె మాటలాడలేక పోయింది. నేత్రాలనిండా నీరు, కంఠంవఱకూ దుఃఖం,

"ఎలా వున్నావు?"

అంటూ సమీపంగా వచ్చిన సతీష్ గంగ బాగా చిక్కడంగమనించాడు.

"అలా వున్నావేం?" అన్నాడు మామిడి చెట్టు క్రింద తిన్నెపై కూర్చుంటూ.

ఇంతలో ఎవరో అతడిని గమనించారు.

గబగబా కుర్చీ తెచ్చి వేసి నమస్కరించిన ఆ యువతులు గంగ వంక చూచి నవ్వి, అక్కడే నిలబడ్డారు.

"కృపావతమ్మగారు లోపల ఏదో పనిలో వున్నారండి. ఇపుడే వచ్చేస్తారు." అన్నారు.

"అలాగే, తొందరేం లేదు." అన్నాడు సతీష్.

కుర్చీలో కూర్చున్న అతడు "కూర్చో గంగా" అన్నాడు.

గంగ కూర్చోలేదు.

ఆ అమ్మాయి లిరువురూ రక్కన అతడి కెదురుగా దగ్గరగా క్రింది లాన్‌లో కూర్చున్నారు. దూరాన మొక్కలకు నీరు పోస్తూన్న కొందరు యువతులు ఉత్సుకతతో ఇటే చూస్తున్నారు తమ పని ఆపి.

సతీష్‌కు చిరాకూ, కోపం పెనవైచుకొచ్చాయి.

"మీ అవసరం లేదిక్కడ వెళ్ళండి." అన్నాడు సౌమ్యంగానే.

"మీ కేం కావలెనో చూడలేదని పెద్దమ్మగారు కోపం చేసారు మా మీద."

అన్నారు కూర్చున్న తావునుండి కదలకనే.

"చేస్తే నేను చెబుతానులే. నేనీ అమ్మాయితో మాట్లాడాలి. మీరు వెళ్ళండిక్కడి నుండి." నిష్కర్షగా అన్నాడు.

వారిద్దరూ ముఖాలు చిన్న బుచ్చుకుని వెళ్ళి పోయారు.

"ఇలా కూర్చో గంగా."

గంగ మామిడి చెట్టు క్రింది మట్టి అరుగు మీద కూర్చున్నది.

"ఎలా వుందిక్కడ?"

ఒక్కసారి అతడి దెస చూచిందే కానీ ఏమీ మాట్లాడలేదు.

"నీ కిక్కడ బాగున్నదా?"

తల అడ్డుగా వూపింది 'లే' దన్న భావం స్ఫురించే టట్లు.

సతీష్ ఏదో ఆలోచించుతూన్నట్లు రెండు నిముషాలు ఆకాశంలోనికి చూస్తూ గడిపాడు. హఠాత్తుగా దృష్టి గంగ దెస త్రిప్పాడు.

"చూడు గంగా నువ్వు ముందు నేర్చుకోవలసినది—

మనసులో మాటను స్పష్టంగా పైకి చెప్పగలగటం. ఇంత అణకువగా వుంటే బ్రతకనిచ్చే ప్రపంచం కాదిది."

తన శ్రేయోభిలాషను వర్షించే ఆ మాటలకు గంగ చకితురాలైంది. ఆమె వదనంలోని భయదైన్యాలు కొంత తగ్గాయి.

"నువ్వెంత వరకు చదివావు?"

"క్రిందటేడు బియ్యే పరీక్షలు వ్రాయలేకపోయాను. జ్వరం వల్ల......"

"నిన్న మెట్రిక్ అని చెప్పావేమో?"

తల వాల్చుకుని భయంగా అన్నది.

"ఔను. అమ్మగారి కోపం చూచి ఝడిసాను, ఒక సారి మా నాన్న చెప్పిన జ్ఞాపకం — చదువుకున్న ఆడ వాళ్ళంటే అమ్మగారికి కోపమని."

సతీష్ వదనంపై నీలినీడలు క్షణకాలం కదలాడి అంతరించాయి.

"లైవు వచ్చా?"

"రాదండి."

"ఏదైనా ఉద్యోగం యిస్తే చేయగలవా?"

"చెయ్యలేనండి." బెదురుగా అన్నది.

"ఏం?"

చెప్పలేక పోతూన్నట్లు యిబ్బందిగా చేతులు రాచు కోసాగింది.

సతీష్ తన ప్రశ్నను రెట్టించాడు.

"నాన్నకు సాయం చేయాలనే ఉద్దేశ్యంతో రెండు సార్లు——"

"ఊఁ. చెప్పు."

"ఒకసారి టీచర్ పని చేసాను ఒకనెల——రెండవ సారి ఒకరింట్లో పిల్లలను చూచుకుంటూ ట్యూషన్ చెప్పే పనికి కుదిరాను. అదీ——అదీ చేయలేక పోయాను."

ఆమె కంఠం వణకడమూ, వదనం లజ్జారుణం కావడమూ గమనించాడు సతీష్.

"అంటే? నీకు చదువు సరిగా రాదా?"

"వచ్చు." ఒక్కసారిగా తలఎత్తి అతడు తననే చూస్తూండడంతో తిరిగి నేలపై చూపులు నిలిపింది.

అతి నెమ్మదైన స్వరంతో అన్నది.

"రెండు విషయాలలోనూ కూడ — మర్యాదను ఫణంగా కోరారు......"

కుర్చీలో వాలి కూర్చున్న సతీష్ నిటారుగా య్యాడు. ముఖం అతి గంభీరంగా మారిపోయింది.

"మరెప్పుడూ ఉద్యోగం మాట తలపెట్టవద్దని నాన్న గట్టిగా మందలించి మాట తీసుకున్నాడు."

"ఊఁ." బరువైన నిట్టూర్పు విడిచాడు సతీష్.

"అది నాన్న ఉన్ననాటి మాట ఇపుడు నాకు ఏదో పని చేసుకోనిదే ఎలాగ అయ్యగారూ?"

"ఇక్కడ ఏమైనా ఉద్యోగం యిప్పించనా? అందరూ ఆడపిల్లలేగా యిక్కడ? మధ్యమధ్యన నేను వచ్చి చూస్తుంటాను."

"వద్దండి వద్దు." భయకంపితురాలైనట్లు ఆ ఖంగారూ నేత్రాలూ స్పష్టంగా చెబుతున్నాయి.

"ఏం?"

"ఇక్కడా అటువంటి సమస్యలున్నాయని మీతో మాటలాడిన అమ్మాయిలు చెప్పారు." దుఃఖం పరవళ్ళు త్రొక్కుతూన్నది ఆమె కంఠంలో.

సతీష్ ఆలోచించుతున్నాడు.

కేవలం ఆమె అభిప్రాయాలు తెల్సుకోవడానికే అడిగాడు కానీ తనకు యివన్నీ తెలియని విషయాలు కావు.

తోడేళ్ళూ, రాబందులూ విచ్చలవిడిగా తిరిగే సమాజం యిది. ఎక్కడో తప్ప నిజంగా అనాధులకు సేవ చేసే నిలయాలు లేవు.

ఎవరి బ్రతుకు వారిని బ్రతకనీయక అడుగడుగునా అడ్డురావడమేగాక, అతి విలువైనదీ, అమూల్యమైనదే లంచంగా కోరే నీచులు అధికం.

ఇటువంటి యువతులు ఇక ఎలా బ్రతికేది?

"ఏదో ఒక పని మీ దగ్గర యివ్వలేరా అయ్యగారూ? మీరుంటే నాకు భయంలేదు."

కదలిపోయింది సతీష్ హృదయం ఆర్ద్రతతో.

'ఎంత నమ్మకం ఆమెకు తనపై! హాయిగా యిల్లూ, వాకిలీ దిద్దుకొంటూ భర్త చల్లని గుండె గూడులో ఆదమఱచి అలరింపులతో సుఖపడవలసిన తరుణప్రాయంలో యిలా నీడలేక భయాందోళనలతో తల్లడిల్లిపోతోంది.

'తల్లి లేదు, తండ్రి లేదు, తనవారంటూ ఎవరూ లేని ఏకాకి, నిలువ నీడలేని నిరాశ్రయురాలు!'

ఆలోచనలను కప్పిపుచ్చుతూ ప్రకాశంగా అన్నాడు.

"మా యింట్లో వుండడం నీ కిష్టమేనా?"

వెంటనే అంగీకారంగా "ఊఁ" అన్నది.

"డాడ్! హూ ఈజ్ షీ?"

అంటూ కుమార్ కారు దిగి వచ్చాడు, ఆ వెనకనే చంద్రకూడా వున్నది.

"అయిపోయాయా మీ బిస్కట్లన్నీ? ఆకలి తీరిందా?"

"ఓ! ఇక వెళ్దాం."

ఇద్దరూ తండ్రికి అటుయిటు నిలచి గంగను చూడసాగారు.

గంగకూడ ముద్దులొలుకుతూన్న ఆ యిద్దరినీ ఇంతింత కనులతో చూడసాగింది.

"ఈ యిద్దరినీ చూచుకోగలవా? ఇంట్లోనే పని. నీకు పిల్లలతో కాలక్షేపం మినహా మరోపని వుండదు."

ఈసారి గంగ కనులు భయదూరమై, వదనం నిశ్చింతగా కన్పట్టింది.

నిశ్చలంగా అన్నది :

"చూచుకోగలను. పిల్లలు అసలు మిమ్మల్ని విసిగించకుండా చూడగలను."

"మిగిలిన విషయాలు సర్దుకుపోవాలి మరి !"

నేలమీది గడ్డిమొక్కలు పీకుతూ అన్నది.

"మీవంటి వారి యింట నాకు సంఘంనుండి రక్షణ వుంటుంది. మీరిచ్చే భోజనానికి ప్రతిగా ఇంట్లో పనులు చూచుకుంటాను. అంతకంటె నాకేమీ వద్దు. ఎవరేమన్నా సహించుకుపోగలను."

ఆఖరి మాటలలోని శ్లేష ఎవరిగురించో అర్థమైంది సతీష్‌కు.

"నాగయ్య బాధ్యతలు నేను పైన వేసుకుంటున్నాను. నీకు చక్కటి భవిష్యత్తూ, యిల్లూ వాకిలీ ఏర్పాటుచేసే పూచీ నాది. ఎక్కువ ఆలోచించకు. మనస్సు పాడౌతుంది, ఆరోగ్యం పాడౌతుంది. పరిస్థితులనుబట్టి సర్దుకుపోవాలి..."

కృపావతి వచ్చింది పరుగువంటి నడకతో.

"క్షమించాలి. మీరు రాగానే రాలేకపోయాను. లోపల వంటశాలలో పనులు చేయిస్తున్నాను. ఈ మాయదారి పిల్లలు ఇవుడే చెప్పారు నాకు మీరొచ్చినట్టు."

అంటూ దూరంగా వున్నవాళ్ళను కేకలు వేసింది... "ఇదుగో ఏమేవ్, చక్కటి కాఫీలు మూడు తీసుకురా."

మళ్ళీ యిటు తిరిగింది

"మీా పిల్లలాండీ. ఎంత ముద్దొస్తున్నారో!"

"ఔనుకానీ మాకేమీా కాఫీలవీ వద్దు. హైరానపడకండి."

"ఫర్వాలేదు. మీారు ఓచుక్క మా చేతిది తాగితే మా మహద్భాగ్యంగా భావిస్తాం మేము......అవును కానీ ఈ అమ్మాయిని చూశారా? మీారు ఒప్పజెప్పి వెళ్ళారు. ఎంత బతిమాలినా అన్నం తినదు. మాటలాడదు. భయపడి చచ్చానసుకోండి మీారేమంటారోనని."

సతీష్ మౌనంగా విని సాలోచనగా గంగదేవ చూచాడు.

ఆమె అధోవదనంలో ఏ భావమూ ప్రస్ఫుటం కాలేదు.

"ఏదో బెంగలుంటాయి అందరికీ. ఇక్కడి కందరూ

ఏవో బాధలతో వచ్చేవాళ్ళే, అయితే మాత్రం......ఆ పనీ ఈ పనీ చేస్తూ అందరితో కలసిపోతే బాధలు అవే మరపు తగుల్తాయి. వెళ్ళు-వెళ్ళి ఆ మొక్కలకు నీళ్ళు పోయమన్నా. శరీర పరిశ్రమ వుంటే ఆకలి కూడా వౌతుంది."

సతీష్ కల్పించుకున్నాడు.

"తండ్రిపోయిన దుఃఖం ఆమెది. మనం ఎన్ని చెప్పినా బాధ వుంటుంది......ఆఁ. నేను ......"

ఒక అమ్మాయి పరుగున వచ్చింది.

"అమ్మగారూ ఫోన్ వచ్చింది."

కృపావతి పరుగెత్తింది ఆఫీసు గదిలోకి.

మరునిముషంలో సతీష్‌కు పిలుపు వచ్చింది.

"ఫోన్‌లో ఎవరో మీరు కావాలంటున్నారు!"

"నేనా? పద."

ఫోన్ అందుకున్న సతీష్ చెవులు బ్రద్దలైనట్లే అనుభవమైంది. అటు అపర్ణ మాట్లాడుతోంది.

"అక్కడేం చేస్తున్నారు మీరు?"

"ఏం, వచ్చేక చెప్తాను."

"సరే. ఒక మాట!"

"చెప్పు?"

"పిల్లలు మీతోనే వున్నారా?"

"ఆఁ. మాట్లాడించనా?"

"అవసరం లేదు. మీ రిప్పుడక్కడికి ఎందుకు వెళ్ళి నట్లు?"

"నేనొచ్చాక చెప్తానన్నాను కదా?"

"సరే. ఆ పిల్లని ఇక్కడికే పంపించేయమని కృపావతితో చెప్పాను. మీరు చెప్పండి."

"ఏం? ఎందుకూ?"

"ఎందుకా? ఇంట్లో పనికి, యింకెందుకూ?"

"సరే. నేను వచ్చి మాట్లాడతాలే"

"మాట్లాడేదేమీ లేదు. నేను నిశ్చయించాను. అన్నట్లు మన కారులో వద్దు. ఆ పిల్లను వేరే రిక్షాలో రమ్మనండి."

"

"మాట్లాడరేం? అది మీతో కారులో కూర్చుందుకు వీలు లేదు. విడిగా రమ్మనండి."

మౌనంగా రిసీవర్ యథాస్థానంలో వుంచేశాడు సతీష్

"ఆ అమ్మాయిని తీసుకు వెళుతున్నాను. కృపావతి గారూ."

సదరు కృపావతి అసంతృప్తితో చూచింది.

"మీ యిష్టం. కానీ యిక్కడుంటే ఆమెకు మంచిది కదా! ఎవరూ లేరట."

"హుఁ. ఇది తీసుకోండి."

"ఏమిటి?"

తీసి చూచిన కృపావతి కనులు తిరిగాయి.

'అయిదు వందలకు చెక్కు! మాకు విరాళమాండీ?"

"ఔను."

"అయితే అమ్మాయిని ఉంచేస్తారా?" ఆశగా అడిగింది. అందుకే అంత డబ్బును యిస్తున్నాడనుకొని.

"లేదండి." లేస్తూ అన్నాడు. "నాకూ చాలా ధనరాసులున్నాయి. ఇద్దరే పిల్లలు కదా! ఆ అమ్మాయిని ఆదుకో లేనా?"

లేని సంతోషాన్నీ, రాని నవ్వునూ ముఖమంతా నింపుకొన్న కృపావతి తనకు చెప్పిచెప్పి అలవాటైన ఉపన్యాస పదజాలాన్ని వదలింది.

"ఎంత గొప్పమనసు మీది! మీ వంటి ధనవంతులంతా అలా ఒక్కో అనాధను ఆదుకొని ఆశ్రయమిస్తే యిక ఈ అనాధ శరణాలయాలే అనవసరం!"

సాగిపోతూన్న సతీష్ ఆగి వెనుదిరగకనే అన్నాడు.

"నిజమే కానీ, ఆ ఆశ సుదూరంలో కన్పించడంలేదు. కనుక మీ వంటి వారే ఈ శరణాలయాల సేవకు అంకితం కావాలి. ఇందులో వున్న ప్రతి బాలికా, యువతీ మిమ్మల్ని దేవతగా భావించాలి. ఇక్కడి నుండి బయటకు వెళ్ళినవారు దీపం పెట్టి మిమ్మల్ని తలచుకోవాలి. శరణాలయాన్ని దేవాలయంగా తలపోయాలి. ఆ పద్ధతిలో నడిపిన నాడు నా సహాయము కూడా మీకు వుంటుంది తప్పక.

"ఆ సందేశం మాటున దాగిన నిగూఢార్థమూ, హెచ్చరికా కృపావతిని కొంతసేపు వాయుస్తంభన జరిగినట్లు నిలబెట్టి ఉంచాయి.

హుం. నన్నే ఎత్తి పొడుపు మాటలతో అవమానించుతావా? ఇక చూస్కో నాతడాఖా' అని ముక్కుపుటాలెగరేసి నాగులాగా బుస్సు మనేట్లు చేసింది.

# 8

బయట లాన్‌లోనే ఈజీ ఛైర్‌లో కూర్చున్న అపర్ణ వదనం అతి తీక్షణంగా ధుమ ధుమలాడుతోంది.

వారి రాకకోసమే ఎదురు చూస్తూన్నట్లుగా, కారు గేటు దాటి లోనికి వస్తూండగానే సిటారుగా కూర్చొని తీవ్రంగా చూసింది.

ముందు కేరింతలు కొడుతూ పిల్లలు దిగారు. వెనుక సీటునుండి గంగ దిగింది. మరో మనిషి కూడా వచ్చాడు

గంగ చేతిలోని ప్యాకెట్లపై నిలిచిపోయింది అపర్ణ దృష్టి.

"ఇడుగో ఈతడు రాఘవులు—నా ఫ్రెండ్ శివరావు యింట్లో చేసేవాడు. వాళ్ళు వెళ్ళిపోయారు కదా! బజార్లో కన్పిస్తే తీసుకొచ్చాను. మనకు వంట చేస్తాడు" అంటూ లోనికి దారితీశాడు సతీష్.

రాఘవుల్ని రాము వెంటబెట్టుకు వెళ్ళాడు లోనికి.
గంగ అపర్ణ దగ్గరకు వచ్చి నమస్కరించింది.
కాల్చి భస్మం చేసేట్లు చూసింది అపర్ణ.
"అవేమిటి చేతిలో?"

"నాకు......బట్టలు అమ్మగారూ!"

"ఏం మహారాణిని కారుమీద తేవాలా? రిక్షా కట్టించుకు రాలేదూ?"

లోపలకు వెళ్ళిపోతూన్న సతీష్ తిరిగివచ్చాడు.

"లోపలికి వెళ్ళు. పిల్లల పని చూడు" అని గంగనూ పిల్లలనూ లోనికి పంపేశాడు.

"ఆ అమ్మాయి తండ్రి జీతమే వచ్చింది ఈ నెలది. దానిలోనే కొనిపెట్టాను. కారుమీద నేనే తీసుకొచ్చాను. ఆ అమ్మాయి కావాలనలేదు. ఎందుకు తీసుకురమ్మన్నావు? నేను అక్కడికి వెళ్ళినట్టు నీ కెవరు చెప్పారు?"

కెదురు కుర్చీలో వాలుతూ అడిగాడు.

అపర్ణ వెంటనే మాట్లాడలేదు.

"ఎందుకు తీసుకురమ్మన్నావా అమ్మాయిని?" మరలా అడిగాడు.

"మీా రెందుకు వెళ్ళారక్కడికి?" ఎదురుప్రశ్న విసరింది అపర్ణ.

సతీష్ సమాధానం చెప్పక ఆమెనే సూటిగా చూడసాగాడు.

"ఏమిటా చూపు?"

"నే నక్కడికి వెళ్ళినట్టు నీ కెవరు చెప్పారు?"

"ఎవరైనా చెప్తారు, నా శ్రేయోభిలాషులు."

"ఎందుకంత నిఘా నాపై?"

"నా నిషా కాదు, మీ ప్రవర్తనే నలుగురూ చెవులు కొరుక్కునేట్లు చేస్తోంది."

"అంటే?"

"ఏమిటండీ పెద్ద తెలియనట్లు అమాయకంగా అడుగుతారు? లోకంలో ఎందరు అనాథలు లేరు? అందరిపైనా మీకింత ప్రేమ కురిసిపోతోందా?"

"ఆ అందరూ నీ గురించీ, నా గురించీ అనాథలైన వాళ్ళు కాదు! ఈ అమ్మాయి అనాథ కావడానికి బాధ్యులం మనం!"

కూర్చున్న తావునుండి లేచాడు విసుగ్గా.

"ఇంతకూ ఆ అమ్మాయిని ఎందుకిక్కడకు తీసుకు రమ్మన్నావు?"

"మీరు వంటమనిషిని తీసుకొస్తారని తెలియక."

"అయితే పంపంచేయనా మళ్ళీ?"

మరింత కోపం పుంజుకున్నది అపర్ణ ముఖం.

"ఏం? ఆ వంకన రోజూ పోయి దర్శనం చేసుకుందామనా? వెంటపెట్టుకు బజార్లు తిప్పుదామనా? ఇక్కడే పడి వుంటుంది నా ఎదుట."

"మనిషి తోటి మనిషికి సాయం చేయడమే అపరాధం కాదు. అపరాధంగా భావించేది నీ అజ్ఞానపు మనసు. అనవసర ఊహలతో ఆమెకు నరకం చూపకు. ఇట్లో పిల్లలుంటారు యిక. వాళ్ళ ఎదుట మనకు భేదాలూ తర్కాలూ

మంచిదికాదు. వాళ్ళ పనులకు గంగకూడ అవసరమే. మని షిని మనిషిగా గౌరవించు. నీ పెద్దరికం నిలబెట్టుకో."

"ఈ రోజున్నర కోసమే అయిదువందలు ఎందుకు సమర్పించారు ఆ కృపావతికి?"

వెనుకనుండి సూటి బాణం వచ్చి తగిలి నిలవేసింది సతీష్‌ను.

"ఓ!" కనులు తమాషాగా త్రిప్పుతూ గుండ్రంగా తిరిగాడు.

"అయితే......నీ గూఢచారులలో కృపావతి ఒకతె. తెలిసింది!"

"నా ప్రశ్నకు సమాధానం? ఎందుకంత యిచ్చారు? ఇంకా ముందు ముందు ఎవరిని జేర్పించుతారేమిటి అందులో యిప్పటినుంచీ ఆకట్టుకొంటున్నారు?"

రెండు చేతులూ జోడించాడు సతీష్.

"అటువంటి దీనదశ ఎవరికీ రావాలని నేను కోరుకో వడంలేదు. ఆ దైన్యదశలో బ్రతుకుతున్నవారిని బాగా చూడమని నేను ఉన్నవాడిగా యివ్వగలిగినంత యిచ్చాను".

ఆ అగ్ని అంతతో ఆరలేదు.

భోజనాలవద్ద, పడకగదిలోనూ కూడ అపర్ణ ధుమ ధుమలాడుతూనే వుంది. అయితే, సతీష్ ఏవో ఆఫీసు ఫైల్స్ చూస్తూ వుండిపోవడంతో ఆమెకు ఆ అశాంతిని పైకి వెళ్ళ గక్కి యుద్ధం చేసే అవకాశం కలుగలేదు.

ఫైల్సు మూసి ప్రక్కన పెడుతూ ఇటు తిరిగి చూచిన అతడి మనశ్శరీరాలు అనిర్వచనీయమైన బాధకు లోనయ్యాయి.

డబుల్ కాట్ పై హాయిగా నిద్రపోతోంది అపర్ణ.

తనను తీవ్రమైన అశాంతికీ ఆవేదనకూ గురి చేసి ఆమె హాయిగా నిద్రపోతుంది. ఎలా వస్తుంది అంత నిద్ర?

లైటుతీసివేసి బెడ్ లైట్ వేసి పక్కపై వాలాడే కానీ నిద్ర రావటం లేదు. గాలికి తెరలు ఎగురుతూండగా కిటికీ నుండి పూర్ణ శశాంకుడు దోబూచులాడుతూన్నాడు.

లేచి వెళ్ళి తెరలు తొలగించి బయటకు చూస్తూ నిల్చు బడ్డాడు.

చల్లని గాలి ఆహ్లాదకరంగా మేనును చుంబిస్తోంది. వెన్నెలలో మేడ చుట్టూ వున్న తోట సౌందర్య రాణియై మెరసిపోతోంది.

ఆ వెన్నెలలో తన సహచరిణితో చెట్టాపట్టా లేసుకు విహరించాలని వుంటుంది. ఫల పుష్ప పత్రాలలో ఒకరుగా ఆ ప్రకృతిలో కలసిపోవాలనీ, జీవన మాధుర్యాన్ని పచ్చని ప్రకృతిలో అనుభవించాలనీ అభిలషించడమే కానీ, ఆ అభిరుచి అపర్ణకు లేదు.

"పచ్చికబయళ్ళమీద పచ్చి శృంగారం ఒలకబోయడానికి మనమేం సినిమాలో యాక్ట్ చేస్తున్నామా? పడక గదికే మన ప్రణయం పరిమితం....."

"చలిగాలి ఎక్కువ తగిలితే నా చర్మం పాడౌతుంది. అందం తగ్గిపోతుంది......"

"వానలో తడవలేను నేను. అనారోగ్యం చేస్తే అందం తగ్గడం మొదలౌతుంది......"

ఇవీ అపర్ణకు గల అమూల్యాభిప్రాయాలు.

అనేక విధాల అలసిపోయి వచ్చే భర్తను ఆదరించాలనీ తెలియదు ఆదమఱచి నిద్రించేట్లు అలరింప జేయాలని తెలియదు. ఆమె ఆనందమూ, అలవాట్లే ఆమెవి.

పిల్లల్ని తీసుకు వచ్చిందే కానీ వాళ్ళకేం కావాలో చూచిందా?

కనీసం ఈ రాత్రైనా దగ్గర పడుకోబెట్టుకుందా?

పిల్లల ఆలోచన రాగానే మేడదిగి వెళ్ళాడు.

కుమార్, చంద్రా తమతమ పక్కలమీద హాయిగా నిద్రపోతున్నారు.

'హుఁ. హాస్టల్ జీవితమూ, తలిదండ్రులు లేకుండా బ్రతకడమూ అలవడిన వాళ్ళు!"

కానీ వాళ్ళ గదిలో మంచినీళ్ళు లేవు.

ఏ రాత్రి వేళైనా దాహమైతే?

కరెంటుపోయి వాళ్ళు చీకట్లో భయపడితే?

అపర్ణకు ఇవేమీ చూడాలని తెలియదా?

పానకాలైతే పిల్లల పనులు కొంచం బాధ్యతగానే చేసేవాడు.

'పోనీ గంగనుకూడా పిల్లల గదిలో నే పడుకోమంటాను సాయంగా ఉంటుంది.

గంగ తన గదిలో లేదు.

వెనుక తలుపు తీసి ఉంది.

నిశ్శబ్దంగా నడిచాడటు.

గంగ ఆ వెన్నెలలో—ఒంటిపై ఒక్క చీర మాత్రం చుట్టుకొని వున్నది మిగిలిన దుస్తులు ఉతుక్కొని ఆరబెట్టు కోవడానికి తాపత్రయ పడుతోంది గాలిలో అటూ ఇటూ విదిలించుతూ.

ఆమె సతీష్‌ను గమనించలేదు.

సతీష్ హృదయం సానుభూతితో ఆర్ద్రమైంది. స్త్రీకి అవసరమైన దుస్తులు చీరలేకాదు. ఇంకా వున్నాయి!

కట్టు బట్టలతో వచ్చిన ఆమెకు చీరలే కొన్నాడు. కానీ ఇంకేమీ తనకు తోచని తన మంద బుద్ధిని నిరశిం చుతూ నిశ్శబ్దంగా వెనుదిరిగి వచ్చి పడుకొన్నాడు.

## 9

సతీష్ దినపత్రిక చూస్తూ ఈజీచెయిర్‌పై తిరుగుతూ ఉన్నాడు ఉదయం. బెడ్ కాఫీ యిస్తూ రాము చెప్పాడు.

"ఎస్సైగారూ, ఇద్దరు జవానులూ వచ్చారు అయ్యగారూ. గంగతో ఏదో మాట్లాడాలట."

గంగ లేచిందా?"

"నాలుగ్గంటలకే లేచి పని చేస్తున్నాడండి."

"వస్తున్నా, ముందు గదిలోనికి రమ్మను గంగను."

నాగయ్య హత్య విషయమై సబిన్స్పెక్టరు అడిగిన పలు ప్రశ్నలకు కన్నీరు మున్నీరుగా విలపించుతూ జవాబు లిచ్చింది గంగ.

సతీష్‌ను కూడా కొన్ని ప్రశ్నలడిగి సమాధానాలు తెలుసుకొని నిష్క్రమించారు పోలీస్ వారు

వారిని సాగనంపి వెనుదిరిగిన అతడికి అపర్ణ అపర కాళిక రూపంలో దర్శనమిచ్చింది.

"ఇదుగో ఓ అమ్మాయ్!"

క్రోధపూరితమైన అపర్ణ సంభోదనకు గంగ ఆగి కనులు తుడుచుకుంటూ అటు చూచింది.

"ఏమిటి ప్రొద్దున్నే ఆ ఏడుపులు నిండు యింట? నేను మళ్ళీ ఆ ఏడుపు మొఖం, ఏబ్రాసి మొఖం చూడకూడదు జాగ్రత్త!"

తల వాల్చుకుని లోపలికి వెళ్ళిపోయింది గంగ.

మౌనంగా చూస్తూన్న సతీష్ ఆమె కోపాన్ని మరింత పెంచాడు. అతడేమైనా మాటలాడితే మాటకు మాటా పెంచగల అవకాశముంటుంది. అతడేమీ మాటలాడక మౌనం వహించితేనే ఆమె కోపం మరింత అధికమౌతుంది.

"వెధవ పోలీసులూ గొడవా. శుభమైన యింటికి ఏబ్రాసి ముఖాల్ని దాపురిస్తే యిలాగే వుంటుంది."

అనేసి పోయి మరలా పడుకుంది.

రాము కాఫీ తెచ్చి యిచ్చాడు.

"ఏం, లక్ష్మేమైంది? నీవు తెచ్చావేం?"

"రాఘవులకు వంటపని సాయం చేస్తూన్నదమ్మ గారూ."

"ఏం, ఆ క్రొత్త పిల్ల ఏమైంది?"

"గంగా అండీ?"

"ఊఁ, అదే"

"ఆ అమ్మాయి చిన్నబాబుగారూ, చిన్నమ్మగార్లను లేపి ముఖాలు కడిగించి స్నానాలు చేయిస్తూన్నదండి!"

"ఓ! మర్చిపోయాను. పిల్లలు ఇక్కడే వున్నారు కదూ?"

స్వగతాన్ని పైకే అనేసింది.

రాము చిత్రంగా చూచి, ఖాళీ కప్పు, సాసరూ తీసుకుని వెళ్ళి పోయాడు.

"పిల్లలు ఎక్కడున్నారో గుర్తులేని తల్లి! వాళ్ళ అవసరాలతో నిమిత్తం లేని అమ్మ!'

అని గొణిగాడు క్రిందికి వెళ్ళి లక్ష్మితో.

"ఊరుకుందూ, మనకెందుకు? ఆ యమ్మ యింటే ఈ నిమిసంలోనే గెంటేత్తారు బయటకు. మనగ్గావల్సింది మనపనీ డబ్బులూ, అంతే."

"అంతేలే." నీరసంగా అన్నాడు రాము తనకు వంత పాడేవారు లేక.

గంట గడచింది,

లక్ష్మి మరోసారి కాఫీ తెచ్చింది పైకి.

తీసుకుని ఖాళీచేసి యిచ్చేస్తూ బద్ధకంగా అటు యిటు దొర్లింది అపర్ణ.

"ఏమే ఏం జరుగుతోంది క్రింద? రాఘవులు వంట బాగా చేస్తున్నాడా?"

"ఆc. పాసకాలుకంటె ఘుమఘుమ లాడించేస్తున్నా డమ్మగారూ వంటగదిని."

"అదేం చేస్తోంది గంగ?"

"పాపగారినీ, బాబుగారినీ బుద్ధిగా కూసోబెట్టి ఫలారం సేయింతా వుందండి."

"అయ్యగారేం చేస్తున్నారు?"

"ముందు తోటలో కూర్చుని పూలమొక్కలు చూసుకుంటున్నారండి."

"ఊc. క్రొత్తపిల్ల కదా. దాన్నో కంట కనిపెట్టి వుండు. నువ్వెళ్ళు. నేను స్నానంచేసి క్రిందికి వస్తాను."

"అలాగేండి."

"ఇదుగో......ఆ రాఘవులూ క్రొత్తాడే కదూ? కాస్త జాగ్రతగా చూడు వంటిల్లవీ."

"అలాగేండమ్మగారూ. నాకు తెల్దూ?"

మరో అరగంట అలాగే బద్ధకంగా గడిపిన అపర్ణ

క్రింది అంతస్థులో ఏమి జరుగుతూన్నదో ఒక కంట గమనిస్తూనే వున్నది.

సతీష్ వచ్చి, దుస్తులు మార్చుకొని ఆఫీసుకు తయారవ్వసాగాడు.

అతడు అపర్ణతో మాటలాడలేదు.

అపర్ణ అతడితో మాటలాడలేదు.

సతీష్ అవసరాలు కనుక్కోవడానికి రాము వచ్చాడు పైకి.

"బాబూ, బేబీ తయారయ్యారా!" అడిగాడు సతీష్.

"సిద్ధంగా వున్నారండి" రాము జవాబు.

"రమ్మను కారు దగ్గఱకు."

టకటకా మెట్లుదిగి వెళ్ళిపోతూన్న సతీష్‌ను అర్థం కానట్లు చూచింది అపర్ణ.

'పిల్లలు ఎక్కడకు?'

నాలుకవరకూ వచ్చిన ప్రశ్న ఆగిపోయింది.

లేచి వెళ్ళి మెట్లవద్ద నిలబడి చూడసాగింది.

బాబుకు బూట్లు వేసి, తల మరోసారి దువ్వి బేబీకి బూటు తొడిగి బెల్టు సరిగా పెడుతోంది గంగ.

పేపర్ హెడ్‌లైన్స్ గబగబా చూస్తూన్న సతీష్ బూటును మరింత తళతళలాడేట్లు చేస్తూన్నాడు రాము.

"ఊఁ. కమాన్ !"

అని సతీష్ బయటకు నడుస్తూంటే పిల్లలు అనుసరించేరు.

"ఇదుగో బేబీ!"

గంగ మెల్లగా పిలిచింది.

పైనుండి చూస్తూన్న అపర్ణను గంగగానీ, సతీష్‌గానీ, పిల్లలుగానీ చూడనే లేదు.

గంగ పిలుపు విని "ఏమిటక్కా?" అంటూ వెనక్కు వచ్చింది మళ్ళీ బేబీ.

ఏమిటోనని ఆగి వెనుదిరిగి చూచిన సతీష్ చూపు గంగపై నిలచిపోయింది.

అప్రయత్నంగా రాత్రి సంఘటన అతడి మనస్సులో మెదిలింది.

'నా పిల్లలను నేను స్కూలుకు తీసుకెళ్తున్నాను. వాళ్ళ భవిష్యత్తు బాగుండడానికి పునాదులు వేస్తూ ఆరాట పడిపోతున్నాను. కానీ ఆమెకు కనీసావసరాలు చూచేవారు కూడా లేరు, పాపం! ఎంత దౌర్భాగ్యదశ అది!'

గంగ బేబీకి చేతిరుమాలు అందించుతూ అన్నది :

"చూడమ్మా, క్రొత్తస్కూల్లో జేరడానికి వెళ్తున్నారు కదా? అంచేత మేడమీదికి వెళ్ళి అమ్మగారికి చెప్పి, ఆశీస్సులు తీసుకువెళ్ళాలి. వెళ్ళండి మరి నువ్వూ అన్నయ్యా కలసి!"

"ఆశీస్సులా? అవేమిటి?"

"ఓ! అదే 'బెస్ట్ విషెస్'! వెళ్ళండి మరి!"

బాబూ, బేబీ కలసి చెయ్యీ చెయ్యీ పట్టుకొని మేడమెట్లు ఎక్కుతున్నారు. రెండు మెట్లు ఎక్కగానే అపర్ణ గొంతు వినవచ్చి అంతా పైకి చూచారు.

"మెట్లన్నీ ఎక్కి రానవసరం లేదులే, వెళ్ళిరండి. ఏ స్కూల్లో జేరుతున్నారూ?"

"ఇంకా తెలియదు మమ్మీ" బేబీ జవాబు.

"డేడ్ నోస్, ఆస్క్ హిమ్!" అంటూ బాబు చెల్లెలి చేయి పట్టుకొని తండ్రివైపు నడిచాడు.

సతీష్ ఏమీ మాట్లాడక పిల్లలతో వెళ్ళి కారులో కూర్చున్నాడు.

"ఏయ్ ఇటురా !"

గంగను పిలిచింది అపర్ణ.

"ఏంటమ్మగారూ?"

"ఆ పిల్లలు ఎవరు? మా పిల్లలు !"

తెల్లబోయి చూడసాగింది గంగ.

"వాళ్ళని నువ్వు 'బేబీగారూ', 'బాబుగారూ' అని పిలవాలి, తెలిసిందా?"

తెలిసిందన్నట్టు తలవూపింది.

"మాట్లాడవేం?" గర్జన!

"తెలిసిందండి."

"నిన్న అక్కా అని పిలువమని బేబీకెవరు చెప్పారు?"

"నే...... నేనేనండి."

"నోర్మూయ్! అక్కా, కుక్కా? వాళ్ళకి అక్కవటే నువ్వు?"

“ ”

కన్నీరదిమి పెడుతూ నేలచూపులు చూడసాగింది గంగ.

“నీ హద్దుల్లో నువ్వుండు. తెల్సిందా? ఇలా వచ్చి ఈ పక్కలవీ సర్దు.”

“అలాగేనండి.”

మరో మాట విను. నువ్వు ఎప్పుడూ యిక్కడ కంట నీరు పెట్టేందుకు వీల్లేదు. శుభ్రంగా కన్పించాలి నాకు. తెలిసిందా?”

“తెలిసిందండి అమ్మగారూ, నాకు క్రొత్తకదా! మీరు ఎలాచెబితే అలాగే చేస్తాను.”

“ఓహో! నీకు మాటలు వచ్చే?”

“నాకు ఏమేమి పనులో చెప్పండి. మీకు శ్రమ లేకుండా నేనే చేసుకుపోతాను రోజూ. ఒక్కసారి చెపితే చాలండి.”

“ఊఁ.”

‘అది అనవసర ప్రసంగం’ అనే సూచన తోపింప జేస్తూ కసిరింది.

“ఆ స్టాండుమీద చీరలన్నీ ఉతికేయి తీసికెళ్ళి.”

ఆజ్ఞాపించి ఇటుతిరిగి తీరిగ్గా ఫోన్ అందుకున్నది.

“ఏం తోచటంలేదోయ్ రాజేశ్వరీ! ఓసారి వస్తావా?”

“తప్పదంటావా? తప్పక రావాలా?”

"ఏం, ఏం పనులు చేస్తున్నావేమిటి? పెద్ద గుత్తానికి పళ్ళుతోమాలా యింట్లో కూర్చుని?"

"వద్దు తల్లీ, ఇంతవరకూ అంట్లగిన్నెలే తోమలేక చచ్చాను. ఇక నీ గుత్తాలకీ, గాడిదలకీ పళ్ళు తోమలేను, దాణాలు ఉడికించీ పెట్టలేను. కుటుంబానికి కావలసిన కూడు వండుకోవడమే గగనంగా వున్న రోజులివి !"

పడిపడి నవ్వింది అపర్ణ.

"మంచి జోకు వేశావ్ రాజేశ్వరి! అందుకే నీతో మాట్లాడాలని రమ్మంటుంటాను. చక్కగా తెలియకుండానే కాలం గడిచిపోతుంది."

"సరే, ఆజ్ఞ! మీరాగగలమా? ఓ అరగంటలో బయలుదేరుతానులే."

"ఓ యస్ ఈలోగా నేను స్నానంచేసి వచ్చేసి, రెడీ ఔతూంటాను."

# 10

'ఫాషన్ లేడీ'లో ఏవేవో దుస్తులు ఖరీదు చేసిన సతీష్ బిల్లు చెల్లించి తీరికగా ముఖం యిటు త్రిప్పేసరికి రాజేశ్వరి నవ్వుతూ నిలబడివున్నది కేవలం అతడి కటాక్షవీక్షణం కోసమే అలా అంత ఓపికగా వేచివున్నట్లు సంతోషం ప్రస్ఫుటంగా ప్రకటితమౌతూన్న వదనంతో, రెండు చేతులూ ఎత్తి శిరస్సు కొద్దిగా వంచి నమస్కారం చేసింది.

"ఇలా వెళ్తూ వెళ్తూ, కారును చూచి వచ్చాను. అపర్ణగారున్నారేమో షాపులోనని."

"ఊఁ. కానీ రాలేదు అపర్ణ. నేనే వచ్చాను." ముక్తసరిగా సమాధానం చెప్పి అటుతిరిగి సిగరెట్ వెలిగించుకొంటూ నిలబడ్డాడు.

అంతటి నిర్లక్ష్యాన్ని కూడ లజ్జాహీనంగా సహించి ఇంకా మాటలు పొడిగించింది రాజేశ్వరి చిరునగవుతో.

"అపర్ణగారు యింట్లోనే వున్నారాండీ?"

"ఏం, మీరీరోజు అపర్ణకు ఫోన్ చేయలేదా?"

రాజేశ్వరి తడబడింది.

"ఆఁ......చేశానండి ...... అహఁ ...... చేయలేదండి......"

"ఇదుగో ... ఈ షాపులో కూడ ఫోన్ వుంది. మాట్లాడుకోండి."

చరచరా ముందుకునడచిన అతడి వెనువెంట వెళ్ళింది రాజేశ్వరి.

"ఏమండీ?"

కారు డోర్ తీస్తూన్న సతీష్ ఆగాడు.

"ఇంటికేనాండీ మీరు వెళ్ళేది?"

"ఔను."

"నేనూ వస్తాను. అపర్ణ రమ్మన్నారు. ఇప్పటికే ఆలస్యమైనది."

సతీష్ భృకుటి ముడితో అడిగాడు.

"అపర్ణ రమ్మన్నదా? ఎప్పుడు?"

"ఇప్పుడేనండీ. ఓ అరగంట—ముప్పావుగంట క్రితం ఫోన్‌లో మాట్లాడింది, అప్పుడు."

"ఓ!" సతీష్ తమాషాగా తల ఎగురవేశాడు.

"మరి అపర్ణ ఇంట్లో వున్నదో లేదో అనే అనుమానం మీకెందుకు కలిగింది?"

తెల్లబోయిన రాజేశ్వరి వెల్లముఖం తేరుకొనేసరికి సతీష్ కారు కనుమరుగైంది.

"యూ స్కౌండ్రల్!"

నిస్సహాయ క్రోధాన్ని తనలో తానే అణచుకొంది.

'భర్తయుటుకు భర్తా, భార్యమటుకు భార్యా ఎంత అహంభావులు! కానీయ్! ఇంతకింతా అవమానించే అవకాశాలు నాకూ రాకపోవు!'

ఆ క్షణంతా అందమైన మాటలలో మలచింది అపర్ణ వద్ద.

"ఏం ఇంతాలస్యం? వెంటనే వస్తావనుకున్నాను?" అనడిగింది అపర్ణ రా చూడగానే.

"ఏం చేయనమ్మా? చచ్చిచచ్చి బస్సుల్లో రావలసిన గతి నాది!"

"తెలుసులేగానీ......"

"పోనీ-దారిలో ఆపద్బాంధవిలాగా మీ కారు కన్పించింది."

"ఎక్కడా?"

"అదే-ఆ మంచి సెంటర్‌లో పెద్ద షాపు వుంటుందీ-పేరూ......అదే 'ఫేషన్ లేడీ!' అక్కడా."

"ఈ వేళ్ళప్పుడా? మా కారు అక్కడ వున్నదా?"

"ఆఁ. నువ్వు షాపింగ్‌కి వచ్చావనుకొని దుకాణం లోనికి వెళ్ళి చూస్తే మీ ఆయనొక్కరే వున్నారు! చాలా అదృష్టవంతురాలివి అపర్ణా-నీకు కావలసిన చిన్నచిన్న అవసరాలన్నీ కూడ జ్ఞాపకం పెట్టుకొని వైనంగా కొని 'పాక్' చేయించుతున్నారు మీ వారు!"

అపర్ణ అయోమయంగా చూడసాగింది.

"నేనేమీ తెమ్మని చెప్పలేదే ఆయనతో?"

'కోతలెందుకులే, నా కళ్ళారా చూచాను నూట యాభై బిల్లు చెల్లించుతూంటే."

"వెధవ నూటయాభై ఓ లెక్కా? నా అవసరాలకయ్యే ఖర్చు అంత తక్కువ వుండదు. ఏమైనా ఆఫీసుకు కావలసినవి కొన్నారేమో?"

విరగబడి నవ్వింది రాజేశ్వరి.

"నా కళ్ళతో నేను చూచాను. పెట్టీకోట్స్........ వగైరా వగైరా పాక్ చేయించడం. అవి ఆఫీసులో అవసరమౌతాయా?"

తల తిరిగి పోతోంది అపర్ణకు.

"అపర్ణ రమ్మంది నన్ను, కాస్త కారులో దిగబెట్టండి అని నోరు తెరచి అడిగినందుకైనా మన్నించారు కాదు. సమాధానం కూడ చెప్పకుండా రయ్యిన వెళ్ళిపోయారు కారులో!"

గంగ కాఫీ ఉపాహారాదులు తేవడంతో మాట ఆపి అటు చూచింది.

వాడి వడిలిన ముఖం, తైల సంస్కారం లేక నిర్లక్ష్యం కావించబడిన అల్లరి ముంగురులు, అతి తక్కువ వెల చీర!

అయినా ఎంత అందంగా వున్నది గంగ.

అతి శ్రద్ధగా అలంకరించుకొని, చక్కని పోషణలో వున్న అపర్ణనుకూడ తలదన్నే అందాల రాశి!

"పిల్లలూ, అయ్యగారూ ఎక్కడికెళ్ళారు?" అపర్ణ అడిగింది.

గంగ కొంచం విస్మయంగా చూచినా తమాయించు కున్నది.

"మీకు చెప్పారు కదండీ? క్రొత్త స్కూలుకు వెళు తున్నామని బేబీగారు చెప్పారు!"

"ఎప్పుడొస్తారు?"

"తెలియదండమ్మగారూ!"

"సర్లే వెళ్ళు."

"ఇలాంటి అందమైన ముఖాలకు దొరికే ఆదరణ మాకెలా లభిస్తుందిలే! భార్య స్నేహితురాలు అడిగిందని కనీస మర్యాదకైనా కారులో కూర్చోమనలేదు!"

'అందమైన ముఖం! గంగ అందమైనది!'

అపర్ణ మెదడులో ఖాండవ దహనం మరలా మొదలైంది.

"ఏం అపర్ణా? ఏ కేరమ్సో, కార్డ్సో ఆడుదామా?"

"ఏమిటో నిన్ను చూస్తే జాలేస్తోంది. ఏ చీకూచింతా లేక వుండేదానవు, ఇటీవల ఏమిటో చాలా డల్‌గా వుంటున్నావు! ఔనులే. ఒకోక్క శనిపాదం ఇంట ప్రవేశించిన వేళా విశేషం అది!"

"నీ ముఖం, నాకేం నిశ్చింతగా వున్నాను. ఆఫ్టరాల్ అదొక ఆయా నాకు! అంతే. నిజంగా ఆ గంగ వచ్చాకచాల హాయిగా వున్నదనుకో ప్రాణం. నా హెయిర్ స్టెయిల్ కూడ నేను చేసుకోనవసరం లేదు. పిల్లలు అసలు నా దగ్గరకే రావడంలేదు. నన్ను పీక్కు తినేస్తారేమోనని భయపడ్డాను కాన్వెంటునుంచి వాళ్ళను తెచ్చినపుడు!"

తన ఇంజెక్షన్ సరిగా పని చేయడంలేదని గ్రహించి రాజేశ్వరి రంగు మార్చి మాట్లాడింది.

"అహఁ! అయితే అంతటి పనిమంతురాలన్నమాట ఆ పిల్ల! నువ్వదృష్టవంతురాలివిలే! ఏ బాదరబందీ నీకక్కర

లేదు. ఎప్పుడూ నలుగురు సేవకులతో చేయించుకునే సౌభాగ్యవతివి!"

"ఈ పొగడ్త ఆహ్లాదకరంగా వున్నా సరకు జేయనట్లే నటించింది అపర్ణ.

"అన్నట్లు—...బ్యూటీ పార్లర్‌కు వెళ్ళాలి. నేనివాళ! అందుకే నిన్ను సాయంత్రం రమ్మన్నది. ఇవాళ "స్టీమ్ బాత్" "ఫేషియల్" అన్నీ తీరిగ్గా చేయించుకుంటాను."

"పద అయితే!"

# 11

"అక్కా—అక్కా.

అంటూ కుమార్. చంద్రా సందడిగా వస్తోంటే ఎదురు వెళ్ళింది గంగ.

డ్రైవర్ కొన్ని ప్యాకెట్స్ తెచ్చాడు.

ఆమె వెనకనే వచ్చి సతీష్ మేడమీదికి వెళుతూ ఒక్క—క్షణం ఆగి గంగదేసి చూచాడు.

"పిల్లల పుస్తకాలూ, కొత్త యూనిఫారమ్స్ అన్నీ వున్నాయి. ఎవరి పేకెట్స్ వాళ్ళకే విడిగా పేర్లు రాసి వున్నాయి. చూడు అన్నీ నీ గదిలోనికి తీసికెళ్ళు."

"అలాగేనండి. ముందు వీరిద్దరికీ ఫలహారాలు పెట్టి, స్నానాలు చేయించి అప్పుడు ఆ పని చేస్తానండి."

"యస్. యస్."

తృప్తిగా తల పంకించి, మేడమెట్లెక్కుతూన్న అతడు మరలా గంగ మాటలు విని ఆగాడు.

"అమ్మగారు పైనలేరండి. బయటకు వెళ్ళారు మధ్యాహ్నమే!"

"ఊఁ. రాముతో నా కాఫీ పైకి పంపించు."

పైకి వెళుతూనే మంచానికి అడ్డంగా మేను వాల్చాడు.

అతడి అలసత్వం గ్రహించిన రాము కాఫీ టేబుల్ పై వుంచి, కాలి బూట్లు తీస్తూంటే సతీష్ కనులు విప్పాడు.

"అయ్యగారూ, స్నానం చేస్తారాండి అలసట పోతుంది."

"ఒద్దురా."

"కాళ్లు పట్టనాండీ?"

"ఊఁ."

"ముందీ కాఫీ తీసోండి!"

"  !"

"అలాగున్నారేం అయ్యగారూ? ఒంట్లో బాగున్నట్లు లేదు. డాక్టర్ని పిలవమంటారా?"

"ఒద్దురా, బాగానే వుంది. పిల్లల్ని ఏడాది మధ్యలో ఊరు మార్చి స్కూల్లో జేర్చడమంటే మాటలా? ఎన్ని చోట్లలో తిరగవలసివచ్చింది."

"అలాగాండీ?"

"ఆఁ. దానికితోడు ఆఫీసు గొడవలు వుండనే వున్నా యిగా!"

"ఔను లెండి."

అపర్ణ వచ్చింది.

వస్తూనే పిద్ద అలసిపోయినట్టు సోఫాలో కూలబడింది.

"ఓరేయ్, నాకాఫీ తీసుకురా!"

రాము భర్తకు కాళ్లు పడుతున్నాడనే ధ్యాసకూడ ఆమెకులేదు.

సతీష్ హృదయం లోలోన నిట్టూర్చింది.

"ఆఁ మీరు ఈరోజు నాకేవేవో వస్తువులు కొన్నారా? ఏవీ అవి?"

సతీష్ ఆమెవైపే చూస్తూన్నాడుగానీ ఏమిమాట్లాడ లేదు.

"పరికిణీలవీ కొంటుండగా చూచానని రాజేశ్వరి చెప్పింది?"

ఈసారీ అతడు మాటలాడలేదు.

"దాన్ని కార్లో 'డ్రాప్' చేయలేదని నాకు చాడీలు మోసుకొచ్చింది. నిజంగా మంచి పనిచేశారు. మీతో మరె వరూ నున కార్లో తిరగడం నా కిష్టం లేనిపని —— ఆఁ, ఇంతకూ ఏవీ కొన్నవన్నీ? ఈ రోజు మీరు నా కోసం 'షాపింగ్' చేసేంత తీరికెక్కడి దబ్బా? రాజేశ్వరికి ఒకటే అసూయ మీరు నాకోసం యేమేమో కొనేస్తున్నారని."

"అబ్బబ్బబ్బా!" విసుగ్గా లేచి దిండ్లను ఆనుకొని కూర్చున్నాడు సతీష్.

నేను ఉదయం పోయి ఇపుడు ఇల్లు జేరాను. మన మధ్య ఎవతో ఎందుకు? పిల్లల క్రొత్త స్కూలు గురించి అడిగావా? వాళ్లు స్కూలు నుంచి వచ్చారో లేదో అడిగావా?"

"ఓ! మర్చిపోయాను. ఏమైంది? స్కూల్లో జేర్పించారా?"

"ఆఁ!"

"నాకు తెల్సు, మన పరపతికి ఆఫ్టారిల్—స్కూలు సీట్లదొరకవా? ఇంతకీ ఏవీ కొనుక్కొచ్చిన బట్టలు?"

"బట్టలూ బట్టలూ బట్టలు! ఏమిటి బట్టల దయ్యం ఆవహించింది నిన్ను? ఆ దయ్యం చెప్పడం, నువ్వడగడం!"

"మరేం కొన్నారు?" అపర్ణ తనకు సమాధానం వచ్చేవరకూ పట్టు వదలదు.

"బేబీకి రిబ్బన్స్ క్రొత్త డ్రెస్‌లూ, యూనిఫాం—అవి కొంటూంటే నీ నక్షత్రకురాలు వచ్చి వెంటపడింది."

"ఓ! అదా సంగతి? నాకేవో కొంటున్నారంది."

"ఈ చెత్త అంతా మాట్లాడటమే కానీ అసలు పిల్లల అతీగతీ ఏమైనా కావలసి వచ్చిందా నీకు? వాళ్లు వచ్చారో లేదో, తిన్నారో లేదోనని నీకేమీ తహతహగా లేదా? ఈ మాత్రం దానికి వాళ్ళని ఎందుకు అక్కడినుండి తీసుకొచ్చినట్టు!"

"క్రొత్తగా మాట్లాడతున్నారేం? పిల్లలకంటెముందు ఆయా అమరి వున్నది కదా యింట? ఇకనేనేం చేయాలి?"

భారంగా నిట్టూర్చకుండా వుండలేక పోయింది సతీష్ మనస్సు.

'ఔను. కనీసం పిల్లలకు ఆయా లభించింది వాళ్ళ అదృష్టం కొలదీ, కానీ నా ఆలన పాలనలు చూచేదెవరు?'

ఆక్రందన చేసే అంతరంగం మౌనం వహించింది. అది తన విజయంగా భావించిన అహర్ణ అహంభావంగా నవ్వుకుంది.

# 12

వేకువనే లేచి తన పనులు త్వరగా నిర్వర్తించుకొన్నది గంగ. తండ్రిని తలచుకు దండం పెట్టి రెండు నిముషాలు ప్రార్థన చేసింది.

'నాన్నా! నువ్వు లేవు. అయినా నాకు ఓ నీడ చూపావు! అయ్యగారు నన్ను బాగా చూస్తున్నారు, నేను సుఖంగానే వున్నాను. అంచేత నువ్వు శాంతిగా, తృప్తిగా స్వర్గాన్ని జేరుకో! నీ ఆత్మకు ఏ చింతా వద్దు. బాధలూ, కోరికలూ వున్న ఆత్మ ప్రేతమౌతుందంటారు. నీవు అలా కాకూడదు. నాకే బాధలూ లేవు, కోరికలు ముందే లేవు.

నీకున్న నే నొక్కతెనూ బాగానేవున్నాను గనుక క్షోభ లేకుండా దేవుని జేరుకో. నీ ఆత్మశాంతికి ఇంతకంటె నేను ఏం చేయగలను? నీకు తెలుసు'

'ఔనూ, అయ్యగారు నిన్న పంపిన పార్సెల్ ఏమిటో? పిల్లల గొడవలో విప్పనేలేదు. ఎవరి పేకెట్టుమీద వాళ్ళ పేరే వుందన్నారుకదూ?'

గబగబా తీసి చూసింది.

గుండె ఎగసిపడింది. కనులు టపటప కొట్టుకున్నాయి. చేతులు వణకసాగాయి.

తనకు రోజూ వాడకానికి అవసరమైన దుస్తులన్నీ ఇబ్బందిలేకుండ గడచిపోయేందుకు సరిపడినన్ని వున్నాయి.

'కానీ, బాబుగారు తనకు యివి తేవడం!'

ఎన్ని తెలిసిన మనిషి!

ఎంత దయార్ద్ర హృదయం!

తాను కట్టుగుడ్డలతో మాత్రమే వచ్చిన దీనురాలని బాబుగారికి బాగా గుర్తున్నదన్నమాట!

'భగవాన్! ఈ మంచిమనిషిని కలకాలం సుఖంగా వర్ధిల్లజేయి! నీవు కనుపింపని దైవానివి, కానీ నన్ను కనుపించే దైవం నీడకు జేర్చావు. అంతే చాలు!'

భక్తితో అవనత నేత్రురాలై చేతులు జోడించిన గంగ అదరిపాటుతో కనులుతెఱచి గాభరాగా చూచింది.

రాఘవులు చేతిలో గరిటతో తాండవమాడు తున్నాడు మాటిమాటికీ పైగుడ్డ దులిపి మళ్లా భుజాన పరచుకుంటూ.

"ఏటి పిల్లా అలా సినెమాలో సీతమ్మోరులా గూకుంటే పొద్దున్నే ఇక్కడ పను లెట్టగాతయంట ? నువ్వు పిండి రుబ్బేదెపుడు, నేను దోసెలు పోసేదెపుడు ?"

"పిండి లక్ష్మిని రుబ్బమను రాఘవులూ, అబ్బాయి గార్ని అమ్మాయిగార్ని లేపి వారి పనులు చూడాలి నేను."

"ఓయి ! ఈ కబుర్లకేంగానీ పద, పనిజెయ్యి. ఆరు యింకా నిదరలేవరు అప్పుడే. పని తప్పించుకోడానికి దొంగ పూజలు ! అవన్నీ కలిగినోరు ఖాళీగా కూకుని సోగ్గా చేసే నటనలు. మనకాక్కావలసింది మన పొట్టపూజ ! పొట్ట నిండా లంటే వెట్టిసాకిరీ సేయాలి !"

"ఏయ్, ఏమిటా కూతలు !"

సతీష్ గర్జన విన్పించిన దెస హడలపోతూ చూచాడు రాఘవులు.

మెట్లవద్ద నిలబడి హుంకరిస్తున్నాడు సతీష్.

"అయ్యగారూ......"

"నోర్మయ్, లక్ష్మి ఏమైంది?"

"ఉన్నదండి. బ......బట్టలుతుకుతున్నదండి."

"అది మధ్యాహ్నం చేయవలసిన పని. పిలువు!"

"చి తం."

"ఇలా రా!"

"ఏంటండి." బెదరిపోతూ రెండడుగులు సతీష్‌వైపు వేసి ఆగిపోయాడు.

"ఆ అమ్మాయి గంగ కేవలం పిల్లలను చూచుకోవడానికే."

"చిత్తం. మీరలాగ చెబితే ముందే నాకు తెలిసుండేదండి."

"ఇంకెప్పుడూ యిలా బిగ్గఅగా అరవడం జరగకూడదు నిశ్శబ్దంగా నీ పని నువ్వు చెయ్యడమే. వెళ్ళు!"

"చిత్తం!" వంట యింట్లోకి వెళ్ళిపోయాడు పిల్లిలాగ.

'అరవకూడదు. ఔను' అక్కసు అంతా గిన్నెపై చూపుతూ గొణగసాగాడు రాఘవులు.

'అమ్మగారైతే రంకె వేయొచ్చు. చిందులు దొక్కొచ్చు అంబశక్తికి మల్లే! అడిగే దమ్ముల్లేవు. పెళ్ళాం గదూ? మేం పనోళ్ళం గనక నోరెత్తరాదు.'

లక్ష్మి వచ్చి పిండి రుబ్బేందుకు ఉపక్రమించుతూ మెల్లగా నవ్వింది రాఘవులమాటలకు.

ఆరిల్లు, ఆరి యిష్టం. ఆట్టే మాట డబోక! వున్న నౌకరీ వూడిపోయి మళ్ళీ వూరుమీద పడ్తావు."

"ఔన్లే మరి! ఆల **మో**చేతి నీళ్ళు తాగడానికొచ్చాను కదూ? అందుకూ, అయినా......ఒలే లచ్చీ నేను ఇక్కడ కొత్తోణ్ణనుకో! నీకు ఈ యింటి సంగతి తెలియాల! ఆ అయ్యగారికా గంగఅంటే అంత 'ఇది' ఎందుకూ అంట! ఏవైనా యవ్వారం వుండేటబ్బా?"

తల తమాషాగా ఎగురవేస్తూ కాలు నేలను తాటిస్తూ అడిగాడు.

"శాన. ఊరుకో. కొంపలు ముంచే మాటలు! ఆ యమ్మాయి గూడ కొత్తగనే వచ్చింది. పాపం ఎవ్వరు లేనిదైంది."

"ఆఁ. అద్దదీ! అల్లా చెప్పావ్? ఎవ్వరూ లేరు, బోలెడంత అందం వుంది. ఇంకేం?" మెరిసేకన్నులతో అన్నాడు, హేళన ఉట్టిపడే స్వరంతో.

"ఏయ్. ఏటా మాటలు? దిక్కులేని ఆడకూతుర్ని పట్టుకొని! అయ్యగోరికి సెప్పేగలను. జాగ్రత్త!"

"బాబ్బాబు. వద్దులే అయినా నాకెందుకీ పెద్దింటి గొడవలు!"

## 13

గదిలోనికి వచ్చి మరలా అలసటగా కనులు మూసుకుని పక్కపై వాలిన సతీష్ అపర్ణ స్వరం విని స్ప్రింగులా లేచి కూర్చున్నాడు.

"ఏమిటి దాన్ని అంతగా వెనకేసుకొస్తున్నారు? పని పాటలు చేసుకోకుంటే రాణివాసంగానీ అనుభవించి వచ్చిందా?"

"మొదలైందా నీగోల?"

"ఏమిటీ?"

"ఔను మరి! ఎవరి పనులు వార్ని చేసుకోనియ్యకలగా వులగం వద్దు, పిల్లలకు ప్రత్యేకం మనిషి వుండాలి!"

"ఏమీ అక్కర్లేదు, వాళ్ళేం పాలు తాగడం లేదు!"

"ఊఁ, ఇంత ప్రొద్దుమీదికి వచ్చినా, అన్నేళ్ళు పైకి వచ్చినా నలుగురు నౌకర్లు పదిసార్లు పడక మీదికే కాఫీ లందించితేగానీ పక్కవదలని దానవు నీకేం చెప్పే అర్హత వున్నది?"

"అది నా అదృష్టం! మీకేం? నాకు జరుగుబాటు వుంది."

"కాదు, నీ అహంకారంతో జరిపించుకుంటున్నావు అంతే. ఇదుగో—నువ్విలా మాటిమాటికీ గొడవచేస్తే పిల్లల్ని హాస్టల్‌కీ, ఆ అమ్మాయిని మరే ఉద్యోగానికో పంపేసాను."

గతుక్కుమన్న అపర్ణ మాట్లాడలేదు.

"ఏం, చెప్పు యిప్పుడే ఏదో ఒకటి!"

"ఏం బెదరింపా?"

"అటువంటివి నీకు పని జేయవని తెలుసులే కానీ— ఇలా రా బయటకు......"

రెక్కపట్టి ఈవలి బాల్కనీలోనికి తీసుకొచ్చాడు.

అక్కడికి డ్రాయింగ్ రూం బాగా కన్పిస్తోంది.

గంగ చదువు చెప్తోంది.

కుమార్ శ్రద్ధగా వింటున్నాడు.

బేబీ ఏదో లెఖ్ఖ చేస్తోంది!

అపర్ణ ముఖం ముడిచి అడిగింది.

"దాని మొహానికి కాన్వెంటు పిల్లలకు చదువులు చెప్పడమూ ?"

"ఒళ్ళొంగితే అన్ని పనులూ వస్తాయి. అది నీ కర్ధం కాదు. చూచావా పిల్లలు మనజోలికి రాకుండా ఎలా స్నానాలు చేసి తయారై పోయారో? బుద్ధిగా చదువుకుంటున్నారు!"

"వాళ్ళకా శిక్షణ హాస్టల్ లోనే వచ్చింది.

'ఈ మొండి మాటలకేంలే? మొన్న మరి వాళ్ళ అల్లరి భరించలేక పోయావుగా? ఇక నీతో వాదనెందుకు గానీ......నాల్గురోజులు చూచి నీకిబ్బందిగా వుంటే పిల్లిల్ని వాళ్ళ ఆయానూకూడ పంపేస్తాను!"

అతడు స్నానానికి వెళ్ళిపోయాడు.

అపర్ణ ఆలోచనలో పడింది.

"నిజమే! ఘటికురాలే ఆ పిల్ల, పిల్లలు నన్ను పీక్క

తినడంలేదు. ఎప్పటివలె హాయిగా వుంది నా ప్రాణం! బాబోయ్! అది వెళ్ళిపోతే మళ్ళీ వీళ్ళు నాపై దాడి చేసారు."

అన్నది ఒకనాడు స్నేహితులతో మాట్లాడుతూ.

ఆ స్నేహితులలో ముఖ్యురాలు రాజేశ్వరి!

"ఏమైనా, అది అందగత్తె! పైగా టక్కుల మారి! అంచేత మిమ్మల్ని బాగా బోల్తా కొట్టించగలిగింది. ఆ అందమే లేకుంటే ఎవరికక్కర్లేదు? లోకంలో ఎందరు అనాథులు లేరు! అందరిపైనా-కనీసం-ఈ వూళ్ళో-లేదా మీ వీధిలో వున్న అనాథులగోడు ఏమైనా మీకు పట్టిందా?"

అన్నది రాజేశ్వరి, ఠీరీకగా పేక పంచుతూ.

అంతలో గంగ అక్కడికి వచ్చింది ఆ అందరికీ చల్లని పానీయాలతో.

"ఏం నువ్వు తెచ్చావ్?"

అపర్ణ అధికారంగా అడిగింది.

"రాఘవులు నన్ను తీసుకు వెళ్ళ మన్నాడండి. వంట చేస్తున్నాడు."

చెప్పి వెళ్ళిపోయింది.

"ఏయ్ ఇలారా. పిల్లలేరి?" అడిగింది అపర్ణ.

"అయ్యగారితో ఇంగ్లీషు సినిమాకు వెళ్ళారండి. మీ రప్పటికి నిద్రలేవక చెప్పలేదు."

"అఘోరించావులే!"

పేకాట జోరుగా సాగుతోంది.

అపర్ణ రాజేశ్వరి ప్రభృతుల మాటలతో నవ్వులతో డ్రాయింగ్ రూం కోలాహలంగా సందడిగా వున్నది. ఈ సమయంలో కారు వచ్చింది.

హారన్ వింటూనే పరుగున వచ్చింది గంగ.

పిల్లల వస్తువులన్నీ అందుకొని లోపలికి నడచింది.

ఆ వెనుకనే సతీష్ దిగాడు.

గంగ సూరలా వచ్చి అతడి బ్రీఫ్ కేస్ ఫైల్సు వగైరా అందుకొని లోనికి తెచ్చింది.

"అక్కా, ఇవాళ మా స్కూల్లో......" బేబీ ఉత్సాహంగా యేమేమో వివరించసాగింది గంగతో.

రాజేశ్వరి మరొకామెకు కనుసైగ జేసి గుంభనంగా నవ్వుకోవడం అపర్ణ కంట పడనే పడింది.

అపర్ణ గమనించడం చూచిన రాజేశ్వరి ఖంగారు పడింది.

"అహఁ. ఏం లేదూ? అప్పుడే 'అక్కా' అనిపిలిపించుకొనేంత మాలిమి అయ్యారు పిల్లలు. చక్కగా ఆయన అవసరాలు కూడ చూస్తూ నీకు బాగా సహాయంగా వుంటోంది కూర్చొని కదల నవసరం లేకుండా! అని......

అపర్ణ అంతరాంతరాలలో రేగిన దావానలం పైకి తన్నుకు వచ్చింది.

"ఇదుగో యేయ్ ఇలారా!"

గంగ వచ్చి ఎదురుగా నిలబడింది.

"బేబీనీ, బాబునూ యిలా పిలువు."

హాజరు పరచింది గంగ.

"ఇది మన పనిమనిషి. అక్క అనకూడదు, పేరు పెట్టి పిలవండి చాలు. మళ్ళీ అలాపిలుస్తే చీరేస్తాను. జాగ్రత్త!"

మౌనంగా విని వెళ్ళిపోయారు కుమార్, చంద్రా.

"ఇదుగో, నిన్నే" గంగను ఉద్దేశించి అన్నది అపర్ణ ఆగ్రహం ప్రదర్శిస్తూ.

"ఏమిటండి?"

"పిల్లలకేం చెప్పానో విన్నావుగా? మళ్ళీ నీకు వేరే చెప్పాలా?"

"విన్నానండి, ఉదయమే చెప్పారుకద మీరు?"

"ఆఁ. జ్ఞాపకమున్నది కద? అయ్యగారి పనులకు నీవు తయారుకానక్కర్లేదు. రాము చూచుకుంటాడు."

"అలాగేనండి. కానీ, రాము బజారుకెళ్ళాడు. ఇప్పుడు యింట్లో లేడు."

"లేకపోయినా సరే, నీకనవసరం ఆ పనులు."

"అలాగేనండీ."

వెళ్ళిపోయి గంగ పిల్లలచేత బట్టలు మార్పించి, ముఖాలు కడిగి, ముందు లాన్‌లోనికి తీసుకువెళ్ళి ఆడించ సాగింది, అక్కడే పాలూ, ఫలహారాలూ తిన్పించుతూ.

"నిజం చెప్పొద్దూ? ఈ పిల్ల వచ్చాక చాలా సుఖంగా వుందిలే ప్రాణం పిల్లలు అసలు నా జోలికి రావడంలేదంటే

నమ్మ." అన్నది పేక కలుపుతూ అపర్ణ రాజేశ్వరితో.

"రామూ! కాఫీ తీసుకురా!"

మేడమీదినుండి సతీష్ పిలుపు అసహనంగా విన వచ్చింది.

అపర్ణకు చీమకుట్టినట్టు కూడ అన్పించలేదు. తన ఆట లోనే నిమగ్నమైవున్నది.

మరో అయిదునిముషాలకు మేడమీద టేబులో ఏదో ఎవరో బలంగా తన్నిపారేసిన శబ్దం, ఆ వెనువెంటనే సతీష్ వచ్చి మెట్లవద్ద నిలచి

"రాఘవులూ!" అని మరో కేక వేయడం జరిగింది.

"ఏమిటీ?"

అపర్ణ విసుగ్గా అడిగింది.

సతీష్ ఆమెతో మాట్లాడలేదు.

"రాఘవులూ, రామూ! ఎక్కడ చచ్చారంతా? నేను రావడం చూడలేదా?"

అతికోపంగా కేకలు వేశాడు.

ఈ బీభత్సం విని గంగ పరుగున లోనికి వచ్చింది.

"ఏయ్? రాఘవులేమయ్యాడు? అంతా వంటింట్లో ఆత్మహత్య కానీ చేసుకున్నారా?"

అపర్ణ కూర్చున్న తావునుండి కదలకనే గంగను ప్రశ్నించింది. ఆమె కనులుమాత్రం తన చేతిలోని కార్డ్సును సరిజూచుకుంటున్నాయి.

"రాఘవులు జ్వరం వచ్చిందని పడుకున్నాడు కదమ్మ గారూ?"

గంగ వినయంగా అన్నది, బెదురుగా పైకి చూస్తూ.

"ఓ! మరిచేపోయాను" అపర్ణ అప్పటికీ కదలలేదు.

"ఛీ ఛీ" సతీష్ ఛీత్కరించుకుంటూ లోనికి వెళ్ళి పోయాడు.

"ఇంకా అలా నిలబడ్డావేం స్తంభంలాగా? వెళ్ళి ఆ పని నువ్వు చూడు!" హుంకరించింది అపర్ణ, గంగను.

"అలాగేనండి."

రెండునిముషాలలో కాఫీ సరంజామా అంతా ట్రేలో సర్దుకువచ్చిన గంగ అపర్ణ కెదురుగా నిలిచింది.

"మీరిచ్చి వస్తారా అమ్మగారూ ?"

నమిలి మింగేసేట్టు చూచింది అపర్ణ.

"ఏం, పిచ్చిగానీ ఎక్కిందా? నే నివ్వడమేమిటి? వెళ్ళి యిచ్చిరా, ఇంట్లో వున్న ఏ నౌకరు సెలవుపెట్టినా ఆ పను లన్నీ నువ్వు చేయాలి. తెలిసిందా?"

"చిత్తం."

మంచి పట్టులో వున్న ఆటలో మునిగిపోయింది తిరిగి అపర్ణ.

"అయ్యగారూ కాఫీ తెచ్చానండి."

కనులకు చేయి అడ్డుగా వుంచి పడుకొన్న సతీష్ దిగ్గున లేచి కూర్చున్నాడు

కెటిల్ లో డికాక్షన్ కప్పులో వంచుతోంది గంగ.

చెయ్యి వణుకుతోంది బెదరిపోతూన్నట్టు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు బరువుగా వస్తున్నాయి.

"అక్కడుంచి వెళ్ళు. నేను కలుపుకుంటాను."

గంగ మాట్లాడలేదు.

అంతలో గుర్తువచ్చినట్టు ఒక గిన్నె మూతతీసి ప్లేటులో ఉప్మా వేసి యిచ్చింది.

"ముందు......టిఫెన్...     "

తడబడిపోతోంది మాట.

ఆ అమ్మాయి మానసికస్థితిని అర్థంచేసుకొన్న సతీష్ లోలోపలే జాలిపడ్డాడు. ఆమె ఖంగారు తగ్గించడానికి తాను లేచి టవెల్ తీసుకుని బాత్‌రూమ్‌లోనికి నిష్క్రమించాడు.

"అన్నీ అక్కడ పెట్టేసి వెళ్ళు. నేను తీసుకుంటానులే."

అన్నాడు తలుపులు మూసుకుంటూ.

'హమ్మయ్య!'

గంగ హృద్వేగం ఉపశమించింది.

'ఎంత చక్కగా వున్నది ఈ గది!'

అనుకొన్నది తీరికగా చుట్టూ పరిశీలించి.

'ఈ అందమైన గదిలో-యింత మంచి అయ్యగారితోడి స్వర్గంకంటె అమ్మగారికి ఆ పేకముక్కలు రుచిగా అందంగా వున్నాయి కాబోలు! నాకే యిటువంటి స్వర్గం వుంటే క్షణం వృథా పోనీయను!'

'ఛ ఏమిటీ ఆలోచనలు!'

మనసును అదలించి ఖాళీ (ప్రేతో (క్రిందికి నడిచింది

'మరి రాఘవులుకు జ్వరం వస్తే వంట ఎలా? పేకలో ఎప్పటిలా మునిగిపోయింది అపర్ణ. ఆ ఆట వదలలేక భర్త గదిలోకి పరాయిపిల్లను పంపి కాఫీ యిమ్మన్నది. ఇంత శేఫర్వా మనిషితో జీవితం ఎలా? ఎన్నాళ్ళిలా? బొత్తిగా గృహిణిలేని ఇల్లులాగా యింటి విషయాలు కూడ నేనే ఆలోచించవలసివస్తోంది.'

స్నానం చేస్తూన్న సతీష్ ఆలోచనలు ఈ విధంగా సాగుతున్నాయి.

'ఛీ, ఏ స్త్రీ అయినా యిలా వుంటుందా?'

ఇంట వుండబుద్ధికాక దుస్తులు వేసుకుని క్లబ్బుకు బయలుదేరాడు.

'ఎక్కడి' కని అపర్ణ అడగలేదు, అతడు చెప్పలేదు

"ఏమోయ్! మీవారెంత మంచివారు! ఆయనకు కనీసం కాఫీ యిచ్చేందుకు కూడ నువ్వు కదలలేదే!"

అనిత ఆశ్చర్యం ఒలికించింది.

"ఇదేం క్రొత్తటోయ్ మనకి?" రాజేశ్వరి అందుకున్నది.

"ఇప్పుడెక్కడికి వెళ్ళారు మళ్ళీ?"

"క్లబ్బుకు. మన క్లబ్బు యింట్లో, ఆయన క్లబ్బు ఊరిమీద."

అని నిర్లక్ష్యంగా నవ్వింది అపర్ణ.

"అబ్బ! నవ మన్మధుడిలా తయారై వెళ్తోంటే నీకు భయం వెయ్యదా అపర్ణా?"

ఒకామె కళ్ళు త్రిప్పుకొంటూ అడిగింది.

'అది వారికి అనవసర ప్రశ్న!'

అని అపర్ణకు అన్పించలేదు.

'తన భర్త నవ మన్మధు' డని ఆమె పొగడుతోంది! అంతే అపర్ణకు కావలసింది.

"ఎందుకూ భయం?" అన్నది మరింత నిర్లక్ష్యంగా.

"ఏ వగలాడి అయినా ఎగరేసుకుపోతుందేమోనని?"

చేతిలోని పేక విసిరేసింది అపర్ణ తీవ్రంగా చూస్తూ.

"నీ భర్త అటువంటివాడేమో? అంతగా భయపడుతూ, తుమ్మితే ఊడిపోయే ముక్కుతో కాపురంచేసే అగత్యం నాకు లేదు."

ఆ మాటలు స్నేహిత బృందాన్నంతనూ గాయపఱచినట్లు వారి ముఖాలలో తరిగిన కళలే చెప్తున్నాయి. అయినా ఖండించి వాద ప్రతివాదాలు సలిపే దమ్ములు వారికెవరికీ లేవు. కోపాలను లోలోపలే దిగమ్రింగుకొని, మరొకసారి కాఫీ ఫలహారాలు అప్పనంగా స్వీకరించి మరో రెండు రౌండ్సు ఆడి ఇళ్ళముఖాలు పట్టారు.

"చూడు, ఇంతకింతా ఆ అపర్ణకు గుణపాఠం చెప్పి వెక్కిరించుతాను ఒకనాడు. ఎంతెంత మాటలంటోంది ఆ నాటి కానాడు!"

అన్నది రాజేశ్వరి అక్కసుగా.

మిగిలిన ముగ్గురూ పరిహాసంగా నవ్వారు.

"పేదవాని కోపం పెదవికి చేటనీ, నువ్వేం చేయ గలవు ఆవిడను? నోర్మూసుకో."

అన్నది అనిత.

"ఆ అంతస్థే ఆ అహంకారాన్ని యిస్తుంది. మనం కలలో కూడ కూర్చోలేని-ఊహించలేని అంతస్థు!"

అన్నది మమత.

"ఛీ!"

అర్థమైనట్టు తలపంకించింది రాజేశ్వరి.

"సరే. ఆ అంతస్థుకు ఆమెను దూరం చేయాలి."

మిగిలినవారు మళ్లా నవ్వారు.

"అది నీతరంకాదు" అంటూ.

"చూద్దాం" ప్రతిన పట్టినట్టే అన్నది రాజేశ్వరి.

"చూద్దాంగా అమ్మాయీ, అదీ చూద్దాం."

"మన భర్తలకు కాస్త ప్రమోషన్స్ యిప్పిస్తుం దేమోననీ, పగలు మన కాఫీ టిఫిన్లు తేరగా గడచిపోతా యనీ ఆవిడ యింట జేరే మనం ఆవిడని దేనికీ దూరం చేయలేం. మనకి నీడనిచ్చే ఆ చెట్టు అలాగే వుండాలను కుందాం" అన్నది అనిత.

"నేననుకోను" రాజేశ్వరి కోపంగా అన్నది.

"కానీ ఈ మాటలేమీ అపర్ణవరకూ పోనీయకండి. మనలోనే వుండాలి!"

# 14

రాత్రి పదకొండు గంటల సమయం!

ఇల్లంతా నిశ్శబ్దంగా వున్నది.

కారు గరాజ్‌లో వుంచి డ్రైవర్ వెళ్ళిపోయాడు.

రాము అరుగుమీద మంచినిద్రలో వున్నాడు.

లేపకుండా లోనికి వెళ్ళాడు సతీష్.

అపర్ణ మంచి నిద్రలో వున్నది. మెలకువగా వున్నప్పటికీ ఆమెకు తన భోజనం సంగతి అక్కరలేదు.

తిరిగి క్రిందికి వచ్చాడు సతీష్.

కుమార్ చంద్రలు యిరువురూ నిద్రపోతున్నారు. ఆ మధ్యన క్రింద కూర్చునే ఒకమంచంపై తలవాల్చి నిద్ర పోతోంది గంగ. ఆమె చేయి చంద్ర వీపుపై వున్నది.

అంతవరకూ ప్రేమగా జోకొట్టి నిద్రపుచ్చిందన్న మాట!

నిశ్శబ్దంగా తిరిగి వెళ్ళిపోయి డైనింగ్ టేబుల్ వద్ద కూర్చుని ఏమి వంటకాలున్నవో చూస్తున్నాడు.

ఆ మూతలు తీసిన శబ్దాలకు మేల్కాంచిన గంగ అక్కడికి వచ్చింది.

"చూడలేదయ్యగారూ మీరు వచ్చినట్లు!"

అతి ఖంగారుగా సంజాయిషీ చెబుతూ వడ్డన కుపక్ర మించింది.

"అమ్మగార్ని పిలుస్తానండి."

"అక్కర లేదులే, వడ్డించేసి వెళ్ళు."

కానీ గంగ వెళ్ళిపో లేదు.

దగ్గరుండి అన్నీ మళ్ళీ మళ్ళీ వడ్డించ సాగింది.

"వంట ఎవరు చేసారు?"

హఠాత్తుగా గుర్తుకు వచ్చి అడిగాడు సతీష్.

"నేనే నండి అయ్యగారూ."

"రాఘవులకేం జ్వరం?"

"తెలియదండి. ఇంకా తగ్గినట్లులేదు. తన గదిలోనే వున్నాడు.

"హుఁ. నిన్ను చూస్తే ప్రతి వంటవాడికి సెలవులు కావలసి వస్తున్నాయి. మరి చేయగలవా?"

గంగ మృదు స్వరం మరింత మృదువుగా మారిపో యింది.

"చేస్తాను అయ్యగారూ, ఎంత పనైనా చేస్తాను. ఈ నీడన ఇలా ఏ సమస్యా లేక తల దాచుకోనిస్తే చాలు!"

" భయం నీకెప్పుడూ వద్దు గంగా, అన్నట్లు ఏమైనా వస్తువులు కావలసి వుంటే చెప్పు. తెచ్చిపెడతాను."

"ఏమీా వద్దండి, ఆరోజు...బట్టలవీ చాలా తెచ్చారు. ఏ విధంగా కృతజ్ఞతలు చెప్పాలో తెలియని అల్పురాలిని!"

"హుం. అంత మాత్రానికేనా? నువ్వు మాకు పనులు చేసి పెడుతున్నావు. ప్రతిగా అవసర వస్తువులు పొందు తున్నావు. అంతే...... అన్నట్లు నాగయ్యా డబ్బు రావ డానికి ఓ రెండు నెలలు పట్టవచ్చు."

"మీా నీడన తిండీ బట్టా నిశ్చింతగా వెళ్ళిపోతే ఇక నాకు ఆ డబ్బు ఎందుకు అయ్యగారూ?"

"ఎంత అల్పసంతోషివి! ఆ డబ్బు రాగానే నీపేర బ్యాంకిలో వేస్తాను."

"మీా యిష్టం."

భోజనం ముగించి వెళ్ళి పడుకున్నాడే కాని సతీష్‌కు నిద్రరాలేదు.

అతను గదిలోనికి రావడం కూడా గమనించలేనంత గాఢ నిద్రలో మునిగి వున్నది అపర్ణ.

"తన యిల్లు! తన భర్త! తన పిల్లలు!" అనే తపన యేలేక నిశ్చింతగా నిదురపోతోంది!

క్రింద తలుపు లెన్నో వేస్తోంది గంగ. శబ్దాలు వినవస్తు న్నాయి.

తన యిల్లు కాకున్నా జాగ్రత్తలు తీసుకుంటోంది. గృహిణి వలె

తన బిడ్డలు కాకున్నా ఆడించి, లాలించి వారి మధ్యనే తల్లిలా నిదురపుచ్చి నిదురపోతోంది!

అపర్ణ ఏ నాడైనా అంత ప్రేమగా దగ్గర నిలబడి అన్నం పెట్టిందా?

ఎపుడైనా అంత ఆదరంగా మాట్లాడిందా?

అపర్ణ మనస్తత్వం మారితే ఎంత బాగుండును. ప్రక్కకు తిరిగి అపర్ణ నుదుటిపై చేయి వేశాడు. ఫాన్ గాలికి ఎగురుతూన్న ముంగురులను సవరించాడు.

మగతగా కనులు తెఱచిన అపర్ణ.

"వచ్చారా?" అన్నది.

"పడుకోండి" అని అటుతిరిగి నిండుగా ముసుగు పెట్టుకున్నది.

మూలుగుతూన్న మనస్సును ఓదార్చి, టేబులు లైటు ఆన్ చేసి ఇంగ్లీషు నవల చేతికి తీసుకున్నాడు.

నవల బాగున్నది.

శ్రద్ధగా చదువుతూండగా, తెలియకనే తెల్లవారింది.

లేచి టెర్రేస్‌పైకి నడిచాడు ఒళ్లు విరుచుకుంటూ.

క్రింద కిలకిలలు!

కుతూహలంగా క్రిందికి వంగి చూస్తే ఆహ్లాదకరమైన దృశ్యం కానవచ్చింది.

ఆవరణలో లాన్స్ మీద కుమార్, చంద్రా, గంగా పోటీపడి పరుగులు పెడుతున్నారు.

సర్వం మరచి అలా చూస్తూండి పోయాడు సతీష్.

"ఆపండి యిక! మార్నింగ్ ఎక్సర్ సైజ్ చాలు. ఇక స్నానాలూ, బ్రెక్ ఫాస్ట్!" అన్నది గంగ.

"ఓ!" కుమార్ చంద్రా ముక్తకంఠంతో అన్నారు.

"ఆc! మరి తర్వాత అంత సరదాగానూ పాఠాలు చదవాలి! ఓకే?" అన్నది గంగ.

"చదువుతాం అక్కా!"

గంగ గంభీరంగా మారిపోయింది.

"చూశారా? మళ్ళీ నన్ను 'అక్కా' అంటున్నారు."

బేబీ తల గోక్కుంది.

"అలా అలవాటైపోయింది మరి!" అన్నది గారంగా

"మార్చుకోవాలమ్మా. నేను మీ నౌకర్ని. నన్ను అక్కా అనవద్దని నిన్న అమ్మగారు ఎంతకోపంగా చెప్పారు!"

"అబ్బ ఈ అమ్మకి ఎప్పుడూ కోపమే!" బాబు చీకాకు పడిపోతూ అన్నాడు.

"అమ్మగారికీ, నాన్నగారికీ కోపం వచ్చే పనులు ఏవీ చెయ్యకూడదు. పోనీ 'ఆయా!' అని పిలవండి. సరేనా?"

"ఛీ. బాగోలేదు.

"అయితే నేను వెళ్ళిపోనా? మీకు నేను వద్దా?"

"సరే. వెళ్ళొద్దు. ఔను కానీ సిస్టర్ అని పిలవనా పోనీ?"

"పిలవండి. కానీ అమ్మగారికి ఇష్టం లేకుంటే మాత్రం మానేయాలి!"

"ఔను-కానీ సిస్టర్-నిన్ను మా అమ్మ తిట్టినట్టు నాన్న గారెప్పుడూ తిట్టరు కదూ? ఎందుచేత?" సీరియస్‌గా అడిగాడు కుమార్.

"నిజమే! అసలు అమ్మ ఎందుకలా ఎప్పుడూ అందర్నీ తిడుతుంది?" బేబీ సందేహం.

"అయ్యబాబోయ్!" గంగ ఇద్దర్నీ చెరోచేత్తో దగ్గరకు తీసుకుంది.

"ఇంకెప్పుడూ అలాంటి మాటలు మాట్లాడకండి. అమ్మగారూ, నాన్నగారూ, స్కూల్లో మేష్టారూ వీరి గురించి మీరెప్పుడూ అలా మాట్లాడకూడదు. వారు మీకు దేవుళ్ళన్మాట."

"ఎంచేత?"

"ఎంచేతో సాయంత్రం తీరికగా కథ చెప్తాను. నడవండి మరి! నేనింకా వంట చేయాలి. మిమ్మల్ని తయారు చేయాలి" లోనికి తీసుకుపోయింది.

సతీష్ మనసు తేలిక పడింది.

"గంగ మంచి శిక్షణ యిస్తోంది పిల్లలకు. తల్లిసోమరితనమూ, అవివేకతా రావడం లేదు!"

"రామూ, రామూ!"

గంగ పిలుస్తోంది లోనికివచ్చి.

"అయ్యగారికి బెడ్ కాఫీ యియ్యి."

"లక్ష్మి గిన్నెలు తోముతోంది. నేను పిండి రుబ్బు తున్నా. ఆ రాఘవులు లేవలేదు." రాముా సమాధానం పెంకెగా వున్నది.

అన్నీ వింటూనే వున్నాడు సతీష్.

తానే గబగబా మెట్లు దిగి వచ్చి టేబుల్ వద్దకూర్చు న్నాడు.

గంగ ఖంగారు పడిపోయింది. కన్నీటి పర్యంతమైంది.

'రాము......రాము...... నేను పైకి తేవచ్చునో! లేదో తెలియక......"

మందహాసం చేశాడు సతీష్.

"ఫర్వాలేదు. ఎందుకంత ఖంగారు? ఏం బేబీ రోజూ నేనూ మీకు టేబుల్ దగ్గర 'కంపెనీ' యిస్తే ఎలా వుంటుంది?"

"ఓ! చక్కగా వుంటుంది డాడీ!"

"సరే రోజూ నేనూ మీతో ఇక్కడికే హాజరు!"

"మరి మార్నింగ్ ఎక్సర్‌సైజ్?" కుమార్ అడిగాడు.

"బాబోయ్' అది మాత్రం నేను చేయలేనమ్మా? అది మీకే, పిల్లలకే!"

"నోనో! గంగ కూడా చేస్తుంది డాడీ!"

)!" గంగ అదిలించింది.

"రియల్లీ ఐయామ్ హేపీ గంగా! మంచి ట్రైనింగిస్తు న్నావు పిల్లలకు. అపుడే స్నానాలూ ప్రేయర్ కూడ అయిపో యాయి. మరి చదువు లెలా వున్నాయి?"

గంగ వికసిత వదనంతో జవాబిచ్చింది.

"అప్ టు డేట్ సర్. అన్నీ 'థరో' గానే వున్నారు. ఇద్దరూ మంచి తెలివైనవారు. మీకు తెలియనిదేముంది?"

"అచ్ఛా! కీపిటప్!

# 15

"అబ్బ! ఇక చదవలేను సిస్టర్!"

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ పుస్తకం మూసే శాడు కుమార్.

"ఇంక ఈ ఆరు ప్రశ్నలే బాబూ. జవాబులు చది వేస్తే రేపు పరీక్షలో ఫస్టుమార్కు మనదే!"

"బాబోయ్! నిద్రొచ్చేస్తోంది."

"ఉండండి బాబూ! ఇప్పుడే వస్తాను వేడి కాఫీ తెస్తాను. మరి కొంత సేపు నిద్ర ఆగుతుంది."

వంటగది గడపలో గంగను చూస్తూనే రామ్యాల ఖంగారు పడిపోయారు.

రాఘవులు మెల్ల మెల్లగా ఒక పెద్ద బుట్టను కాలితో ంటబల క్రిందికి నెట్టసాగాడు.

ఏమీ గమనించనట్లే కాఫీ కలిపి తీసుకుపోయింది గంగ.

బాబును చదివించేందుకు కూర్చున్నట్లే కూర్చుని మరలా వచ్చింది వంటింట్లోకి, కొద్దిగా గుమ్మం ప్రక్క నిల బడి వినసాగింది.

"అయ్యబాబోయ్! ఆ గంగ సూసిందేమో అనుకు న్నాను సూణ్లేదు. బతికిపొయ్యాం" అంటోంది లక్ష్మి.

"సూత్తే చూడనీ, ఏం, ఇంటికైన ఇల్లాలా ఏం? ఆ ఇల్లాలే సూసినా నాలుగు కేక లేయొచ్చు కానీ తలగొట్టి మొలేస్తదా?" అంటున్నాడు రాఘవులు.

"అబ్బో! ఇల్లాలికేం అక్కర్లేదు. అన్నీ ఈ దిక్కు మాలిన దానికే గావాలొన్నన్నైన్నై, తనిల్లులాగే కావలా."

మెటికలు విరిచింది లక్ష్మి.

"రేతిరి- -అందరూ పడుకున్నాక అందించేయి. కారుషెడ్డు పక్కన నిలబడతాను" అంటోంది.

"సరే." రాఘవులు అంగీకరించాడు.

గంగ నెమ్మదిగా అడుగులు వేసి ఎవరకు వచ్చింది.

ఎటూ చూడక తిన్నగా బల్ల దగ్గరకు వెళ్ళి బుట్టను బయటకు లాగింది.

బుట్టలో సగానికి బియ్యం, ఒక కంది పప్పు పొట్లాం ఒక టెంకాయ, రెండు చిన్న స్టీలు పాత్రలు, నాలుగు టేబుల్ స్పూన్స్ వున్నాయి.

రాము ఖంగారుగా చూస్తున్నాడు.

లక్ష్మీ రాఘవులూ ముఖాలు చూచుకోసాగారు

రాఘవులు చూపులో పెంకెతనమున్నది.

"ఏమిటివన్నీ ? బయటికి దాటించుతున్నారా ?" అన్నది గంగ లక్ష్మిని ఉద్దేశించి.

రాఘవులు కోరలు చూపుతూ ముందుకువచ్చాడు.

"ఓయబ్బో! వచ్చింది అడగడానికి! కుక్కని మించిన యిశ్వాశం ఒలకబోస్తావుంది!"

"రాఘవులూ!" గద్దించింది గంగ.

"కుక్కకే విశ్వాసమూ, మనిషికి ఘాతుకత్వమూ వుండాలనిలేదు. మనిషికీ వుండొచ్చు విశ్వాసం! ఈసారికి వదిలేస్తున్నాను, మరోసారి యిలా జరిగితే అయ్యగారికీ అమ్మగారికీ చెప్తాను. జాగ్రత్త!"

మరి మాటల కెదురు చూడక వెళ్ళిపోయింది గంగ.

"గంగా! నాకేమీ తెలియదు. వాళ్ళిద్దరే కూడు వుతాణీ!" అంటూ రాము గంగ వెనువెంట వెళ్ళాడు.

"చూస్తూ వూరుకుంటున్నావుగా వాళ్ళ పాడుపనిని? అది మాత్రం తగునా? అయ్యగారి పాత నౌఖరువుకూడాను. నువ్వు!"

"తప్పే అయ్యింది."

"సరేలే కానీ కాస అటువంటివి జరగకుండా

చూడు మరి! వారి తిండి తింటూ వారికే గోతులు తీస్తే మనకు పుట్టగతులుంటాయా?"

"ఔను లెండి. తెలిసింది."

అక్కడ వంటగదిలో రాఘవులు కోపంతో ముక్కుపుటా లెగరేశాడు.

"ఛస్! దీనికి భయపడేదేటి? అమ్మగారికి నీ మాటంటే గురికదా? దీన్నొగరగొట్టే దారి సూడే లక్ష్మి!"

"ఆఁ. పెద్దోలదాకా ఎందుకు? మనవేఁ ఏదో ఓటి ఆలోచించాల!"

"సర్లే అయితే. చూస్కో నా తడాఖా! నేను పడుకుంటే జరమొచ్చిందని...వంటగదంతా అది రాజ్జమేలేసింది. అయ్యగారు 'ఆమె వంట బాగుంది. త్వరగా చేసేది, నీకింత టయం ఎందుకూ' అంటూ వగలుబోయారు."

ఆడవాళ్ళలా తిప్పుకుంటూ మాట్లాడిన ఆ మాటలకు లక్ష్మి పడిపడి నవ్వింది.

"నేను పడకేస్తే యిబ్బంది ఏటో తెలిసొత్తాది... నాకు అడుగులకు మడుగులొత్తుతూ ఉంటారు—అనుకున్నాను, కానీ ఇదొకతొచ్చింది కద...నా నాటకాలు సాగనీయకుండ సూడు...దీన్ని ఉఫ్‌న ఊదేస్తాను!"

ఈ ప్రగల్భాలు విని లక్ష్మి మళ్ళీ నవ్వింది. "ఏకీ ఆ మిగిలిన ఇడ్లీలన్నీ ఇటుపారేయి!" అని కొంగుపడుతూ

# 16

"రండమ్మా రండి రండి."

అపర్ణ షాపులో అడుగు పెడుతూండగానే దుకాణపు యజమాని దగ్గరనుండి సేల్సుగర్ల్సువరకూ అందరూ అపూర్వ ఆహ్వానాలు కురిపించారు.

"లేడీస్ వేర్... లేటెస్ట్ ఏమైనా వచ్చాయా?"

"లేటెస్ట్......ఆఁ. ఆ మధ్య అయ్యగారు తీసుకెళ్ళారు కదండీ. అవే ఫారెన్ క్వాలిటీ......"

"ఊఁ? మావారా? సతీష్‌గారా?"

"ఔనండమ్మా! ఇదిగో, ఈ వెరైటీ తీసుకున్నారు."

అపర్ణ కొద్దిసేపు చకితురాలై చూచింది.

ఆడవారి వాడకానికే అవన్నీ.

ఆరోజు రాజేశ్వరి చెప్పింది...'పెటీకోట్స్ వగైరా స్త్రీల దుస్తులు కొంటూండగా చూచా'నని!

సతీష్ అబద్ధమని త్రోసిపారేశాడు.

మరి యిప్పుడు షాపువారు కూడా చెప్తున్నారు, అబద్ధమెలా ఔతుంది?

నగరంలో ప్రాముఖ్యతా, గుర్తింపూగల వ్యక్తులలో ఒకడు సతీష్! అటువంటి వ్యక్తిగురించి లేని మాటలు చెప్పగల సాహస మెవరికి వుంటుంది?"

వేరొకరిని సతీష్‌గా వారు భ్రమపడ్డారనుకోవడానికి కూడ వీలులేదు. సతీష్ ప్రముఖ వ్యక్తులలో ఒకడు!

"అన్నట్టు......వారంరోజు రెండువందలు యిచ్చి చిల్లర తీసుకోవడం మరచారు. ఇదిగోనండి బిల్లు! డబ్బు!"

ఆ బిలు తీసుకుని వివరంగా చూచింది అపర్ణ.

'నూటయాభై ఏడు రూపాయల చిల్లర!'

ఈ విషయం కూడ చెప్పింది రాజేశ్వరి!

అగ్నిశిఖలా ఇంటికి వచ్చిన అపర్ణ ఆగ్రహానికి మరింత యింధనమైన దృశ్యం కంటపడింది.

అంతకుముందే వచ్చినట్లున్నాడు సతీష్ ఇంటికి. నీటుగా తయారై ఎక్కడికి వెళ్ళడానికో సిద్ధంగా బయటికి వచ్చాడు.

లాన్‌లో ఆడుకుంటూన్న చంద్ర, కుమార్ మొక్కలకు నీరుపెట్టే ప్లాస్టిక్ గొట్టంతో ఆడుతున్నారు. తనకు కావలెనంటే తనకు కావాలని ఇద్దరూ పోటీపడి ఒకరివెంట ఒకరు పరుగులు పెడ్తున్నారు.

"అయ్యో బాబూ, దెబ్బలాడుకోకండి" అంటూ ఆ వెనుక గంగ పరుగులు తీస్తోంది.

ఆఖరుకు కుమార్ గంగచేతికి చిక్కాడు.

"బాబూ! ఏమిటా అల్లరి?" అని అతడి చేతిలోని పైప్ తీసుకున్నది గంగ.

అయితే ఆ విసురులో నీరు వేగంగా చిమ్ముకొచ్చి చెట్లపైనిలబడిన సతీష్‌ను ఆపాదమస్తకం అభిషేకించాయి.

"అరె!" సతీష్ ప్రక్కకు తొలిగాడు.

అయితే అయ్యగారిని చూచిన ఖంగారులో గంగ

చేయి వశం తప్పి వణకడం ప్రారంభమై సతీష్‌ను మరింత స్నానం చేయించింది నీరు

పిల్లలిద్దరూ ఆ దృశ్యం చూచి కేరింతలు కొట్టి ఎగిరెగిరి నవ్వసాగారు.

అంతలో కుమార్ నిశ్చేష్టురాలై నిలబడిన గంగ చేతినుండి పైపు లాగుతీసుకుని నీరు గంగ నిండా కొట్టాడు విరగబడి నవ్వుతూ.

దృశ్యం మరింత ఘోరంగా తయారైంది.

దూరాన వున్న మాలి పరుగున వచ్చి ఆ పైపును తీసుకుని ఆపాడు.

పిల్లల నవ్వులు యింకా ఆగలేదు.

భయకంపితురాలై, నిశ్చేష్ట అయిన గంగ యింకా తేరుకోలేదు.

హఠాత్సంఘటన వలన కలిగిన విభ్రమంనుండి సతీష్ సహజతను సంతరించుకోలేదు.

అపుడే ఏతెంచి, అంతా చూచివున్న అపర్ణ ఆగ్రహ స్వరం వినవచ్చి అందరూ అటు చూచారు.

"సినిమాలో జలకాలాటల షూటింగ్ ఇక్కడ జరుగుతోందని దండోరా వెయ్యరా మాలీ. చక్కగా ప్రేక్షకులు వచ్చి పది డబ్బులూ, నాలుగు ముద్దులూ విసురుతారు!"

దుఃఖం ముంచుకొచ్చింది గంగకు.

"అమ్మగారూ, నా తప్పేంలేదండి......" ఏమో వివరించ బోయింది.

"ఛీ. సిగ్గులేని దానా! ఇంకా ఎందుకలా తగలడ్డావ్? పోయి ఆ గుడ్డలు మార్చుకురా."

"అలాగేనండి."

"చూడూ నీ హద్దుల్లో నీ వుంటేనే ఇక్కడుండేది! జాగ్రత్త!"

సతీష్‌కు ఏమి మాట్లాడాలో తెలియలేదు.

హుంకరించి, మెట్లెక్కుతూ భర్తదెస ఒక్కసారి క్రోధంగా చూచి ముఖం త్రిప్పుకొని లోపలికి వెళ్ళిపోయింది.

పిల్లలు కొంటెతనం మాత్రమే యిలా చేసిందని సతీషుకు తెలుసు. అయితే అపర్ణకు ఏమి చెప్పినా లాభం వుండదనీ తెలుసు. ఆమెకు తన తల కెక్కిన ఏ విషయమూ కిగా దిగదు.

దుస్తులు మార్చుకొనే నిమిత్తం సతీష్ లోనికి వచ్చాడు.

అపర్ణ కుర్చీలో కూర్చున్న తీరులో మార్పు లేదు. పొగలు సెగలు కక్కుతోంది ఆమె కోపం.

"ఇదేమిటి?"

హఠాత్తుగా లేచివచ్చి అతడి కనులకు దగ్గరగా ఒక కాగితాన్ని వుంచింది.

ఆశ్చర్యంగా తీసుకు చూచాడు. కొద్ది క్షణాలు అతడి వదనం వివర్ణమైంది. అది ఆ రోజు గంగకు తాను కొనిన దుస్తుల బిల్లు.

"ఏమిటి నీకెలా వచ్చింది?"

"ఇవుడు ఆ షాపు నుంచే వస్తున్నాను. నా కోసం మీరెపుడూ షాపింగ్ చేయరు. మరి యివన్నీ ఎవరికోసం కొన్నట్టు? అబద్ధాలు చెప్పకండి. ఆ షాపులో వాళ్ళుమీరే స్వయంగా వచ్చి కొన్నట్టు చెబుతున్నారు."

నవ్వేశాడు సతీష్.

"అనుమానాలకు కూడ హద్దులుండాలి అపర్ణా, ఆ బిల్లు మనది కాదు. అందుకే తీసుకోకుండా వదిలేసి వచ్చాను."

"ఎవరిదిమరి?"

"నేను బేబీకి డ్రెస్‌లూ, రిబ్బన్లూ కొన్నపుడే ఆమె

స్కూలు వాళ్ళెవరో అక్కడ కొనుక్కుంటున్నారు. ఒకరి బిల్లు ఒకరికి రాశాడు ఖంగారులో అంతే."

"నేను ఒకరిని కల్సుకోవాలి. బహుశా గంటలో వచ్చేస్తాను" అనేసి త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

మరి ఆరాతీసేందుకు అపర్ణకూ వ్యవధి లేకపోయింది. ఆమె కోసం ఎవరో వచ్చారని కబురు.

డ్రాయింగ్ రూమ్‌లో సోఫాలో కృపావతిని చూడగానే సతీష్ లోలోన క్రుద్ధుడైనా పైకి ప్రకాశంగా బాగానే పలుకరించాడు.

"ఏమిటీ శ్రీవు, మిమ్మల్ని చూచి చాలరోజులైంది ఓ సారి మాద్దామనీ......" మెలికలు తిరిగిపోతూంటే అసహ్యమన్పించింది సతీష్‌కు.

"సారీ! కొంచెం 'బిజీ'గా వున్నాను. నా మిసెస్‌తో మాట్లాడండి" అని వెళ్ళిపోయాడు.

"ఓ! మీరా? అంటూ అపర్ణ వచ్చింది.

ఇరువురూ కబుర్లలో పడ్డారు.

"ఎలా వుంది ఆ అమ్మాయి?" అడిగింది కృపావతి.

"ఏదో వుంది లెండి కుక్కని సింహాసనం మీద కూర్చోబెట్టి నట్టు."

"కాదు మరీ? అక్కడ వుంచమని నేనారోజు ఎంత చెప్పినా మీ వారు పట్టుబట్టి తీసుకొచ్చేశారు. ఎందుకో అంత అభిమానం ఆ పిల్లపై? ఆ పిల్ల ఇక్కడెలా వుందో

కానీ, అక్కడ మాట్లాడేది కాదు, తిండి తినేది కాదు, సమస్యగా వుంది ఆ వున్న రోజున్నరాను."

"ఊఁహూఁ"

తలపంకించింది అపర్ణ సాలోచనగా.

'పట్టుబట్టి... అభిమానంగా తీసుకువచ్చారా?'

జరిగినదానికి జరుగుతున్నదానికీ, విన్న విషయానికీ, చూచిన దృశ్యానికీ లంకెవేస్తోంది ఆమెమనసు.

'ఇదే నిజమైతే దీని పని దేవుడెరుగు. దీన్ని ఇంటికీ ఆయనకూ దూరం చేయాలి, దూరంగా తరిమేయాలి'

మెదడు ఉడికిపోతూ ఆదేశాలు విన్పిస్తోంది.

"రాఘవులూ!" బిగ్గరగా వీధంతా విన్పించేంత కేక వేసింది.

ఆమె ఆగ్రహ వదనాన్ని చూచిన కృపావతి మాటలు కట్టిపెట్టి నోరుమూసుకు కూర్చున్నది.

"అతిథులు రాగానే వచ్చి ఏం కావాలో కనుక్కో వడంరాదా? ఎన్నిసార్లు చెప్పాలి?"

రాఘవులు మెదలక నిలబడ్డాడు.

"ఐస్క్రీం వున్నదా?"

"లేదండి. చెయ్యాలి."

"వద్దులే. ముందు కూల్డ్రింక్స్ తీసుకురా. తర్వాత ఉప్మా చెయ్యి."

"ఇప్పుడేం చేయలేనండి. నాకు తల నొప్పిగా వున్నది."
ముఖం గంటు పెట్టుకు చెప్పాడు రాఘవులు.

"ఏమిటీ?"

"ఔనండి. కొంచెం సేపు రెస్టు తీసుకుని సాయంత్రం వంట చేస్తాను. గంగను చెయ్యమంటానండి ఉప్మా"

"ఊఁ. దాన్నిలా పంపు."

వినయంగా వచ్చి నిలబడిన గంగను తినివేసేట్లు చూచింది అపర్ణ.

"నమస్కారమండి" అన్నది కృపావతిని చూచి.

"ఊఁ ఊఁ. ఎలావున్నావు?" దర్పం ఒలికించుతూ అడిగింది కృపావతి.

"బాగున్నానండి."

"ఊఁ. బాగుంటావు ఇలాంటిచోట" బుద్ధిగా పడి వుంటే, కుదురుగా వుండు."

ఈ హితబోధ ఎందుకో అర్థంకాని గంగ అపర్ణవంక అయోమయంగా చూచింది.

"వెళ్ళి ఉప్మా కాఫీ చెయ్యి" ఆజ్ఞాపించింది అపర్ణ గంగను.

"అలాగేనండి" వెళ్ళిపోయింది.

గంగ వెనుకనే వచ్చిన కుమార్, చంద్ర కృపావతిని వింతగా చూడసాగారు.

"మా అమ్మాయి, అబ్బాయి! వీళ్ళను చూచుకోవ డానికే ఆ పిల్లను భరిస్తూన్నది!"

"ప్చ్. వాళ్ళనెందుకు చూచుకోవడం? శుభ్రంగా వాళ్ళంత వాళ్ళు బ్రతగ్గల పిల్లలు."

రాఘవులిచ్చిన కూల్ డ్రింక్ ఒక్కో గుక్కే తాగుతూ అనవసర సలహాలు విసురుతోంది కృపావతి.

సాధారణంగా అటువంటివారి సన్నిధే అతి ఆహ్లాద కరంగా వుంటుంది అపర్ణకు.

ఖాళీ డ్రింక్ సీసాలు వంటింట్లోకి తెచ్చి క్రేట్‌లో విసిరినట్టే పడవేసేడు రాఘవులు.

"సెకనుకో అతిథి, నిమిషానికో ఆర్డరు! దోసె చెయ్యి! కాఫీ చెయ్యి! ఉప్మా చెయ్యి! వంట చెయ్యి! ఎన్ని ఎన్ని ఆర్డర్లు! ఔను ఆళ్ళ బాబుల తాతల సొమ్ములు, ఆఫీసు సొమ్ములూ తేరగా వుంటే ఎంతమందైనా పోషింతారు, ఎన్ని ఆజ్ఞలైనా విసురుతారు. ఈ యింట్లో ఏ పనిమనిషీ బతక లేడు. నేను 'గారంటీ' రాసిస్తాను. ఏ అమెరికావోడో మఱ మనిషిని తయార్జేసి పెట్టాల యిలాటి ఇంట్లో ......"

తన మాటలకు వంతపాడే లక్ష్మి అక్కడ లేనందున వాక్ప్రవాహం ఆపి గంగదేవ చూచాడు. ఆమె ఏ విధంగా తీసుకొంటోందో తన మాటలనని

అయితే వదనం ఏ భావమూలేని గాంభీర్యతతో నిండివున్నది.

ఆమె అమ్మగారి ఆజ్ఞ అమలుజరిపే ప్రయత్నాలు చేస్తోంది

'తన్నదియ్యా! ఇదొకతె కొరకరాని కొయ్యా. ఆ ముఖాన ఓ నవ్వూ వుండదు, ఆ నోట్లోంచి ఓ హాస్యమూ రాదు. దీని సొమ్మేం పోయిందనో? నేను చెయ్యలేనూ అని అమ్మగారికి ఖరాఖండిగా చెప్పినాను. ఆ పని చెయ్యడాని కిదొచ్చింది. ఇలాగైతే ఇక దీన్నే చెయ్యమంటది తన్నా పొమ్మని. సూత్తాను దీని పొగరేంటో?'

పైమీది బట్ట అక్కసుగా దులిపి తలకు చుట్టుకొని పోయి వెనుక వరండాలో పడుకున్నాడు. అక్కడికి వంటగది అంతా బాగా కన్పడుతోనే వున్నది.

టిఫిన్ తయారీ పూర్తిచేసి, అపర్ణవద్దకు వెళ్ళి "తెమ్మంటారా అమ్మగారూ?" అనడిగింది గంగ.

కృపావతి సమాధానం చెప్పింది.

ఇప్పుడేగా డ్రింక్ తాగాం? కాస్సేపుండి పిలుస్తాం లేమ్మా. వెళ్ళు. వెళ్ళి నీ పని చూసుకో."

పిల్లల గదిలోనికి వెళ్ళి గంగ వాళ్ళ చదువులు పుస్తకాలు తీయుచుంది.

"అబ్బ, వద్దులే సిస్టర్! ఔనుకానీ ఆవిడ అంత లావుగా వుండేమిటీ?" కుమార్ అడిగాడు.

"తప్పు. ఒక్కొక్కరు ఒక్కోలాగ వుంటారు. అలా మాట్లాడకూడదు.

"ఆవిడ వెళ్ళాక ఆ సోఫా కోళ్ళున్నీ వున్నాయో, విరిగి పోయాయో కాస్త చూసుకోవాలి" చంద్ర అన్నది.

"తప్పమ్మా, ఆ రోజు నన్ను మీరొచ్చి తీసుకొచ్చారు చూడు. ఆ శరణాలయం ఆవిడదే. నావంటివాళ్ళ నెందరికో ఆవిడ తిండీ, బట్టా, యిల్లూ యిస్తున్నారు!"

కుమార్, చంద్రా ఆనాటి దృశ్యం గుర్తుకు తెచ్చుకున్నారు.

"ఓ! తెలిసింది. ఆ రోజు అక్కడ వాళ్ళంతా నీకంటె సన్నగా ఈసురోమంటూ వున్నారు. వాళ్ళ తిండంతా ఈమె తినేసి యిలాగై పోయిందన్న మాట!"

అని తప్పట్లుకొట్టి నవ్వసాగింది చంద్ర.

కుమార్ శృతి కలిపాడు.

గంగ నిస్సహాయంగా చూడసాగింది. పిల్లల ధోరణి ఆమెకూ నవ్వు తెప్పించినా నిగ్రహించుకున్నది.

ఉన్నట్లుండి చంద్రకు సందేహం పుట్టుకొచ్చింది.

"ఆవిడకు ఎంత ఉప్మా కావాలంటావు? సాధారణంగా మమ్మీకీ వాళ్ళకీ ఒక్క ప్లేటు సరిపోతుంది."

"ఎంత టిఫెన్ చేశావు సిస్టర్? పెద్ద అండాతోనా?" కుమార్ ప్రశ్న.

"ఔనూ. ఆవిడకు అయితే ఉప్పూ, కారం అన్నీ మనకంటె ఎక్కువే కావాలేమో?" చంద్ర సందేహం.

వాళ్ళ ధోరణి వినలేక వెనుక అంగణంలో ఆరిన బట్టలు తీసి అక్కడే మడచసాగింది చెట్టు క్రింద కూర్చుని.

"ఏయ్! టిఫెన్ తీసుకురా."

అపర్ణ కంఠం విని లేచి బట్టలు గదిలోవుంచి వంటగదిలోకి నడిచిన గంగ పిల్లలిద్దరూ అక్కడ సందడిగా తిరుగుతుండడం చూచి,

"మీకు తర్వాత పెడ్తాను, బయట కూర్చోండమ్మా చిన్నపిల్లలు వంటగదిలోనికి రాకూడదు" అన్నది.

వాళ్ళిద్దరూ గుంభనంగా నవ్వుకొని వెళ్ళిపోయారు.

రాఘవులు మంచి నిద్రలో వున్నట్లు గుర్రు పెడుతున్నాడు.

ఉప్మా, మంచినీరు యిచ్చి మరలా వంటగదిలోనికి వచ్చిన గంగ డ్రాయింగ్ రూంనుండి ఏవో పిచ్చి కేకలూ, గోలా విన్పించి మరలా పరుగున అక్కడకు వచ్చింది.

"ఏమిటండమ్మగారూ?"

అతి ఉగ్రంగా వున్నాయి అపర్ణ కనులు.

ఇద్దరి కనులనుండీ ఒకటే ధారగా నీరు కారిపోతోంది. ఏదో బాధను తట్టుకోలేకపోతూన్నట్లు ఇద్దరూ వెనక్కూ ముందుకూ పడిపోతూ గొంతు సవరించుకుంటూ గ్లాసులలో నీరు గటగటా త్రాగేశారు.

అంతతో చాలనట్లు ఫ్రిజ్ వద్దకు పరుగెత్తారు.

కొంత కొంత నీరు త్రాగుతూ, మాటిమాటికి నెత్తి మీద కొట్టుకుంటూ, నీరు కారిపోతూన్న కనులూ ముఖ్యా తుడుచుకుంటూ దగ్గుతూ మహా విచిత్రమైన అవస్థ అనుభ వించారు అయిదునిముషాలపాటు.

ఏమి జరిగినదో తెలియని గంగ అటే చూస్తూ ఏమి చేయవలెనో తెలియక నిలచింది.

"ఏం జరిగిందమ్మగారూ?"

కొంత శాంతించిన అపర్ణ యిటు తిరిగింది.

ఉగ్రకాళివలె కన్పట్టిందామె రూపం గంగకు.

క్రూరంగా చూచి, టేబుల్ మీది ఉపాహారవు పళ్ళెం తీసి సూటిగా గంగముఖాన కొట్టింది.

"అమ్మా!" అంటూ గంగ నుదురుపట్టుకుని ఒళ్ళు పారిగా క్రింద కూలబడింది.

"ముదనష్టపుదానా! ఎందుకే అంత కసి నామీద? అంతంతలేసి కారం, ఉప్పూ పోసి నాకు ఫలహారం చేస్తావా?"

కృపావతి బిగ్గఱగా అరచి గొంతు సవరించుకుంది.

"కక్ష మీామీాదనా, నా మీదనా?"

అపర్ణ కృపావతికి వంతగా అన్నది.

అపర్ణ విసిరిన ప్లేటు గంగ ముఖాన ముక్కలుకాగా నుదురు చిట్లి రక్తం కారసాగింది.

అయినా లెఖ్ఖజేయక వారి మాటలు విని గంగ విస్మ

యంతో వంట యింట్లోకి పరుగెత్తి ఉప్మా గిన్నెనంతనూ బయటకు తెచ్చి, తాను యింత తీసి నోటిలో వేసుకుని వెంటనే ఉమ్మి వేసింది.

భయంతో - అయోమయంతో కనుగ్రుడ్లు పెద్దవిచేసి అటుయిటు చూచింది.

"నాకు నిజంగా ఏమీ తెలియదమ్మగారూ! బాగానే చేశాను" అన్నది రొప్పుతూ.

"ఛీ నోర్ముయ్! బూటకాలు కూడానూ"

ఈసారి ఖాళీగ్లాసు వచ్చి గంగ ముఖాన తగిలింది.

అదే క్షణంలో అటు సతీష్ హాలులో అడుగుపెట్టడం జరిగింది.

"మమ్మీ బాగా డాన్స్ చేస్తోందా, కృపావతి బాగా చేస్తోందా?"

అని తర్జన భర్జన పడతూ గుమ్మం ప్రక్కనుండి తొంగిచూస్తూన్న కుమార్, చంద్రా తండ్రిని చూడగానే ఏమీ తెలియనటు అటెన్షన్‌లో నిలచారు.

అయినా సతీష్ వారిమాటలను విననే విన్నాడు.

వారిమాటలేమిటో, ఎదుటి దృశ్యమేమిటో ఏమీ బోధపడని స్థితిలో ఒక్కనిముషం అలా చూచాడు.

"ఏం జరిగింది?" అని అక్షరను అడుగుతూ గంగవద్దకు నడిచాడు,

"ఎటువంటి పాపిష్టి ముఖాన్ని తెచ్చి మీరు యింట్లో పెట్టారో యేమైనా తెలుసా?"

బూసలు కొడుతూ అడిగింది అపర్ణ.

ప్రశ్నార్థకంగా చూచాడు సతీష్.

"రాఘవులకేం రోగమొచ్చిందో చేయనన్నాడు. దీన్ని ఉప్మా చేయమంటే ఏం చేసిందో చూడండి."

గిన్నె తెచ్చి అతడి ముందు పట్టుకు నిలబడింది.

"అలా చూస్తారేం? అదెలా వున్నదో తిని చూడండి" అంటూ ఉరిమింది.

కొద్దిగా నోట్లో వేసుకున్న సతీష్‌కు పలకమారింది.

వెంటనే ఉమిసి పారేసి, ఫ్రిజ్ వద్దకు పెద్దపెద్ద అంగలతో వెళ్ళి మంచి నీరు సీసాతోనే గటగట తాగేశాడు.

అనేక భావావేశాలతో అతడి వదనం అరుణిమ దాల్చింది.

"అమ్మయ్యో!" కృపావతి గుండెలు బాదుకున్నది. ఈ రోజు ఇలాగైంది. మరోరోజు ఏ విషమో కలపగలదు. బొత్తిగా యిటువంటి తక్కువ వాళ్ళను యింట జేర్చరాదు. వాళ్ళకు ఆశ్రమాలే సరైన స్థానాలు!"

"కృపావతిగారూ!" కఠినంగా సంబోధించాడు సతీష్. "ఇది మా యింటి వ్యవహారం, మీరు దయచేసి వెళ్ళ  "

అపర్ణ తాడెత్తున లేచింది.

"ఏం అమెగారుంటే ఏమైంది?"

"అపర్ణా !!!"

గది దద్దరిల్లింది.

కృపావతి బయటకు పరుగెత్తింది.

కుమార్, చంద్ర బిక్క ముఖాలతో వచ్చి నిలబడ్డారు.

"బాబుగారూ, నాకేం తెలియదు అయ్యగారూ."
రోదించుతూ సతీష్ పాదాల చెంత కూలింది గంగ.

"నోర్మూయ్. టక్కులాడి!" అపర్ణ కసిరింది. "లే, ఫో నాయింట్లోంచి." ఎడాపెడా వాయించింది గంగను.

"ఆగు. ఏమిటా పశుత్వం!" అపర్ణను బలంగా నెట్టి సోఫాలోకూల వేశాడు సతీష్.

'ఏమిటాగేది? అతిథుల ముందు నన్నింత అవమానించుతుందా ఆఫ్టారిల్ ఓ కూలిది!"

"ఊఁ. ఆపు. నీ కళ్ళతో చూడందే ఎందుకలా నోరు పారేసుకుంటావు?"

"ఏమిటేమిటీ?"

"ఔను. ఉప్మాలో మనిషిని అదరగొట్టేంత కారం ఉప్పు వున్నాయి. అది ఏ మారి పొరపాటున వేస్తే కాస్త ఎక్కువైనట్లు లేదు. కావాలని కలిపినట్లు వున్నాయి.

"ఓహ్హో అన్నారుగా!" అపర్ణ.

"నాకేం తెలియదు బాబుగారూ" గంగ.

"నువ్వాగు గంగా......ఆ పని చేయటానికి చేసిన

వాళ్ళకు అవివేకమైనా వుండాలి, మొండి ధైర్యమైనా వుండాలి! అవి గంగలో వున్నాయా అపర్ణా?"

"ఏమో దాని గుణగణాలు నాకేం తెలుసు? తెచ్చి యింట పెట్టింది మీరు!"

"అయ్యగారూ ఏ ప్రమాణం చేయమన్నా చేస్తాను. నన్ను వెళ్ళ గొట్టకండి." గంగ హృదయం పగిలేట్టు ఏడు స్తోంది.

"డాడీ!"

కుమార్ చంద్రా వచ్చి సతీష్ కాళ్ళకు చుట్టుకు న్నారు.

"ఏమిటమ్మా?"

"మరి. మీరు పనిష్ చేయనంటే ఒక్కమాట!"

"చెయ్యను. ఏమిటి?"

"నిజంగా చెయ్యరా?"

"ఊఁ. త్వరగా చెప్పండి."

"మరి......" గుండెల మీద క్రాస్ వేసుకుంది చంద్ర చేతితో. "బై గాడ్......ఉప్పు మేమే కలిపాము కానీ కారం ఎవరుకలిపారో తెలియదు డాడీ."

"మీరా?" నమ్మలేనట్లు అడిగాడు సతీష్ పిల్లలను. బెదురుతూ అన్నాడు కుమార్.

"ఆమె అంత లావున్నది—ఎంత ఉప్పు తింటుందో చూద్దామని "

సతీష్ ఇనుపమనిషిలా నిలబడ్డాడు.

గంగ ఏడుపు ఆపి పరుగున వచ్చి పిల్లలను చెరో చేతితో వెనక్కు లాగి దగ్గరకు తీసుకుంది.

"పిల్లలను కొట్టకండి అయ్యగారూ, కేవలం కొంటె తనం" బెదరిపోతూ అంటూంటే కంఠం వణికింది.

"కొట్టను. మరి కారం ఎవరు కలిపారు?" ఆలోచనా పూర్వకంగా చుట్టూ చూచాడు.

అపర్ణ కోపంగా అరచింది.

"ఎవ్వరూ కాదు. అంతా దానిపనే. పిల్లలకి అంటె యిష్టం. అందుకు తప్పు తమమీద వేసుకుంటున్నారు!"

"గుడ్డి ఆవేశం అనర్థం. జరిగింది తెలుసుకో."అంటూ వంట గదిలోనికి వెళ్ళాడు సతీష్.

అంతవరకూ ఒక చెవి యిటు వుంచి ఆనందించు తూన్న రాఘవులు చటుక్కున ముసుగుదన్ని కదలక పడు కున్నాడు.

అది సతీష్‌గమనించనే గమనించాడు.

"ఏయ్ రాఘవులూ! నిన్నే రాఘవులూ!"

స్వరం హెచ్చించి పిలిచాక అతి కష్టం మీద అప్పుడే మెలకువ వచ్చినట్లు లేచి వచ్చాడు రాఘవులు.

"ఏం, అలా పడుకున్నావు?"

"బాబూ! తల నొప్పండి."

"ఓ! అంత మాత్రానికే పడుకున్నావా? నేను జ్వరంతో కూడ ఆఫీసుకు వెళ్ళాను!"

"కారులో కూచుని వళ్ళు కదలకండా ఎళ్ళి అయిను గదిలో కూర్చుంటా రు! మీకేమండి?

"నోర్ముయ్!" కోపంగా రెండడుగులు ముందుకు వేశాడు. "ఇంట్లో యింత గందరగోళం జరుగుతూంటే విన్పించలేదా నీకు?"

"                    "

"మాట్లాడవేం? నువ్వు నిజంగా నిద్రపోతున్నావా?"

"ఔనండి."

"నోర్ముయ్! చంపేస్తాను అబద్ధం చెబుతే, ఉప్మాలో ఏం కలిపావు?"

"బాగుంది. ఇదేటండోయ్?" దీర్ఘం తీశాడు.

"మర్యాదగా నిజం చెప్పు" అంటూ బెల్టు తీశాడు.

"మర్యాదా అమర్యాదా ఏటండి. నేనసలు వంటిం ట్లోకి రాందేనా?

"ఏయ్! ఏదీ...నీ కుడిచేయి నెత్తిమీద పెట్టుకో. ఊఁ. ఎడమచేయి కడుపుమీద...నీ భార్యాబిడ్డల మీద ప్రమాణంచేయి, నువ్వు ఉప్మాలో కారం కలపలేదని."

ఉలక లేదు, పలక లేదు రాఘవులు.

"ఏం మాట్లాడవేం?" బెల్టు ఝుళిపించాడు.

"తప్పైపోయిందండీ" విన్పించనంత మెల్లగా అన్నాడు.

"స్కౌండ్రల్ !" అసహ్యించుకుంటూ బెల్టు విసిరేశాడు సతీష్. "రోడ్డుమీద తిండిలేక తిరుగాడేవాడిని తెచ్చి పనియిస్తే యింత విశ్వాసహీనమా ? ఏం ఎందుకలా చేశావు?"

మాటలురాని మొద్దులా నిలబడ్డాడు రాఘవులు.

అంతలో బజారునుండి వచ్చిన రాము చెప్పాడు, మాలినుండి అంతా విన్నవాడై.

"వీడు వచ్చినదగ్గర్నుంచీ యింట్లో వస్తువులు కాజేయ్యటానికి చూస్తున్నాడండి. ఈ గంగ అడ్డువెళ్ళి మొన్న మందలించింది అయ్యగారూ. ఈ రాఘవులు లక్ష్మీ కలసి బుట్టెడు బియ్యమూ, స్టీలు సామానూ ఎత్తుకపోతావుంటే, చెట్టు పచ్చగుంటేనే ఆ నీడన మనం బతగ్గలమనీ, యజమానులకు నష్టం తేవద్దనీ చెప్పింది. అప్పటినుండీ ఈడు మనసులో కక్ష పెంచుకున్నాడు."

రాఘవులు అందరిదేసా చూచి సీరియస్‌గా లోనికి నడచి తన గుడ్డలమూట తెచ్చుకుని ఎవరి అనుమతి అడగకనే బయటకు పోసాగాడు.

"ఆగరా"

రాము అటకాయించి, మూటవిప్పి చూచాడు.

"ఈ పట్టు అయ్యగారిది కాదూ?"

"అమ్మగారే నాకిచ్చారు."

సతీష్ అపర్ణ దెస చూస్తే, ఆమె ముఖం త్రిప్పుకుంది.

"ఇదిగో, పని చేసినందుకు జీతం."

సతీష్ చేతికి ఎంతవచ్చిందో కూడ చూడక జేబు నుంచి తీసియిచ్చిన డబ్బును పరమానందంగా అందుకుని, మహావేగంతో నిష్క్రమించాడు రాఘవులు.

"లక్ష్మి వస్తే దాన్నికూడా పొమ్మను. ఇటువంటి దొంగబుద్ధులున్నవాళ్ళు నా యింట పనికిరారు."

రాము "చిత్తం" అన్నాడు.

అపర్ణ వ్యతిరేక పక్షపు న్యాయవాదిలా లేచింది.

"ఏం, రాము మాటలమీద మీ కెందుకంత గురి? నిజంగా లక్ష్మి, రాఘవులూ దొంగతనం చేశారో లేదో మీ కనులతో మీరు చూశారా మరి?"

వినగానే విస్మయంతో ... తర్వాత అసహ్యంతో చూచాడు సతీష్ భార్యదెస.

"ఛు. ఇంటి యిల్లాలివై యుండీ ఈ రీతిలో మాట్లాడుతూన్న నీ అవివేకానికి జాలిపడనా, ఏం చేయను? విచారించనా?"

"హేళన అనవసరం. లక్ష్మి వుంటుంది, రాఘవులూ వుంటాడు. దీనినే పొమ్మనండి. గంగ నాకవసరం లేదు" ఖండితంగా అన్నది

"గంగ వెళ్ళదు. ఇక్కడే వుంటుంది" స్థిరంగా అన్నాడు.

"ఏం, మీాకసలు ఇంటి విషయాలెందుకంటని?" రెచ్చిపోయింది అపర్ణ.

"ఇంటిని నేర్పుగా, పద్ధతిగా నడిపించడం నీకు వచ్చేంతవరకూ యింటి విషయాలలో నీకు పూర్తి అధికారం రాదు, నా యిష్టప్రకారమే నడుస్తుంది. పిల్లలను కొట్టవద్దని గంగ అడ్డువచ్చింది కానీ తల్లివైన నీకేమైనా భయమూ, బాధా వున్నాయా?

"ఓ! అయితే అదిపోదు, నామాట చెల్లదు. అంతేగా మీారనేది?"

"మమ్మాటికీ అంతే."

"సరే, అయితే నేనూ నామాటా అంత విలువలేని వారమైతే నేనే వెళ్తున్నాను!"

"ఆఁ!!!"

చూస్తూ చూస్తూండగానే రభస ఎంత పెద్దదై ఎలా రూపు సంతరించుకుందని"

అతడు లోలోన ఆలోచించుతూ వగస్తూనేవున్నాడు.

అపర్ణ పైకి వెళ్ళి ఓ పావుగంటలో తిరిగివచ్చింది చేతిలో రెండు చిన్న బ్రీఫ్‌కేసెస్‌తో.

ఆమె ఒక్కో మెట్టె దిగుతోంటే ఆమె హైహీల్డ్ చెప్పులు చేస్తూన్న శబ్దం చూపరులందరి గుండెలూ టక టక కొట్టుకునేట్లు చేస్తోంది.

"రామూ! నా కారు తీయ్!"

అపర్ణ మాటలకు పిడుగు పాటు విన్నట్లు ఆదరిపడ్డాడు సతీష్.

"ఏమిటా పిచ్చి? ఆలోచన వుందా అసలు?" సతీష్ క్రోధం తగ్గించి, సముదాయింపు స్వరంతో అన్నాడు. చను వుగా చేతిలోని సూట్ కేస్‌ను తీసుకోబోతే అపర్ణ యివ్వ లేదు.

అయితే, అతడి మాటలనుకూడ విన్నట్లేలేదు ఆమె ధోరణి.

"ఏరా రామూ, విన్పించలేదా, ఏమిటా దిక్కులు చూడడం?" అని కసరింది.

రాము దిఙ్మూఢుడై అయ్యగారి దెస చూచాడు.

"అమ్మగారూ. నేనేపోతాను." అంటూ పోయి గంగ అపర్ణ కాళ్ళపైపడి వేడుకున్నది. "మీ యిల్లుయిది. నా కోసం మీ రెందుకు వెళ్తారు?"

ఆ కన్నీటికి అపర్ణ కరగక పోగా శివమెత్తి పోయింది. "ఛీ. వంగనాచి. నువ్వెందుకు వెళ్తావు? కోటలో పాగావేశావు!"

సతీష్ అసలే ముక్కోపి. సంస్కారహీనపు మాటలు అతడిని క్రోధ వివశుని కావించాయి.

"అపర్ణా ఆలోచించుకో, పాదం బయట పెట్టావో— మళ్ళీలోనికి వచ్చే అర్హత వుండదు. ఇలా ప్రవర్తించడానికి నీకు సిగ్గుగా లేదా? నాకు నీతిగా నిజాయితీగా బ్రతకడ

మెంత అలవాటో నిష్కర్షగా మాట్లాడడమూ అంతే అలవాటు. నీకు బెదురుతాననుకోకు, ప్రతిమాలుతానని ఆశపడకు జాగ్రత్త!"

నౌకర్లు చూస్తున్న ఆ రాద్ధాంతం నడుమ నిలువలేనట్లుగా విసవిసా మేడమెట్లెక్కి వెళ్ళిపోయాడు.

అపర్ణ కనులు మరింత తీవ్రతను పొందాయి. వదనంలో యింకా అరుణిమ అధికం అయ్యింది.

"అందరి ఎదుటా తాను తగ్గడమా? అవమానం కాదూ?"

నిర్లక్ష్యమూ పట్టుదలా వదనం తాండవించుతూండగా బయటకు నడచింది.

"మేం రాము మమ్మీ." అని మారాం చేసిన కూతుర్నీ, కొడుకునూ రెండు తగిలించి కార్లో కుదేసింది.

పైకి వెళ్ళాడే కాని సతీష్ మనస్సు అల్లకల్లోలంగా మారింది. పిల్లల ఏడుపులు విని లేచి రాబోయినవాడు మరలా విచక్షణగా ఆలోచించాడు.

"మాటలాడే ప్రతి మాటనూ పెడార్థాలతో వికృతం చేసే అపర్ణతో వాదం పెంచకూడదు. అనవసరంగా పిల్లల మనసులు బాధపడతాయి."

ఆలోచనతో తిరిగి క్రిందికి వెళ్ళి ఇంకా విూమాంస తెగక నిలచిన రామూను చెంతకు పిలచి మెల్లని స్వరాన చెప్పాడు.

"అమ్మగార్నీ, పిల్లలనూ జాగ్రత్తగా పుట్టింట్లో దిగ విడచిరా. కారు అమ్మగారు అక్కడే వుంచమంటే వుంచు. లేదా పట్టుకు పొమ్మంటే తీసుకురా. ఇదిగో నీ ఖర్చులకు వంద. వచ్చేప్పుడు రైలులో రా కారు అక్కడ వదలితే."

"చిత్తం."

"చూడూ. మా మామగారితో చెప్పు నాకు ఫోన్ చేసి మాట్లాడమని. నువ్వు వెంటనే వచ్చేయి."

"చిత్తం బాబుగారూ" అంటూన్న రాము కంఠం డగ్గుతిక కావడం గమనించిన సతీష్ ప్రేమగా అతడిని భుజం తట్టి అన్నాడు.

"ఏమిట్రా రామూ అది? ఓ వారం రోజులుండివచ్చే స్తారు అమ్మగారు. వెళ్ళిపోవడం లేదు. ఖంగారు పడకు వెళ్ళిరా.

రాము కనులు తుడుచుకుంటూ బయటకు వెళ్ళేసరికే అపర్ణ తానే కారు స్టార్టు చేసింది. అయితే రాము పరుగున అడ్డు వెళ్ళి, ప్రాధేయపడి డ్రైవర్ స్థానంలో కూర్చున్నాడు.

ఏం, అయ్యగారి పర్మిషన్ అయిందా వచ్చావు? మీకు నేనేమీ కాను. అయ్యగారి కుక్కలురా మీరంతా, ఔనా?"

"నన్నేన్నయినా తిట్టండమ్మగారూ పడ్తాను. కానీ ఇలా ఇల్లొదిలిపెట్టి ఎళ్ళకండి. అయ్యగారేమైపోతారు?" రెండు చేతులూ జోడించాడు.

'ఏడిశావు నీతులు మాని నీపని నువ్వు చెయ్యి."

కారు వీధి గేటును దాటుతూండగా అపర్ణ ఇంకా వెక్కుతూ ఏడుస్తూన్న పిల్లలను కోప్పడుతూ వారు పైకి చూస్తూ చేతులు ఊపడం గమనించి అప్రయత్నంగా అటు చూచింది.

మేడ బాల్కనీలో సతీష్ చేతులు కట్టుకు నిలబడి చూస్తున్నాడు. అతడి ముఖంలో ప్రసన్నతా లేదు, అప్రసన్నతా లేదు.

మరునిముషంలో అటు సతీష్ ఇటు అపర్ణాకూడ చూపులు త్రిప్పుకొన్నారు.

ఆ కారు తన గుండెల మీాది నుండే సాగిపోయినంత బాధతో శయ్యను జేరాడు సతీష్.

తలచుకొన్న కొలదీ ఆతడు సిగ్గుతో చితికి పోతున్నాడు.

ఎంత ఆలోచించినా తన తప్పేమిా కన్పట్టటం లేదు

ఆశ్రయం లేని యువతి పాపం గంగ! అంతమాత్రాన ఏమిటి ఆమె అపరాధం? అపర్ణ బుద్ధి మాంద్యం కారణంగా ఆ అమాయకురాలిని ఈ క్రూర ప్రపంచపు కోరలలోనికి నెట్టటం ఏ మాత్రం న్యాయం? అలా చేస్తే, తన కొరకే అసువులు వీడిన నాగయ్య ఆత్మ క్షోభించదా?

'పాపం! మధ్యన గంగ నలిగిపోతోంది.

"ఏం చేయాలి? ఏమిటి ఈ సమస్యకు పరిష్కారం?"

మర్నాడు ఆదివారం.

తన అలవాటుకు భిన్నంగా బారెడు ప్రొద్దెక్కినా శయ్యను వీడలేదు సతీష్.

పరిస్థితి గంగకు చాలా యిబ్బందికరంగా వున్నది. తెల్లవార్లూ ఆమె కన్నుమూయలేదు. ఇంతటి సిగ్గుమాలిన పరిస్థితిలో గడపవలసిన పరిస్థితులేర్పడచిన తండ్రి మరణాన్ని తలచుకొని కుమిలి కుమిలి ఏడ్చింది.

గంట ఏడున్నర దాటుతూండగా కాఫీ కలిపి మేడ మీదికి తీసుకువెళ్ళింది.

"అయ్యగారూ!" బయటినుండే పిలచింది.

"కాఫీ తెచ్చానండయ్యగారూ!" మరలా చెప్పింది,

"ఊఁ." బద్ధకంగా పలికి, లేచి వచ్చాడు బయటకు.

"పద. క్రిందకే వస్తున్నాను."

అతడు టేబుల్ వద్ద కూర్చుని పరధ్యానంగా కాఫీ సిప్ చేస్తూండగా వెనుక అంత దూరంలో నిలబడిన గంగ మాటలు కూడదీసుకుంటోంది. అతడికేదో చెప్పడానికి.

"అయ్యగారూ——"

"ఊఁ?"

"నన్ను......మళ్ళీ ఆశ్రమానికి పంపేయండి. అమ్మగార్ని తీసుకురండి."

"ఊఁ."

'ఊఁ' అనే ధ్వని మినహాగా అతడేమీ మాటలాడలేకపోతున్నాడంటే జరిగిన ఉదంతం అతడినెంత కృంగదీసిందో అర్థమౌతోంది.

"నేను వెళ్ళిపోతే గొడవలుండవు కదా అయ్యగారూ!"

వింటూనే యిటు తిరిగాడు సతీష్.

రెండు నిముషాలు తదేకంగా గంగ దెస చూచాడు.

భయపడిన లేడివలె వున్న రెండు పదులైనా పూర్తిగా లేని అమాయకురాల్ని ఎక్కడికి పంపగలడు.

"వెళ్దువుగాని గంగా. త్వరలోనే నీ యింటికి నీవు వెళ్తావు!"

"నా యిల్లా!"

"ఊఁ. నీ కోసం చిన్నయిల్లు చూస్తున్నాను. మంచి వరుడిని వెతుకుతాను. సకల లాంఛనాలతో నీ యింటికి నువ్వు వెళ్తావు. అంతవరకు యిక్కడే వుంటావు మరో ఆలోచన పెట్టుకోకు. ఏవో గొడవలు జరుగుతాయి. అవే సర్దుకుంటాయి."

ఈ మాటలు విని ఉక్కిరి బిక్కిరి అయిపోయిన గంగ తేరుకొనే సరికి సతీ! అక్కడ లేడు. స్నానానికి వెళ్ళాడు.

'అయ్యగారిది మనసా నవనీతమా? ఎంత గొప్ప హృదయం!"

'నిన్న అమ్మగారు అంత రభస చేసినా అయ్యగారెంత శాంతంగా వున్నారు! రాముడు ఎన్ని జాగ్రత్తలు చెప్పి పంపారు అమ్మగార్ని పుట్టింటి వరకూ జాగ్రత్తగా పంపిరమ్మని! అంతమంచి భర్తవుంటే? అబ్బ! ఆడదాని కంత

కంటె ఏం కావాలి? భగవాన్! అమ్మగార్ని కూడ మంచి మనిషిగా మార్చి అయ్యగారికి సుఖం చేకూర్చు!'

"ఏవమ్మోయ్, ఏటి ఇల్లిలా వున్నది?"

లక్ష్మి కంఠం బిగ్గరగా వినరావడంతో అదరిపడి పర ధ్యానతను వీడి అటు చూచింది గంగ.

"ఏటి మాంచి కలలు గంటన్నావ్? రాఘవు లేడీ? వంట సెయ్యడం లేదేం యింకా? అమ్మగోరూ, అయ్య గోరూ ఊరెళ్ళినారా?"

సెనగలో — ఏమిటో నిర్లక్ష్యంగా తింటూ ప్రశ్న మీద ప్రశ్న కురిపించింది.

గంగకు పెదవి విప్పేందుకే భయంగా వున్నది.

'ఏం చెప్పాలి?'

"ఏటీ యవ్వారమేంటో దొంగ వాటంగా వున్నాది? ఏంటా కులుకు మాటాడకుండా? రాఘవు లేడీ?"

స్నానం ముగించి వచ్చిన సతీష్‌ను లక్ష్మి, గంగా కూడ గమనించలేదు.

"ఏమిటి?"

సతీష్ తీవ్రస్వరం వినరావడంతో లక్ష్మి మూగదై పోయింది.

"ఈ నెల జీతం ముట్టిందా నీకు?" తీక్ష్ణంగా అడి గాడు.

"ఆఁ.......లే...లేదండి."

సతీష్ లోపలికి వెళ్ళి రెండు నిముషాల్లో వచ్చాడు.

"ఇదిగో నీ జీతం పూర్తిగా, వెళ్ళు, మరి రానక్కర్లేదు."

తెల్లబోయి చూడసాగింది లక్ష్మి.

"నేను——నానేటి జేస్తినయ్యగారూ?"

అప్పటికే పైకి వెళ్ళిపోయిన సతీష్ పైమెట్టుపై నిలబడి యిటు తిరిగాడు.

"పని అవసరంలేదు. అమ్మగారు ఊరెళ్ళారు. అవసరమైతే కబురంపుతాం తర్వాత. వెళ్ళు."

"పదేను రోజులే బాబు నేజేసింది, పూర్తిగా యాభై యిచ్చేరేంటి?"

"ఫర్వాలేదు. తీసుకో."

సతీష్ తన డ్రెస్సింగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

లక్ష్మి ముఖంలో అయ్యగారి సమక్షంలో వచ్చిన వినయం, భయం అంతరించి మరలా పొగరు వచ్చింది.

అంతవరకూ ప్రేక్షకురాలివలె నిలచిపోయిన గంగను ఆపాదమస్తకం కనుబొమల విరుపుతో హేళనా పూర్వక మైన నవ్వుతో చూచింది.

"ఊఁ." తల ఎగరేసింది. "అర్థమైంది. అమ్మగారు వూళ్ళోలేరు. నవ్వుమాత్రం యింటనే బైఠాయించావు. నేను అడ్డంగా మోలు! ఎల్తున్నా!"

చేయి, పమిట, అంగాంగం విచిత్రంగా కదుపు కుంటూ బయటకు నడచింది లక్ష్మి.

గంగ కనులలో నీరు నిండింది.

'భగవాన్! ఒక్కో ఆడది ఒక్కోరకం! వీళ్ళ నోళ్ళకు హద్దు పద్దులే వుండవా!"

సీటుగా తయారై వచ్చి ముందుగదిలో ఫోన్ వద్ద కూర్చున్న సతీష్ గంగను పిలిచాడు.

"ఏమిటండి అయ్యగారూ!"

"క్రొత్త వంటమనిషి వచ్చేవరకూ కాస్త వంట చేసి పెట్టు."

"వేరే చెప్పాలా అయ్యగారూ? ఇంటి చాకిరీ ఎంత యినా చేస్తాను. అమ్మగారుమాత్రం వచ్చేస్తే బాగుండును."

"ఇదుగో, అక్కడికే మాట్లాడ్తున్నాను. పిల్లలకు స్కూలుకూడా పోతుంది. నువ్వు వెళ్ళి పనిచూసకో."

వంటయింట్లో పని చేస్తూన్నదన్నమాటే కానీ గంగ చెవులు ఫోన్ వద్దనే వున్నాయి.

"పీపీ కాల్. శరభయ్యగారు......శరభయ్యగారితో మాట్లాడాలి."

లైన్ సరిగా లేదేమో సతీష్ చాలా బిగ్గరగా మాట్లాడ్తున్నాడు.

"ఆఁ...ఆఁ...అల్లుడినే మాట్లాడ్తున్నాను. నమస్కారమండి. మీ అమ్మాయీ, పిల్లలూ క్షేమంగా జేరారు గదా?......"

అటునుంచి శరభయ్య నిష్ఠుర వచనాలేవో వినిపించు తున్నాడు. సమాధానంగా సతీష్ కంఠం మరింత బిగ్గరగా తీవ్రంగా పలుకుతోంది.

"నేనుచేసిన నిర్వాకం,అని మీరు హేళనగా అనేకంటె పెద్దతరహాలో ఆలోచించితే బాగుంటుంది ఎవరి నిర్వాకం ఎలాగుందో గ్రహించినవారైతే, బాధ్యత తెలిసినవారైతే మీ అమ్మాయి అక్కడికి రాగానే మీరు నాకు ట్రంక్ కాల్ చేసి వుండేవారు. ఎప్పుడు ఫోన్ కాల్ వస్తుందోనని తెల్లవార్లూ నిద్రపోలేదు నేను........ఏమంటా రూ? మీ అమ్మాయి మీకు బరువుకాదా? అయితే మీరూ విష యాన్ని అర్థంచేసుకోకుండా చాలా సీరియస్‌గా తీసుకున్నా రన్నమాట! పంతాలవరకూ వస్తే నే నెటువంటివాడినో మీకు తెలుసు! మీ అమ్మాయి మీకు బరువుకానట్లే... ఎక్స్టెన్షన్ ప్లీజ్...ఆఁ మామగారూ బాగా వినండి. మీ అమ్మాయి మీకు బరువుకాకపోతే నా బిడ్డలు నాకూ బరువు కాదు! అయినా ఆఖరిమాటగా చెప్తున్నాను—మీ అమ్మాయికి గల ముక్కుమీది కోపాన్ని, తెలివితక్కువనూ దిద్దవలసిన బాధ్యత మీకున్నది నాకు అనవసర పంతాలు యిష్టం వుండవు. అపర్ణకు ఎప్పుడు రావాలనివుంటే అప్పుడు వచ్చేయవచ్చు. ఆడపిల్ల అడపాతడపా పుట్టింటికి వెళ్ళడం అబ్బురమేమీకాదు! మీ అమ్మాయి కొన్నాళ్ళు పుట్టింట వుండాలని మనసై అక్కడకువచ్చింది. ఇంతే ప్రస్తుతానికి నా మనసునవున్నది. వారంరోజుల తర్వాతకూడా మీ పట్టు దలలు అలాగేవుంటే నేను వచ్చి నా బిడ్డలను నా యింటికి తెచ్చుకుంటాను!"

పెద్దశబ్దంతో ఫోన్ పెట్టేసిన శబ్దం!

ఉస్సురని వెనక్కు వాలాడు సోఫాలో సతీష్.

ఆదివారాలు ఆనందంగా గడపాలనివుంటుంది గీతతో. సాయంత్రాలు షికార్లు తిరగాలనివుంటుంది. లేకున్నా ఎంతో సరదాగా సరాగాలాడుకొంటూ ఆనందంలో తేలిపోయే జంటలు ఎన్నో కన్పిస్తాయి.

కానీ ఈ యింట అన్ని ఐశ్వర్యాలూ వున్నా ఆనందోత్సాహం వుండదెందుకని? అపర్ణ మనస్సు బొత్తిగా అలరింపూ ఆర్ద్రితా ఎరుగని పాషాణమెందుచేత? ఎందుకా అహంకారం ఆ మనిషిలో?

అతడి ఫోన్ సంభాషణ అంతా వినివున్న గంగమనసు అతడి ఓరిమికీ, సహృదయతకూ నీరాజనాలర్పించింది.

ఆమెగారికోసం అయ్యగారి మనస్సెంత తహతహలాడుతోందో, ఆ గుండెలో గుప్తమైన ప్రేమ పరిమాణమెంతో అమ్మగారికి అర్థమైతే ఎంత బాగుండును!

'ఈ చల్లని అండనూ నీడనూ నాకు ప్రసాదించిన అయ్యగారికి సుఖశాంతులు ప్రసాదించు భగవాన్!'

# 17

మధ్యాహ్న నిద్రనుండి చీకాకుగా లేచాడు సతీష్ ఫోన్ శబ్దంతో.

ఎంతసేపు మిన్నకుండినా ఫోన్ అలా మ్రోగుతూనే వున్నది. విసుగ్గా తీసి రిసీవ్ చేసుకున్నాడు.

"హల్లో అపర్ణా! నేను రాజేశ్వరిని, ఏమిటి వారం

..ండి ఎక్కడా నీ ఫోనూ లేదు, దర్శనమూ లేదు?
..పడి ఛస్తున్నాననుకో నేను."

సతీష్ ఏమీ మాట్లాడకుండా, కాళ్ళు పడుతున్న రామును ఫోన్‌లో మాట్లాడమని సౌంజ్ఞ చేశాడు.

ఆ సౌంజ్ఞతోనే రాముకు అర్థమైంది అవతలి వారెవరో.

భయంతో గుండెపై అరచేయి పెట్టుకొని మెల్లగా అన్నాడు.

"వద్దండయ్యగారూ! అమ్మగారి స్నేహితులు అడ్డదిడ్డ ప్రశ్నలేస్తారు, నావల్లకాదు మాటాడ్డం."

సతీష్ చిరునవ్వు నవ్వి తానే తప్పనిసరిగా రాజేశ్వరి మాటలకు జవాబు చెప్పాడు.

"అపర్ణ లేదండీ."

"మరి మీరూ?" రాజేశ్వరి అడుగుతోంది.

"నేను ఆమె పతిదేవుడిని!"

"అరె! చాలా తమాషాగా మాట్లాడ్తారే మీరు!"

రాజేశ్వరి ఫోన్‌లో కన్పించకపోయినా ఆ వగలమారి స్వరం తిరుగుతూన్న మెలికలు వింటే ఆమె హొయలు కనులకు కట్టినట్లే వుంది.

"అపర్ణ ఎక్కడికి వెళ్ళిందండీ?"

"పుట్టింటికి!"

"ఆఁ!" అమితాశ్చర్యం! "మాకు చెప్పలేదేమండీ? ఇప్పుడెందుకు పుట్టింటికి వెళ్ళాల్సివచ్చిందీ?"

"నాకు తెలియదు. పెద్దకారణమేమీ లేదు."

"భలేవారే! ఏమైనా విశేషమా?" అతి మెత్తగా రహస్యంగా మాట్లాడినట్లు మలచింది ఆ గొంతును.

"ఆడవాళ్ళ విషయాలు నాకు తెలియవు." కర్కశంగా కాకున్నా, మృదువుగా మాత్రం లేదు సతీష్ స్వరం. అపర్ణ వచ్చాక ఆవిడా మీరూ మాట్లాడుకోండి, మరిసెలవు," అటు నుండి యింకా వినవస్తూన్న వయ్యారి సవాళ్ళను సగంలోనే త్రుంచివేసి రిసీవర్ యథాస్థానంలో వుంచేశాడు.

"చూశారా అయ్యగారూ!" రాము భయపడుతూ అన్నాడు. "అమ్మబాబో! అన్ని మాటలకు సమాధానాలు నేను చెప్పగలనా?"

"నిజమేలేరా. ఔనూ ఎవరో వచ్చారన్నావు నా కోసం. ఏమి?"

"బయట పోర్టికోలో కూర్చున్నారయ్యగారూ, ఎవరో ఉద్యోగాలు అడిగేందుకేమో?"

"మొగం కడుక్కు వస్తాను పద! కాఫీతే."

"ఇదుగో బాబుగారూ. ఇందాకనే గంగ తయారు చేసేసింది. ఏమాట కామాటే అయ్యగారూ, గంగ భలే చురుకైన అమ్మాయి. ప్రతిదీ-కాఫీ కానీండి భోజనం కానీండి టయముకు ముందే చేసేస్తాది."

"ఊఁ, నిజం!"

"మీరు రాఘవుల్ని తగిలేసి ఎనిమిది రోజులైందా?

అయినా చూడండి గంగ మూలంగా వంటా వార్పూ చక్కగా జరిగిపోతంది."

"క్రిందకు పద వస్తున్నాను."

రాము అతి ధోరణి కట్టించడానికి మాటలు ఆపి, వాష్ బేసిన్ దగ్గరకు పోయి ముఖం కడుక్కున్నాడు.

కానీ అతడి మనసులో గంగ ఆలోచన వున్నది నిజంగా గంగ దగ్గరుండి వడ్డించుతోంటే హాయిగాఉంటోంది. ఆమె ఇల్లు చక్కదిద్దుతూ తిరుగుతూంటే చూడముచ్చటగా నిశ్చింతగా వుంటోంది.

ఇల్లు గుట్టుగా చక్కదిద్దుకోగల నేర్పరి గంగ. ఆమె భర్త సుఖపడతాడు ఆమెవల్ల!

'అపర్ణకు అహంకారమే కాని గంగకు గల ఓర్పు నేర్పులలో వందోవంతుకూడ లేదు.

'అపర్ణ' వెళ్ళిపోయి అప్పుడే ఎనిమిది రోజులయింది? అబ్బా! పిల్లలెలా వున్నారో! ఆ శరభయ్యగారికైనా జ్ఞానం లేదూ కాస్త కనీసం ఫోన్‌లో మాట్లాడాలని? ఛీ.'

క్రిందవేచి వున్న అయిదుగురు వ్యక్తులూ సతీష్‌ను చూడగానే లేచి నిలబడి నమస్కారాలు చేశారు నమ్రతగా

"ఏమిటీ?"

గార్డెన్ ఛైర్‌లో కూర్చుంటూ అడిగాడు.

వారిలో యిద్దరు రెండు మిఠాయి పెట్టెలు తెచ్చి యిచ్చారు సతీష్‌కు. మరొకతడు ఒక మంచి జేబురుమాలు యిచ్చాడు.

"ఏమిటోయ్ యివన్నీ?"

"మీదయవల్ల ఉద్యోగాలు దొరికాయి ఏడాది నాడు. ఇప్పుడవి పర్మనెంటయ్యాయి బాబుగారూ. ఏదో ఉడతా భక్తిగా నోరు తీపి చేయాలనీ......"

"మెకానిక్ ఉద్యోగం యిప్పించటానికి ఒకాయన పదివేలు అడిగాడండి నిరుడు. మరి మీరు ధర్మ ప్రభువులు! వట్టినే యిప్పించేశారు" మరొకతడన్నాడు.

"హుం. ఆ మధ్య మీ వర్కర్స్‌లోనే కొందరు నాపై హత్యాప్రయత్నం చేశారు. మీరిప్పుడు ఆకాశాని కెత్తుతున్నారు."

"ఆళ్ళు తెలివితక్కువోళ్ళు అయ్యగారూ! మంచిని గుర్తించరు. మాకు తెలుసు మీ మంచి!"

"తెచ్చారుగనుక ఒక్కముక్క తీసుకుంటాను. ఇవన్నీ తీసుకెళ్ళి యింటిదగ్గర మీ బిడ్డా పాపా ఎదురుచూస్తుంటారు. వాళ్ళకు పెట్టుకోండి."

ఒక్క మిఠాయి ముక్క తుంపి తీసుకుని అంతా వారికే యిచ్చేశాడు బలవంతంగా.

"రుమాలు అట్టేపెట్టుకుంటానులే, కానీ చూడండి—ఇంకెప్పుడూ యిలా ఏమీ తీసుకురావద్దు. నా చేతిలో అధికారం వున్నది గనుక—మీకు ఉద్యోగార్హతలూ కలవు గనుకా ఉద్యోగాలు వేయించాను. అంతే, మీరంతా సుఖంగావుండడమే కావాలి!"

అందరూ పాలభాగాన చేతులు జోడించి, సెలవు తీసుకున్నారు.

వారినే చూస్తూన్న సతీష్ మరెవరో గేటులోనుండి వస్తూండడం చూచి కలవరపడ్డాడు. ఎవరో స్త్రీలు వస్తున్నారు ఇంటికి. అయినా అపర్ణ లేకపోవడం ఎంత ఘోరంగా వుంది!

వారెవరోకాదు రాజేశ్వరీ! అనిత.

"చచ్చాం! ఎందుకొచ్చినట్టూ? ఇప్పుడేగా మాట్లాడింది!" రాము సతీష్‌కు మాత్రమే వినిపించేట్లు దీర్ఘాలు తీశాడు.

"నమస్కారం"

పలువరసంతా బయటపెట్టి, పమిట స్థానభ్రంశతనంది ముంజేతిపై జీరాడుతూండగా సతీష్ కెదురుగా మరోకుర్చీలో కూర్చున్నది రాజేశ్వరి

అనిత ఇంటిలోనికి డేగచూపులు ప్రసరించుతోంది.

"అబ్బ! అపర్ణ యింత హఠాత్తుగా వెళ్ళడమేమిటండీ?"

హఠాత్తుగాకాదు. అనుకొన్నదే."

దినపత్రిక ముఖాని కడ్డుగా వుంచుకు మాట్లాడుతున్నాడు సతీష్.

"ఊఁ. నేను నమ్మను" పసిపిల్లలా గారాలుపోతూ, మరిన్ని మెలికలుతిరుగుతూ అన్నది.

అతడు మాట్లాడలేదు.

"మీరు 'జోక్' చేస్తున్నారుకదూ?"

సర్రున సతీష్ చేతులలోని పేపరు క్రిందికి దిగింది.

"నేనా.... మీతో హాస్యమా?" భృకుటిముడితో

అడిగాడు, ఆ గాంభీర్యానికి చూపరులకు భయోత్పాతం కలిగితీరుతుంది.

"జోకులూ, నవ్వులూ, దుస్తులూ ఊరక పారవేసుకొనే చపలచిత్తుడిని కాను. వస్తాను.... పనివున్నది."

లేచి తనగదిలోనికి వచ్చేశాడు సతీష్.

రాజేశ్వరీ అనితా ముఖాలు మాడ్చుకున్నారు.

"కాస్త మీ అమ్మగారి అడ్రస్ కావాలని చెప్పరామూ" అర్థింపూ, నిష్ఠూరమూ మిళితమై ధ్వనించాయి.

"రాయించుకోస్తాను, కూర్చోండి."

రాము సతీష్‌చేత వ్రాయించితెచ్చిన అడ్రస్‌కాగితం హాండ్‌బాగ్‌లో వుంచుకొని, రాముకు రెండురూపాయలిచ్చింది రాజేశ్వరి.

"ఎందుకండీ?"

"ఏంలేదూ, ఏమైనా కొనుక్కో — అవునుగానీ ఆ అమ్మాయెవరో వుండేది యింట్లో — ఇంకా వున్నదా?" రహస్యంగా అడిగింది.

"ఆఁ. ఇక్కడే వుంటవండి. ఏం మీకెందుకూ?" పెంకెగా తిరిగి ప్రశ్నించాడు.

"అహాఁ. ఏంలేదూ — అయ్యగారూ అమ్మగారూ బాగా దెబ్బలాడుకున్నారట నిజమేనా?" అతి తగ్గుస్వరంలో అడిగింది.

"లేదండీ."

"ఆఁ. డబ్బాయించకు కావలిస్తే యింకో రూపా యిచ్చుకో, నిజం చెప్పు. ఆ పిల్లగురించే దెబ్బలాడుకున్నా రని శరణాలయం మేనేజరమ్మ చెబుతే నాతో?"

అసహ్యం ప్రకటించాడు రాము.

"ఊరుకోండీ ఎందుకూ సదువుకున్నారు సదువులు! మరోరి యింటి గుట్టు బయటకు లాగితే మీకేమిటొస్తాది? ఎప్పుడూ అమ్మగారి కోపాలూ యిసుర్లూ భరించి కాఫీ, భోజనాలకు కక్కుర్తి పడే ఆవిడ నాకు రెండ్రూపాయ లిచ్చిందేమిటా అని అపుడే అనుకున్నా, చాలు! మీరే వుంచుకోండి యిదిగో. మా అయ్యగారు సల్లగుండాలే కానీ మాకేం లోటు మీరివ్వడానికి!"

నౌకరు చేతకూడ చివాట్లు తిన్న రాజేశ్వరి తప్పని సరిగా లేచి నిష్క్రమించింది స్నేహితురాలితో పాటు!

అయితే ఆమె సంభాషణ నంతనూ పైనుండి సతీష్, వరండా గది కిటికీ నుండి గంగా విని వున్నారని రాముకు తెలియదు.

సతీష్కు విపరీతమైన కోపం వచ్చింది.

కర్తవ్యం బోధపడటం లేదు.

నయానో భయానో అపర్ణను స్వయంగా వెళ్ళితీసుకు రావాలంటే కుదరడంలేదు వర్కర్ల స్ట్రైక్ గొడవులూ,

అటు కోర్టు గొడవలూ, ఎక్కడా కాలు కదిపేందుకు లేకుండా వున్నది.

అపర్ణలేని అదనును సద్వినియోగం చేసుకోవాలని రాజేశ్వరి వచ్చిందనేది అనుమానం ఏ మాత్రం లేని నిజం!

ఛీ!

# 18

యూనియన్ నాయకులతో అధికారులు చేసిన సంప్రదింపులు ఈసారి ఫలించాయి. ఈ బాధ్యతను పూర్తిగా చేపట్టి, స్వయంగా సాధించి సఫలీకృతం చేసిన వ్యక్తి సతీష్.

అందుకే యిటు యాజమాన్యం అటు పనివారూ కూడ సతీష్‌ను సభాముఖానస్తుతించారు.

తన సమాధానంలో సతీష్ అతి ముఖ్య విషయాన్ని వసావించాడు.

"గొడవలూ, భేధాభిప్రాయాలూ వస్తాయి, పర్దుకుంటాయి. పనిసాగుతుంది, అధికారులూ, కార్మికులూ కూడ సంతృప్తిగానే వుంటారు. కానీ కార్మికుల తొందరపాటువల్ల తీరని లోటూ, అశాంతిలకు గురి అయినది ఒక కుటుంబం.

ఉత్తముడూ విశ్వాస పాత్రుడూ అయిన నాగయ్య మన సంఘర్షణలో సమిధగా కాలిపోయాడు. అతడి కోసం రెండు నిముషాలు మౌనం పాటించినంత మాత్రాన, అతడి

పటానికి రెండు పూలమాలలు వేసినంత మాత్రానా ఒరిగే దేమిూ లేదు.

ఆ కుటుంబం పేరుతో మిగిలిపోయిన ఏకాకినినాగయ్యా కుమార్తె గంగాభవానికి యాజమాన్యం వారు ఇల్లూ, భత్యమూ యిచ్చి, ఆమె వివాహాపు ఖర్చును కూడ భరించడం న్యాయమని నేను భావిస్తున్నాను. ఈ ప్రతిపాదనకు ఇక్కడే సభాముఖంగా సమాధాన మిూయడం సమంజసమని యాజమాన్యం వారికి నా విన్నపం!"

ఆమోద పూర్వకంగా అందరూ కరతాళధ్వనులు చేశారు. డైరెక్టర్స్ అప్పటికప్పుడు తమలో తాము తర్జన భర్జనలు సలిపి కడకు నిర్ణయాన్ని ప్రకటించారు—

గంగకు ఒక చిన్న స్వంత గృహం, వివాహమయ్యే వరకు నెలకు రెండువందలు గౌరవభత్యం, వివాహాపు ఖర్చుగా పదివేల రొక్కమూ కేటాయించడం, ఇల్లు సాధ్యమైనంత త్వరలోనే కట్టియివ్వడం గానీ, కొనడంగానీ జరుగుతుంది.

అందరూ సంతోషించారు ఈ ఏర్పాటుకు.

ఇంటికి వచ్చి చెబుతే గంగ నిర్లిప్తంగా విని వూరుకున్నది.

"ఏం, మాట్లాడవేం?" అన్నాడు భోజనం చేస్తూ.

"ఏం, మాటలాడాలండీ?"

"అదే. ఈ ఏర్పాటు నీకు యిష్టంగానే వున్నదా? నా

ఉద్దేశ్యం ప్రకారం చాలా బాగానే వున్నది. నీకు జీవితంలో యిక ఏ లోటూ వుండదు."

"హుం. ఇవన్నీ మానవ ప్రయత్నంగా చేసుకునే ఏర్పాటులండీ. సుఖదుఃఖాలనేవి విధి లిఖితాలు కదండీ?"

భోజనం ఆపి చివుక్కున తలఎత్తి చూచాడు.

గంగవదనం గంభీరంగా భావశూన్యమై కన్పట్టింది.

'ఊఁ. నీ మాటలు నిజం!" అన్నాడు తలపంకించి, ఆ మాటలను తన జీవితానికి అన్వయించుకుంటూ.

అంతలో ఆఫీసు వర్కర్లు యూనియన్ వారు బిలబిలా వచ్చారు.

"ఆగండి. అయ్యగారు భోజనం చేస్తున్నారు." అని రాము వారించినా వినలేదు. ఏ కట్టుబాట్లూ పాటించలేనంత సంతోషంగా ఉన్నారు వారీరోజు.

వారిరాకను చూచి గంగ వంటగదిలోనికి వెళ్ళి పోయింది.

"రండి రండి. ఏమిటీ విశేషం?" అన్నాడు భోజనం ఆపి.

"అహఁ. లేవద్దు అయ్యగారూ, భోజనం చేయండి మీరు." అంటూ చేతులలో పూదండలూ, పూలగుత్తులూ సతీష్ పాదాల మీద వుంచేశారు.

"అరె! ఏమిటిది?"

"మీ చలవవల్ల మాకు మంచి బోనస్‌లు

అందాయి. జీతాలు హెచ్చించారు. ఏదో పట్టుదలగా హర్తాల్ చేస్తున్నాంగాని ఎలా మాడిపోతన్నామో చెప్ప లేము బాబుగారూ! ఓ పూటతిని, రెండ్రోజులు పస్తులుండీ, అప్పులు జేసుకొనీ వెళ్ళదీశాం. ఆ కడుపుబాధతోనే కొందరు మీామీాద దుండగం జరిపారు, నాగయ్యను చంపారు కానీ వేరే కథ ఏమున్నది అయ్యగారూ?"

సతీష్ నవ్వు అంతరించి గంభీరంగా మారిపోయాడు "మన ఈ మాటలవల్ల నాగయ్య రాడుగదా?"

"ఔను బాబుగారూ! కానీ ఏం జేస్తాం? పోయినవాడు పోనేపోయాడు. ఆ కేసుతో పట్టుబడ్డ మనవాళ్ళకు మరీ పెద్ద శిక్షలు పడకండా మీారు కాస్త ఆసుకోవాలి బాబుగారూ"

"అంటే? నేనేమైనా జడ్జీనా?" బొమముడితో తీవ్రంగా అడిగాడు.

"అదికాదండి" నసుగుతూ అన్నాడు యూనియన్ లీడర్. "మీారు కొంచం సాక్ష్యాలు చెప్పేటప్పుడు వాళ్ళని రక్షించేలా చెపితే——"

"హద్దులు మీారి మాట్లాడకు. మంచికే నేను మని షిని!" భోజనం అర్థంతరంలో వుండగానే చేయి కడిగేసుకు లేచాడు సతీష్ కోపంగా.

"ఎవరి ప్రాణాలు వారికి తీపికదూ? ఆ కత్తిపోట్లవలన ఆ రోజు నాగయ్య ఎంత బాధపడి చనిపోయాడో——మరో దిక్కు లేని గంగ ఎంత కుమిలిపోతోందో కూడ ఆలోచించు! మీా విషయంలో ఎంత సానుభూతితో విషయాలన్నీ సమరస

పఱచి న్యాయం చేయించానో, అదే సానుభూతీ సహృద యాలు నాకు అంకిరిపట్ల—నాగయ్య విషయంలోనూ కూడ వున్నాయి. ఇందులో ఎవరూ నాకు ఆత్మీయులుకారు, ఇంకెవరూ పగవారుకాదు."

"అంతేనాండీ?"

"చూడవయ్యా చలపతీ! నువ్వు యూనియన్ లీడర్‌వు. అందరు కార్మికులయెడలా నీ సానుభూతీ,బాధ్యతా సమంగా వుంటాయి. ఔనా?"

"అవునండి." దర్పంగా వచ్చింది జవాబు.

"మరి నాగయ్య ఎవరంటావు? మీలోనివాడేగా? నా ప్రాణాలు తీయలేక అతడి ప్రాణం తీశారు! మానవత్వం అంటే యిదేనా? నాగయ్య నీ కుటుంబంలోని వ్యక్తిఅయితే నువ్విలాగే మాట్లాడుతావా?"

చలపతి తలవాల్చుకున్నాడేకానీ, ఆ వదనంలో పశ్చాత్తాపపు ఛాయలేమీ లేవు.

సాదరంగా చలపతి భుజం తట్టాడు సతీష్.

"సూటిగా మాట్లాడటం, నిష్పక్షపాతవైఖరితో ప్రవ ర్తించడమూ నా కలవాటు. ఇది మీ కందరకూ తెలిసినదే కదా? విషయం తేల్చేది కోర్టువారు. మనచేతులలో ఏమీ లేదు. మనం చేయవలసింది గంగకు సహాయం. ఆమె విషయం ఆలోచించాలి."

"మీరే అంతా ఏర్పాటుచేశారు కదండీ?"

"అది కేవలం తలదాచుకోవడానికీ, తినడానికీ చేసిన

ఏర్పాటు. ఆమె వివాహం సంగతి? మా వర్కర్స్ అందరి విషయాలూ ఎలా ఆనందకరంగా సఫలమైనాయో, అలాగే గంగకు మంచి వివాహంకూడ చేయాలి! అప్పుడే నేను అందరికీ న్యాయంకూర్చిన వాడనౌతాను!"

అందరూ భావయుక్తంగా ముఖముఖాలు చూచుకున్నారు కాని ఎవరినుండీ ఎటువంటి మాటా లేదు.

"గంగ విషయం తెలుసుకదా ? చదువు వున్నది. కంపెనీవారు ఇల్లూ వగైరా ఏర్పాటుచేస్తారు. ఆమెకు తగిన వ్యక్తి...తలిదండ్రులు లేని ఆ అమ్మాయిని ఆదరంగా చూచుకొనే వ్యక్తి ఎవరైనా మీలో వుంటే ముందుకు రండి."

"

సతీష్ మరలా అన్నాడు.

"ఎవరైనావుంటే వాకబుచేసి చెప్పండి. వెళ్ళిరండి."

అందరూ నిష్క్రమించాక గంగ ఈవలికి వచ్చింది.

మేడమీదికి వెళ్ళిపోతూన్న సతీష్ ఆమె పిలుపు విని ఆగాడు.

"అయ్యగారూ! మీరు భోజనం సరిగా చేయలేదు. వాళ్ళు చెయ్యనివ్వలేదు."

"ఫర్వాలేదు. చాలు."

"కాదండి. మీరసలు ఈమధ్య సరిగా భోజనం చేయడంలేదు. కూర్చోండి."

'హుం. ఈమె ఎవరని తనపై ఇంత ఆదరణ? ఇంత ఆప్యాయత?'

"కూర్చోండి అయ్యగారూ !" అర్థింపుగా అంటూ తలెత్తిన గంగ అతడు తనవైపే చూస్తూండడం గమనించి చటుక్కున కళ్ళువాల్చింది

మరొక ప్లేటు వుంచి ఆమె వడ్డించుతూంటే, ఆమె తృప్తి కోసం అతడు కూర్చోకతప్పలేదు

"ఒక విషయం అడుగుతాను చెప్పు గంగా"

"ఏమిటి అయ్యగారూ?"

"నీకు నచ్చిన వరుడు ఎవరైనా వున్నారా?"

తెల్లబోయి చూచింది గంగ.

"చూడు గంగా. అడగడానికింకెవరూ లేరు. అంతా నేనే సంబాళించుకోవాలనేది నీకు తెలుసు. సిగ్గుపడకూడదు యిటువంటి విషయాలలో, నీకు యిదివరకే నిశ్చయమైన వరుడెవరయినా వున్నా లేదా నీకు యిష్టులైన వారెవరైనా వున్నా నిస్సంకోచంగా నాకు చెప్పు, పెండ్లిప్రయత్నాలు చేస్తాను."

'ఎవరూ లే' రనే భావం స్ఫురించేట్లు తల అడ్డంగా త్రిప్పింది గంగ.

"అయితే, నీకు నేను వివాహప్రయత్నాలు చేయడం అంగీకారమే కదా?"

గంగ మౌనంగా తల వాల్చుకు నిలచి వున్నది. ఆమెలో ఏమి భావాలున్నవో తెలియదు.

"మీ నాన్న పోయిన బాధ నుండి నువ్వు యింకా తేరుకోలేదు. నాకు తెలుసు కానీ ఏం చేస్తాం? మిగిలిన

వాళ్ళు బ్రతకవలసిందేగా? నీకు స్వంత యిల్లూ, స్వేచ్ఛా, సుఖమూ వుండాలి. నేను అలా చేయగలిగినప్పుడే నాకు తృప్తి. నువ్వు మనస్ఫూర్తిగా 'ఊఁ' అంటేనే కాని నేను ఎవరితోనూ సంప్రదించలేను."

గంగ మెల్లగా తలెత్తింది.

"అంతా మీ యిష్టం అయ్యగారూ. మీకు అన్నీ తెలుసు."

"చూడూ ఎవరో ఒకరిని చూస్తాననుకోకు. మంచి వరుడు, నీకు అంగీకారమైన వ్యక్తినే ఎంచుతాను. నీకు ఈ బానిసఖానా బ్రతుకునుండి విముక్తి లభించే వరకూ నాకూ శాంతి లేదు.

అతడి మంచితనానికి ఆర్ద్రమైన మనసుతో, ముకుళిత నేత్రాలతో మనసులోనే జోహారు అర్పించింది గంగ.

"అన్నట్టు......అయ్యగారూ......"

సగం మెట్లెక్కిన సతీష్ ఆగాడు.

"అమ్మగారి స్నేహితురాలు-రాజేశ్వరిగారు వస్తానని చెప్పమన్నారు మీతో."

"ఆఁ!"

నిలువునా నీరైపోయాడు సతీష్.

"ఇప్పుడా? ఈ రాత్రి తొమ్మిది గంటల సమయం లోనా ఆవిడ వచ్చేదని?"

"అప్పటండి, మధ్యాహ్నం ఒకసారి వచ్చారు మీరు మీటింగులో వున్నారని చెప్పాను మరలా సాయంత్రం రెండు

స్తార్లు ఫోన్ చేశారు ఇక్కడికి దగ్గరలోనే ఏదో ఆ-అంబికా థియేటర్‌లో పిక్చర్‌కు వచ్చారట. మిమ్మల్ని అక్కడకు రమ్మన్నారు."

"నాన్సెన్స్! నువ్వు సరిగా విన్నావా?"

అతడి కోపం చూచి బిత్తరపోయిన గంగకు మాట రాలేదు.

డైనింగ్ టేబుల్ క్లీన్ చేస్తూన్న రాము చెప్పాడు.

"ఔను అయ్యగారూ! ఒకసారి ఫోన్ నేనే అందుకున్నాను. ఆమెగారు అలాగే చెప్పారు."

సతీష్ వదనం అతి కఠినంగా మారిపోయింది.

"ఇటువంటి చెత్త ఫోనులూ, చెత్తకబుర్లూ ఎప్పుడూ నావరకూ రానీయకండి. ఆమెవస్తే గేటుదాటి లోనికి రానీయవద్దని ఘూర్ఖాతో చెప్పు."

"హిహిహి వచ్చేశాను నేనే! ఏం చేయనూ?"

సెంటు గుబాళింపుతో, వెకిలినవ్వుతో లోనికి అడుగు పెట్టి, ఎవరి అనుమతీలేకనే ఒక సోఫాలో కూర్చున్న రాజేశ్వరిని చూచి గంగ, రామూ వణకిపోసాగారు.

"అలా చూస్తావేం? మా అపర్ణవుంటే ఎన్ని మర్యాదలు చేసేది? అబ్బబ్బబ్బ! ఓ కూల్ డ్రింక్ యిలా పారేయ్!" అన్నది గంగను చూస్తూ, సుతారంగా రుమాలుతో నుదురు ఒత్తుకుంటూ.

కాసే భయంతో గంగపాదాలు భూమికి అతుక్కుపోయి కదలడం లేదు.

కాలుపై కాలు వేసుకుని, సోఫాపై వెనక్కు చేతులు వాల్చి ఆ చేతులపై తలను వాల్చి కూర్చున్న రాజేశ్వరికి తననే తీక్ష్ణంగా చూస్తూన్న సతీష్ కన్పట్టాడు.

"ఓ!! మీరు యిక్కడే వున్నారా? సంతోషం" అన్నదేకానీ తన వికృత భంగిమను మాత్రం మార్చలేదు. 'చూచేవాళ్ళ ఖర్మం నాకేం!' అనేటంత నిర్లక్ష్య ధోరణిలో వున్నది తీరు.

"ఏమిటీ పని ఈ సమయంలో?"

సతీష్ కర్కశస్వరం విని గంగ, రాము ఊపిరిపీల్చడం కూడ మరచారు కానీ రాజేశ్వరి లెక్ఖచేయలేదు.

"ఒకటేమిటండీ, చాలా పనులున్నాయి. పోన్లెండి. ఈ సమయమే బాగున్నది అన్నీ తీరికగా మాట్లాడడానికి."

అంటూ రాజేశ్వరి లేచి అతడున్న మేడమెట్ల దెస దారితీయగానే ప్రమాదాన్ని శంకించిన సతీష్ గబగబా మేడమెట్లన్నీ ఒక్కఅంగలో దూకినట్లే దిగివచ్చి హాలులో మధ్యతివాచీపై నిలబడ్డాడు.

"నేను చాలా పనులతో అలసివున్నాను. మరోసారి వచ్చి మాట్లాడండి. ప్రస్తుతానికి వెళ్ళిరండి"

ఒకవంక గంగకు ముచ్చెమటలు పోస్తున్నాయి.

సతీష్ కంఠంలోని కటుత్వమూ, కనులలోని వెగటూ గమనించి.

అతడి అప్పటితీరుకూ మాటలకూ అభిమానమున్న

అసలైన ఆడదైతే అక్కడికక్కడే తల పగుల గొట్టుకు చచ్చి వుండేది.

కాని రాజేశ్వరి అనేక ఢక్కా మొక్కీలు తిని వున్నది. కార్య సాధనకు ఎంతకైనా తెగించగల ఆడది!

ఉస్సురంటూ మరలా సోఫాలో కూలబడింది

"అంత తేలికగా వెళ్ళడానికా వచ్చాను? పోనీ ఓపని చేయండి. కాస్త నన్ను మీ కారులో ఇంటి దగ్గర దింపండి. ఇప్పుడు బస్సులకోసం నిలబడే ఓపిక లేదు. నింపాదిగా కారులోనే మాట్లాడుకో వచ్చు!"

'మైగాడ్! ఇదీ ఒక ఆడదేనా?' అన్నట్లున్నాయి సతీష్ వాత్స్యాయన్ చూస్తూన్న చూపులు.

"మీ పేరు వూళ్ళో-పత్రికలలో మ్రోగిపోతోంది. వర్కర్స్ గొడవ చక్కగా సెటిల్ చేశారని. కాస్త మా వారికి మీ దగ్గర ఉద్యోగం వేయించండీ, ముఖ్యంగా యిది అడిగేందుకే వచ్చాను!"

"చూద్దాం లెండి. రేపు ఆయనను ఆఫీసుకు రమ్మనండి."

"చూద్దాం అంటే కాదు...'తప్పక ఇస్తాను' అనండి" అందుకు మీకేం కావాలన్నా నేనివ్వగలను!"

"మీరా? నాకిస్తారా?" ముఖం చిట్లించి అడిగాడు.

"అఫ్‌కోర్స్! డబ్బు కూ పేణా యివ్వలేమనుకోండి. ప్రేమాభిమానాలు పెన్నిధిగా భావించే వాళ్ళం- అవి తరగనంత యిచ్చుకోగలం!"

"ఒర చూపులతో పైటా, కుచ్చెళ్ళూ సర్దుకుంది.

మరి ఓరిమి వహించలేని సతీష్ "రామూ వీరి వెంట వెళ్ళి బస్‌స్టాండ్‌లో దిగ విడిచిరా." అని చరచరా మేడ మెట్లెక్కి వెళ్ళిపోయాడు.

సతీష్ కను మరుగు కావడంతో రాజేశ్వరి వగలూ, హొయలూ అంతరించి గంగను ఆపాదమస్తకం తినివేసేట్టు తీక్ష్ణంగా చూచింది.

"ఏ ? భలే ఛాన్సు" తలెగరేస్తూ అన్నది! "అపర్ణ కూడా లేదు. నీదే రాజ్యం. కోర్టు వ్యవహారాలవంకన ఆయనతో కార్లో తిరుగుడూ, ప్రక్కనే నిలబడి వడ్డనా... ఇక రాత్రంతా మరో విందు వడ్డనా వెళ్ళు పైకి."

అక్కసుగా అనేసి, "నువ్వేం అక్కరలేదు బస్‌స్టాండుకు దారి నాకు తెలుసు" అని రామును విదిలించి కొట్టి నిష్క్రమించింది రాజేశ్వరి.

గంగ దుఃఖం వర్ణనాతీతం.

"ఎందుకు-ఏం పాపం, నేరం చేశానని ఈ జనం ఇలా కాకుల్లా పొడుస్తున్నారు రామూ నన్ను?" అంటూ వాపోయింది.

రాము జాలిగా చూచాడు.

"ఊరుకో చెల్లెమ్మా అమ్మగారు లేరని తెలిసీ అంత విరగబాటుగా వచ్చి అయ్యగార్ని బోల్తా కొట్టించాలని చూచిన అది ఒక ఆడదైతేగా—దాని మాట నీకేం లెఖ? నిప్పువి నువ్వు!"

"యేమో నా రోజులెలా గడపాలో తెలియడంలేదు నిత్యం ఎగిరే ఈ నిప్పు రవ్వల నడుమ."

"ఊర్కో— మన్నానా? అయ్యగారసలే కోపదారి మనిసి, ఊరుకో. ఫోఁచేసిపడుకో ఎల్లి. కష్టపురోజులు కల కాలం వుండిపోతాయా?"

# 19

చదివీ చదివీ–ఎన్ని–ఎన్ని పుస్తకాలని చదవడం? ఎంత కని పుస్తకాలతో రోజులు గడపడం?

నిదురకు దూరమైన సతీష్ తీవ్రంగా ఆలోచించుతు న్నాడు. ఎలా అపర్ణను దారికి తేవడం?

'ఈ ఎడబాటు ఆమెలో తప్పకుండా తహతహను కలి గించి వుండవచ్చు. నేను పిలుస్తే రావాలనే బింకంతో వుండి లోలోపల బాధ పడుతోందేమో? పోనీ–సంసారం మన్నాక ఏవో వస్తుంటాయి ఎందుకు పట్టుదలలు?'

ఈ ఆలోచన రాగానే వెంటనే ట్రంక్ కాల్ బుక్ చేశాడు.

'ఏమంటుంది అపర్ణ? ఎలా మాట్లాడు తుంది?' ఊహించుకుంటూ గదిలో అటుయిటు పచార్లు ప్రారంభి చాడు.

అరగంటలోనే కాల్ అందింది.

"పిపీ లేరండీ." అనే సమాధానం వచ్చింది ఎక్ఛ్సేంజి వారినుండి.

"సరే. పెండింగులో వుంచండి."

"ఏ సినిమాకో వెళ్ళిందేమో? అర్ధరాత్రి అయితే దొరుకుతుంది. హాయిగా మాట్లాడుకోవచ్చు!

తన ఊహకు తానే నవ్వుకున్నాడు

హత్యలవరకూ పోయిన వర్కర్స్ గొడవను తన ప్రతిభతో ఒక దారికి తేగలగడంతో అతడికి అమిత సంతోషము, ఉత్సాహం కలిగాయి. "ఏ గొడవకయినా పరిష్కారము చేయగలగనే అపూర్వ ఆత్మ స్థయిర్యం ఏర్పడింది. అందుకే ఆ ఉత్సాహంలోనే పట్టుదలనూ అపర్ణపై కోపాన్నీ వదలి ఆమెను క్షమించేసి తానే ట్రంక్ కాల్ బుక్ చేశాడు.

మరొక సారి ప్రయత్నించమని మరలా ఆపరేటర్‌ను కోరాడు సతీష్.

ఇప్పుడూ అదే సమాధానం.

"సరే కనెక్షన్ యివ్వండి. నంబర్ కాల్."

అపర్ణ అన్న రామారావు అందుకున్నాడు ఫోన్.

"బావగారూ, అపర్ణ ఎవరో స్నేహితులతో పిక్నిక్ వెళ్ళింది నిన్న, రేపటికిగానీ రాదు"

"వచ్చేక మాట్లాడమనండి పిల్లలు?"

"స్కూలుకు వెళ్తున్నారు. లేపమంటారా? మంచి నిద్రలో వున్నారు."

సతీష్ వింటూనే అదరి పడ్డాడు.

"వద్దులెండి. రేపు మాట్లాడతాను అయితే అక్కడ స్కూల్లో జేర్చారా పిల్లలని?"

"ఔనండీ"

"ఎందుకు? ఎవరుచేసిన ఏర్పాటు అది?"

రామారావు తడబాటు జెందినట్లు మౌనంగా వుండి పోయాడు.

"మిమ్మల్నే బావగారూ, పిల్లల్ని అక్కడెందుకు స్కూల్లో వేశారు?"

"బావగారూ! నేనేం చెప్పగలను? అంతా అపర్ణకూ నాన్నగారికే తెలుసు నాకు తెలిసినదల్లా— మీరు అపర్ణను చాలా ఘోరంగా అవమానించారనీ, నిర్లక్ష్యం చేశారనీ!"

"ఊఁ. అయితే మీ చెల్లాయి స్వభావం తెలిసికూడ మీరు అలాగే అనుకుంటున్నారా?"

"అబ్బెబ్బె, లేద డి. నాన్నగారుకూడ......"

"హుఁ. మీకు నేనింక ఏం చెప్పాలి? మీ మనుష్యుల స్వభావాలు మీకు తెలుసు. అపర్ణకు సహనమెంతో, సంసార బాధ్యత ఎంతో మీకు తెలుసు. అయినా సహించాను, సహించుతున్నాను, అపర్ణను నిర్లక్ష్యం చేసినవాడనైతే ఇప్పుడీ ఫోన్ ఎందుకు చేస్తాను?"

"ఇవన్నీ నేనూ అనుకుంటూనేవున్నాను బావగారూ! అపర్ణ చాలా తెలివితక్కువది. నాకుతెలుసు. నేనే మీ దగ్గరకు రావాలనుకున్నాను ఒకసారి. కానీ మీరెలా స్వీకరిస్తారో తెలియక......"

"ఏం మాటలు బావగారూ ? తప్పకుండా రండి. అపర్ణనూ పిల్లలనూ తీసుకువచ్చేయండి మీతో. అపర్ణ ఎప్పుడువస్తానంటే అప్పుడు వచ్చి తీసుకొద్దామనే నేనసలు ఫోన్ చేసింది యిప్పుడు. మీకు తెలుసు. ఉద్యోగంలో నాకు ఎక్కువగా కదలే అవకాశాలుండవు."

"ఓ! రండి బావగారూ! చాలా థాంక్స్. రేపే రండి మీరు ఎదుట నిలబడితే అపర్ణ ఆగగలదా? నేను రావడం కంటె మీరు రావడమే మేలు! ప్లీజ్ బావగారూ!"

"సరే, రేపే బయలుదేరుతున్నాను ఉదయం."

మనస్సు తేలికపడిన సతీష్ శయ్యనుజేరి ఊహాలలో మునిగిపోయాడు.

'ఔను. ఇన్నాళ్ళ ఎడబాటు తర్వాత అపర్ణ నా కోసం తహతహలాడిపోతుంటుంది. తప్పక మారివుంటుంది.'

మిగిలినరాత్రి నిశ్చింతగా నిదురించిన సతీష్ తూర్పు తెల్లవారకముందే లేచి తయారై క్రిందికి వెళ్ళాడు.

'గంగా!'

నోటివరకూ వచ్చిన పిలుపు ఆగిపోయింది.

ఇంకా లేచిందో లేదో—పోనీ కాఫీ బయట త్రాగ వచ్చు, కానీ మరీ చెప్పకుండా వెళ్ళడం బాగుండదు.

అటుచూస్తే గంగ గదిలో లైటు వెలుగుతూండడం గమనించి అటునడిచిన సతీష్ పాదాలు గుమ్మం బయటనే ఆగిపోయాయి.

చిన్న బల్లపై సీతారాముల కళ్యాణచిత్రం వున్నది. ఆ పటానికి పూజ జరిగినట్లు తాజాపూలు అందంగా అలంక రించి కన్పట్టాయి. చిన్న జ్యోతి వెలుగుతోంది ప్రక్కన.

గంగ కనులుమూసుకుని, చేతులు జోడించి నిశ్చలంగా కూర్చునివున్నది. ఆమె పెదవులు మెల్లగా ఏమో ఉచ్ఛ రిస్తున్నాయి.

"......అయ్యగారి సంసారం బాగుజెయ్యి తండ్రీ, ఆయన మంచిమనస్సుకు బాధ కలగకూడదు. అయ్యగారు నాకు వివాహం చేస్తారట. ఆ వచ్చే వ్యక్తి ఎంత బీదవాడ యినా కురూపిఅయినా ఫర్వాలేదు. అయ్యగారిలా దైవత్వం మాత్రం కలిగివుండాలి......"

సతీష్ వదనంలో అనేక భావవీచికలు త్వరత్వరగా

కదలిపోయాయి. సవ్వడిసేయకుండా వెనుదిరిగి వచ్చి, డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చున్నాడు.

నిర్మలంగా ప్రశాంతంగా వున్న ఆ సమయం-గంగ ప్రార్థన, ఆమెపూజ-సతీష్ అంతరంగాన్ని అమితమైన ఆహ్లాదతతో నింపింది. ఈ యింట పూజ జరుగుతూండగా చూడడం యిదే మొదటిసారి. ఎక్కడో సామాన్లగదిలో పడివున్న పాతపటాన్ని తీసి తెచ్చింది గంగ.

ఈనాడు ఈ యింటవున్న కళ కాంతులు ఇంతకు పూర్వం తానేనాడూ చూచినట్లులేదు. పదిగంటలకేగాని పడకగదిని వీడని అపర్ణ గృహిణీత్వంలోని లోపాలు నేడతడికి స్పష్టంగా తెలిసివచ్చాయి. ఏదో హోటలులోతిని పడున్నట్లే వుంటుందిగానీ స్వంత యిల్లూ, భార్యాకలిగించే ఆనందాలూ అందించే ఆప్యాయతలూ ఏనాడూ అనుభవం కాలేదు. హక్కులూ, అతిశయాలూ మాత్రమే ప్రదర్శించే అపర్ణ నుండి తాను ఏనాడూ ఆదరణను రుచి చూడలేదు. గృహిణిగా ఇంటిని చక్కదిద్దుకొనే బాధ్యత ఆమెలో కన్పించిన క్షణాలుకూడా లేవు.

'ఇల్లాలు అంటే గంగలా వుండాలి!'

తన ఆలోచన తననే అదరింప జేయగా కూర్చున్న తావునుండి లేచి మనసును అదలించుతూ బయటకు నడిచాడు.

అవుట్‌హౌస్‌లో నిద్రపోతూన్న రామును లేపి చెప్పాడు.

"నేను అమ్మగార్ని తీసుకు వచ్చేందుకు వెళుతున్నాను."

రాము ముఖం వికసించింది.

"నువ్వు గంగకు సాయంగా వుండు. మేము రాత్రికో రేపు ఉదయానికో వస్తాం."

"మరి డ్రైవరు......"

"నేనే చేసుకుంటానులే. లేదా ఆఫీస్‌నుంచి ఎవర్నో తీసుకువెళ్తాను తర్వాత చెప్పు గంగకు. వంట గురించిన హైరానా ఏమీవద్దని చెప్పు. మేంవచ్చాక చేయువచ్చు."

"అలాగేనండి."

కారు దూసుకుపోయింది.

రాము వెనుదిరిగేసరికి ఖిన్నవదనంతో గంగ నిలబడి వున్నది, చేతిలో కాఫీకప్పుతో.

"పొరపాటైపోయింది రామూ! కొంచం ఆలస్యమైంది రోజుటికంటె నాపని. అయ్యగారికి కోపం వచ్చినట్లుంది... కాఫీ తీసుకోకుండానే వెళ్ళిపోయారు."

ఇక కంటెనీరే తరువాయి అన్నట్లున్నది గంగ ధోరణి. రాము పడి పడి నవ్వాడు.

"కోపంవస్తే అయ్యగారు దాచుకోరు పైకే చెప్తారు. ఓ కప్పు కాఫీ ఆయన ఎక్కడైనా తాగుతారులే. అమ్మ గార్ని తీసుకొచ్చేందు కెళ్ళేరు. ఆ సంతోషంలోనే ఆయనకి కాఫీకూడ గాపకం రాలేదు."

"ఏమిటీ? గంగ కనులలో ఆశ్చర్యమూ, భయమూ కూడ వున్నాయి.

ఇక అమ్మగారు వచ్చి మళ్ళా నన్ను నిత్యం చెండుకు తింటారు కాబోలు!......ఛ. ఆమెగారు తను యింటికి తాము వస్తున్నారు పోవలసిన దానను నేను: అమ్మగారు

రాగానే అయ్యగార్ని అమ్మగార్నీ క్షమాపణ అడిగేసి వెళ్ళి పోవాలి అనాథాశ్రమానికి, ఇంతవరకూ వుండడమే చాలా పొరపాటు!'

ఇటు సతీష్‌కూడ అనేక ఆలోచలనలో మునిగి ఉన్నాడు.

అపర్ణ రాగానే గంగకు త్వరగా స్వంతఇల్లు ఏర్పాటు చేయాలి. అపర్ణ చేసే హానికి అదే పరిష్కారం.

వీధి మలుపులో కారును ఆపి అక్కడి కిళ్ళీ కొట్టు దుకాణదారుడిని "రెండు సిగరెట్టు పెట్టె లివ్వావోయ్" అన్నాడు.

అతడు అప్పుడప్పుడే కొట్టు తెరుస్తున్నాడు. వెలుగు వస్తోన్న వేకువవేళ కావటానికి అమ్మకానికి, సిద్ధంగా లేక కొంత ఆలస్యమే అయ్యింది.

పరధ్యానంగా కూర్చున్న సతీష్ వెనుకనుండి పరిచిత మైన కంఠం వినవస్తూండడంచూచి వెనక్కుతిరిగి చూచాడు.

కిళ్ళీ కొట్టుకు కొంచం అటుగా నిలబడిన నలుగురైదు గురు పాటకస్త్రీలలో లక్ష్మి కన్పించగా ఆరాగా చూచాడు.

"ఆఁ! ఉన్నోలకేటి—ఏ బాగోతమైనా, సెల్లుతాది. మన గుడిసెలలో అదే జరిగితే 'అయినీతి' అన్జెప్పి పోలీసో డొచ్చి పట్టుకపోతాడు. అదే పెద్ద మేడల్లో అయితే ఎవ్వ డికీ అక్కరలేదు. నెల్లాళ్ళపైనే అయినాది. పెళ్ళాన్ని తగి లేసి ఆ గంగని యింట్లో పెట్టుకు కులుకుతున్నాడు ...... సీ......థూ......"

సతీష్ గమనించుతూన్న విషయం తెలిసికూడ తెలియ

నక్షీ భారలు జాపుతూ విడ్డూరంగా విన్పిస్తోంది లక్ష్మి. ఆ ఆడవాళ్ళు కుతూహలంగా విని ఏమేమో అంటున్నారు.

"గొప్పోళ్ల గొడ్రాళ్ళే అంతలే."

"ఆ ఈశ్వరుడే భార్యను గాకుని గంగని నెత్తికెక్కించు కోలేదంటే? ఇయ్యాల ఇదేవన్నా కొత్తా?"

సిగరెట్స్ తీసుకోకనే కారును వేగంగా బయలుదేర దీశాడు సతీష్.

అతడికి మనసంతా చేదుగా, ఒడలంతా కంపరంగా వున్నది. పనిమనిషి తీసివేసినందుకే లక్ష్మి అలా నోటికొచ్చి నట్లు ప్రేలుతోన్నదా లేక లోకులంతా అలాగే అనుకుంటు న్నారా?

"మొగాడ్!"

మనస్సరీరాలు లజ్జాభారంతో కుచించుకు పోయాయి. ఈ అపవాదు తనకంటె గంగకు అతి ప్రమాదకరం కాదూ?

వెళ్తాన్నది అత్తవారి ఊరు గనుక రెండు రోజులు వుండవలసి రావచ్చు వారు బలవంతం చేస్తే అర్జంటు ఫైల్స్ పర్గైరా సంతకాలు పెట్టి, సెలవు వ్రాసిపెట్టి వెళ్ళాలనిభావిం చిన సతీష్ ఆ పనులు చూచుకుంటూ కూర్చున్న అతడి చెంతకు ఓ గంట అనంతరం కొందరు మెకానిక్కు వచ్చారు.

"ఏమిటి? ఓవర్ టైము చేస్తున్నారా అప్పుడే వచ్చారు?" అనడిగాడు సతీష్.

"ఔను బాబుగారూ, ఇంతకాలం కాళీగా కూర్చున్న నష్టం అంతా పూరించాలిగదా?"

"ఎవరి నష్టం? మీదా? కంపెనీదా? ఎవరిది పూరించు తారు?"

ఆ నూటి ప్రశ్నకు తట్టుకోలేనట్లు తలలు వాల్చుకు న్నారు.

అర్థయుక్తంగా నవ్వాడు సతీష్.

స్ట్రైకు పీరియడ్‌లో వచ్చిన నష్టం కోట్లలో వున్నది. లక్షలయినా కాదు. అదంతా భర్తీ చేయడం ఎవరి వలనా కాదు. అందుకే అన్నారు. కాలం అమూల్యమైనదని, ఎటొచ్చి—మీరిప్పుడు చేసే ఓవర్ టైములు మీ కేమంచి వని మీకూ తెలుసు, నాకూ తెలుసు, వాటికి కొత్తమెరుగు లేమీ వద్దు. మీ కోసమే మీరు ఓవర్ టైం చేస్తున్నారు!"

"మీకు అన్నీ తెలుసండి" చిన్న బుచ్చుకున్న ముఖంతో అన్నాడొకతడు.

అది గమనించిన సతీష్‌కు జాలి కలిగింది.

"సరే కానీయండి, కానీ ఆ వంకన అనవసరంగా మాత్రం డబ్బు తీసుకోవద్దు. నిజంగా పని వున్నదో లేదో- సూపర్‌వైజర్‌తో మాట్లాడుతాను నేను."

"పని వున్నదండి. కానీ సూపర్‌వైజర్ గారి వరకూ అది వెళ్ళే దెక్కడ? ఫోర్‌మన్ నర్సింహం అడ్డుపడిపోతున్నా డండి."

"అంటే?"

"అంటే——నర్సింహం తన కిష్టమైన వాళ్ళకే ఓవర్ టైం అవకాశాలిచ్చి, మమ్మల్ని వద్దంటున్నాడండి."

"ఫోర్‌మన్ యూనియన్‌లో వాడేనా?"

"ఇప్పుడు మా యూనియన్ రెండుగా చీలిందండి."

సతీష్ వదనం కఠినంగా మారిపోయింది.

"మీలో మీకు మరలా యిన్ని వ్యత్యాసాలా?"

అందరూ మౌనంగా తలలు వాల్చుకున్నారు.

"సరే మీ రాజకీయాలతో నాకు పని లేదు. ఇక్క డంతా ఒకటే. నేను వర్క్ సూపర్వైజర్తో మాట్లాడ తాను రేపు."

"మీరలా చేస్తే చాలా కృతజ్ఞులమండీ" విప్పారిన ముఖాలతో అందరూ ఒకేసారి అన్నారు.

'సరే, వెళ్ళండి......అన్నట్లు చలం-నేను చెప్పిన విషయం ఏమైనా ఆలోచించావా?"

చలంతో పాటు అయిదారుగురు వ్యక్తులున్నారు. మిగతా అందరూ నిష్క్రమించారు.

"ఏదండీ?" చలం అర్థం కానట్లు చూచాడు.

"నాగయ్య కుమార్తె విషయం. వరుడెవరైనా వున్నా రేమో వాకబు చేస్తున్నావా?"

చలం, తది తరుల ముఖాలలో రంగులు మారాయి.

"తీరికేదండీ? XOX అదృష్టవంతురాలు గనుక మీ అండదొరికింది. ఆ జైలులో మ్రగ్గుతూన్న వాళ్ళ గురించి తిరగడమే సరిపోతోంది మాకు, అటు ప్లీడర్లకీ డబ్బు పొయ్యాలి ఇటు జైలర్ రి డబ్బు సమర్పించుకోవలసివస్తోంది"

వ్యవహారాలు ఒకదానికొకటి ముడిపడుతున్నాయని గ్రహించిన సతీష్ గంభీరంగా మారిపోయి మౌనందాల్చి తన కాగితాలు చూచుకోసాగాడు.

"నేను చెప్పినది ఆలోచించారా సార్?"

"ఏమిటది?" కాగితాలలో నుండి తలెత్తనే అడిగాడు.

"అదే......కోర్టులో సాక్ష్యం విషయం......"

అధాటున తలఎత్తి తీవ్రంగా చూచాడు సతీష్.

ఆ చూపులోనే అతడి నిరసన వైఖరిని గమనించిన చలం "సరే వెళ్తున్నానండీ" అని ఓ నమస్కారం విసరి తక్కినవారితోపాటు గుమ్మంవరకూ నడచి, మరలా వెనక్కు వచ్చాడు.

"గంగను——చేసుకొనే తలకుమా సిన వాడెవ్వడూ లేడండి" నిర్లక్ష్యంగా నిఃబడి అన్నాడు.

సతీష్ చూపులు ఆలనాటి దక్షయజ్ఞ నాశకుడైన సతీశ్వరుని చూపులవలెనే వున్నాయి.

"ఏమిటి వాగుతున్నావ్?"

"మాలాటివాళ్ళ మాటలు మీ ధనవంతులకు వాగుడుక్రిందే లెఖ్ఖ. కానీ అవి పచ్చినిజాలు! ఇన్నాళ్ళు మీ దగ్గర ఒంటరిగా వున్నది గంగ. దానికోసం మీరు భార్యని కూడ తరిమేశారు......"

"చలం!"

"ఎప్పుడు కోర్టు వాయిదావున్నా అది మీ కారులో మీ వెంటే వస్తోంది. అందరూ కళ్ళారా చూస్తున్నారు. ఈనాడు మీ మోజుతీరి, దాన్ని ఎవడికో అంటగట్టాలంటే—బహుశః ఎంత సన్నాసిఎదవైనా కట్టుకోడు. మీరే దాన్ని అలా అట్టేపెట్టేసుకోండి."

సతీష్ షాక్‌నుండి తేరుకొనేసరికి అక్కడ ఎవరూ లేరు.

# 20

"ఓ! అల్లుడుగారా? రండి రండి. అబ్బాయి చెప్పేడు" శరభయ్య కంఠంలో హేళనా, నాలుకపై ఆహ్వానమూ పలికాయి.

సతీష్ తొణకలేదు.

"రండి బావగారూ! ఎంతయినా కృతజ్ఞుడిని" రామారావు ఆప్యాయంగా కరచాలనం చేశాడు.

"పిల్లలేరీ?" నలువైపులా కలియజూస్తూ అడిగాడు సతీష్.

రామారావు తల వంచుకున్నాడు.

"ఉదయం ఏడయ్యేసరికే కాన్వెంటుకు వెళ్ళి పోతారు" శరభయ్య సమాధానంలో పెంకెతనం వున్నది.

"తెలుసు కానీ నేను వస్తానని తెలిసీ ఎందుకు పంపారు?"

"యేమో? అమ్మాయి ఏమంటుందోననీ——"

సతీష్ సహనం సరిహద్దులు దాటేందుకు యింతకంటె అవసరం లేదు.

"నాబిడ్డలను నేను చూచుకోవడానికి మీ అమ్మాయి అనుమతి కావాలా?" తీవ్రంగా అడిగాడు.

"మరి తేడాలంటూ వచ్చాక అంతేగా అల్లుడు గారూ?" బేఫర్వాగా అనేసి చుట్ట వెలిగించాడు.

"అయితే ఆ తేడాలను మీరు పెంచి పోషించాలను కుంటున్నారన్నమాట?"

"అమ్మాయి వచ్చాకగదా తేలేది!" అదే నిర్లక్ష్యం శరభయ్యలో.

సోఫాలోనుండి ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు సతీష్.

"పెద్దవాళ్ళు పరిస్థితులను చక్కదిద్దుతారు కానీ ఇలా లిటికెంట్ గా ప్రవర్తించడం ఇక్కడే చూచాను."

"ఆఁ ఆఁ. ఏమన్నారూ? నేను లిటిగెంట్ నా?" శరభయ్య గుండెలు బాదుకున్నంత పనిజేశాడు.

రామారావు కలుగజేసుకున్నాడు.

"నువ్వూరుకో నాన్నా! అపర్ణ ఎంత బుద్ధితక్కువదో తెలిసీ నువ్వుకూడ దానికి మద్దతు యిస్తున్నావు! ఇది పనికి రాదు——రండి బావగారూ! స్కూలుకు వెళ్ళి పిల్లల్ని తీసుకొద్దాం."

అంతలో అపర్ణ రానేవచ్చింది.

రంయ్యిన దూసుకువచ్చిన కారునుండి మెరుపులాగా దిగింది అపర్ణ. ఇంకా అందులోవున్న స్నేహితురాండ్రకు షోగ్గా వీడ్కోలు చెప్పి లోపలికివస్తూ పోర్టికోలోని కారును చూచి పదబంధన జరిగినట్లే ఆగిపోయింది.

"రా అపర్ణా! బావగారు వచ్చారు చూడు" అన్నాడు హాలులోనుండి రామారావు.

"వచ్చారా? ఏం, నేను జ్ఞాపకం వచ్చానా?"

పూర్తిగా బర్మాభామ వేషంలో వున్న భార్యను

ఆపాదమస్తకం చూచిన సతీష్ వదనంలో ప్రసన్నత అంత రించింది. పొడిగా ముక్తసరిగా వున్న ఆమె పలకరింపుతో అతడి కనుబొమలు ముడివడ్డాయి.

"నీకు జ్ఞాపకం చేద్దామని వచ్చాను. నిష్ఠురాలకేంగానీ త్వరగా బయల్దేరు, నాకు ఎక్కువ సెలవులేదు."

"ఎందుకు? ఎక్కడికి?"

రామారావు అదలింపుగా అన్నాడు: "అపర్ణా ఏమిటా మతిమాలిన మాటలు?"

"మీ మగజాతి సమర్థన మాను అన్నయ్యా! ఇది నా స్వవిషయం."

సతీష బలవంతాన ఓరిమిని తెచ్చుకున్నాడు.

"అపర్ణా! ఎన్నాళ్ళు బ్రతుకుతావు అపోహలలో? ఎందుకు నీ సంసారాన్ని నువ్వు రట్టు చేసుకుంటావు? పదం పెంకెతనం మాను"

"ఓ! సంసారం! రట్టు! ఎవరు? ఎవరుచేశారండీ సంసా రాన్ని రట్టును? అదింకా ఆ యింటనే వున్నదిగా? నేనెం దుకు?" దీర్ఘనిశ్వాసంతో అన్నాడు. "అపర్ణా! ఎందుకిలా సాధిస్తున్నావు నన్ను? ఏమిటిందులో నీకానందం?"

"అదే నేనూ అడుగుతున్నాను. మరొకతెను తెచ్చి యింట వుంచి నన్నెందుకవమానించారు? నేను అక్కడలేని ఇన్నినాళ్ళూ అదీ-మీరూ ఒంటరిగా-ఛీ!"

క్షణంకూడ ఆలశ్యం కాలేదు సతీష్ చేతి అయిదు వ్రేళ్ళూ భార్య చెంపపై ముద్ర పడటానికి.

"స్టుపిడ్! నోటికి ఎంతవస్తే అంతా అనేయడమేనా? నన్ను నువ్వు అనుమానిస్తున్నావూ అంటే నిపైనీకే నమ్మకం

లేదన్న మాట! నీలో పూర్తి స్త్రీత్వం లేనప్పుడే నీ భర్తలో పరాయి వ్యామోహానికి తావు ఏర్పడుతుంది."

రామారావు తటస్థంగా బయటకు నడిచాడు. శరభయ్యా మాత్రం కూతుర్ని సమర్థిస్తూ లబదిబలు ప్రారంభించాడు.

అపర్ణ తల్లీ, వదినా, ఇంటి నౌకర్లు యిద్దరూ అక్కడ జేరారు గలాటా విని.

అందరూ గుమిగూడడం సతీష్ సంస్కార స్వభావానికి సిగ్గన్పించి కృంగిపోయాడు.

కానీ అపర్ణ తగ్గని ధీమాతో, తరగతి అభిజాత్యంతో తధిగిణతోం అంటోంది యింకా.

"భార్యలో స్త్రీత్వం తక్కువైందో, మీలో పొగరు ఎక్కువైందో అందరికీ తెలుసు. పొగరు ఎక్కువై భార్య వగరూ, పరాయిది పంచదార చిలుకా అన్పిస్తుంది. 'ఆలి అయిన ఆడది అణగి మణిగి పడివుండకేం జేస్తుం' దనే అహంకారం మీ చేత అంత సిగ్గుమాలిన పనులు చేయిస్తోంది."

అన్నది అపర్ణ చేతిలో చెంపను సవరించుకుంటూ.

శరభయ్యా, అతడి భార్యా ముక్త కంఠంతో అన్నారు.

"అలా కొట్టీతిట్టీ అధికారాలు చెలాయించి ఆడవాళ్ళ చేత కాపురాలు చేయించుకొనే రోజులు కావుబాబూ ఇవి. మా అందరి ఎదుటనే యిలా కొట్టావంటే యిక అక్కడ ఒంటరి పాటున ఎన్ని హింసలు పెడుతున్నావో మా బిడ్డను?

సతీష్ అసహ్యంగా చూచాడు.

"పెళ్లి గడచిన వాళ్ళు ఎవరి పక్షమూ వహించక న్యాయంగా మాట్లాడితే పెద్దరికం నిలుస్తుంది మరి."

శరభయ్య ఉన్మాది సలె రెచ్చి పోయాడు.

"ఏమిటయ్యా? ఏమిటి నీ ఉద్దేశ్యం? పెద్దరికం నిలవక ఏం జేస్తుంది? ఏం మమ్మల్ని కూడా కొడతావా?"

వారితో తనకు తర్కం అనవసరమన్నట్లు సతీష్ భార్యతో అన్నాడు.

"అపర్ణా! మగనిని అనుమానించడం, సాధించడం, నీ వాక్కు అనుకోకు. నీలాగే నేనూ మాట్లాడితే నువ్వే మూతావు?"

"ఏమిటీ?!"

"ఔను, నన్ను వదలి నీవు యిక్కడున్న కారణానికి నేనుకూడా చిలవలూ, పలవలూ సృష్టించితే?"

పరిస్థితి విషమించుతూన్నదని గ్రహించిన రామారావు తిరిగిలోనికి వచ్చాడు.

"అపర్ణా! కాపురాన్ని చేజేతులా పాడు చేసుకోకు, పద, నా మాట......"

"అన్నయ్యా!" ఆవేశంగా అరచింది అపర్ణ. "అన్నయ్యా, నీకనవసరం. ఇది నా విషయం. నేమంటున్నది నాన్నగారి యింట్లో, నీ యింట్లో కాదు. బాధ పడకు!"

రామారావు నిరుత్తరుడై నిలబడి పోయాడు.

శరభయ్య నిర్భయంగా అన్నాడు. "మా అమ్మాయి మాట చెల్లని చోటపడివుండాల్సిన అగత్యమేమీ లేదయ్యా అల్లుడుగారూ! అది కోటీశ్వరుడు శరభయ్య కూతురు! ఎన్ని

లక్షలకట్న కానుకలతో వచ్చిందీ నేను జ్ఞాపకం చెయ్యనక్కర లేదుగా?"

సతీష్ కూడ అంత ఖండితంగానే అన్నాడు. "సరే. నా పిల్లలను నేను తీసుకువెళ్తాను. ఏ స్కూల్లో వున్నారు?"

"చెప్పను. మీ కివ్వను." మొండిగా అన్నది అపర్ణ.

"సరే. అదే నీ నిర్ణయమా? ఆఖరి సారి అడుగుతున్నాను."

"ఔను. ఇంకా వివరాలు మీకు లాయర్ సుబ్బారావు వివరిస్తాడు. నన్ను గౌరవించని మీ నుండి నేను విడాకులు కోరుతున్నాను!!"

"ఆఁ!!!" కళ్ళు తిరిగిపోయాయి సతీషుకు.

"ఔను" విజయగర్వం తొణికిసలాడింది అపర్ణ నేత్రాలలో.

సతీష్ క్షణాలలో తేరుకున్నాడు.

"సరే. నీలో ఆ సరదాలు కూడా వున్నాయన్న మాట! తీర్చుకో!"

చకచకా బయటకు నడచి వందమైళ్ళ వేగంతో కారును బయలుదేర తీశాడు.

## 21

కొన్ని నిముషాల పాటు పరిసరాలన్నీ అయోమయంగా చూచిన సతీష్ బలవంతాన లేచి కూర్చోవటానికి ప్రయత్నిస్తూండగా, అతడి మిత్రులైన ఇద్దరు సాయపడి దిండ్లకు జేరగిలబడి కూర్చుండేట్లు చేశారు.

"కారు యాక్సిడెంట్ చేశావు నాల్గురోజుల క్రితం,

బలమైన దెబ్బలేకానీ అదృష్టవశాత్తూ పెద్ద ఫ్రాక్చర్స్ లేవు".
అని వివరించారు వారే.

"కారు......ఎదుటలారీ వచ్చింది......" జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించేడు సతీష్.

"ఔను. ఎక్కడినుండి వస్తున్నావు అంత స్పీడులో? అదృష్టవశాత్తూ మన ఊళ్ళోనే జరిగింది కానీ మరో ఊరయితే ఏం జరిగేదో?" ఒకతడు అన్నాడు.

సతీష్ మౌనం వహించాడు, అపర్ణ వద్దకు వెళ్ళి తిరస్కరింపబడి వస్తున్నానని ఏ ముఖంతో చెప్పుకోగలడు?

"లారీ వాడు పారిపోయాడు. మన ఆఫీసులో డ్రాఫ్ట్స్ మన్ సుబ్బారావు ఆదారిన వస్తూ చూచి పాపం వెంటనే కలుగచేసుకొని పోగుజేసి నిన్ను హాస్పిటల్‌లో జేర్పించాడు. ఇవాళిటికి నాలుగో రోజు"

"ఊఁ"

"ఏమిటోయ్ సతీష్ అసలు 'ఊఁ ఆఁ' మినహా మాటలాడవేమిటి? పాపం ఈ అమ్మాయి రాత్రింబవళ్ళు ఎంతసేవ చేస్తోందో నీకు తెలుసా?"

గదిలో ఒక ప్రక్కగా టేబుల్ వద్దనిలబడి పండ్లరసం తీస్తూన్న గంగవైపు మరలింది సతీష్ దృష్టి. గంగ ఒక్కసారి భారంగా కనులెత్తి అతడి వైపు చూచి, మరలా వాల్చేసింది.

"అన్నట్టు——అపర్ణగారి కోసం రామును పంపాం నిన్న."

"ఆఁ?" షాక్ తిన్నట్లయింది సతీష్‌కు.

"అదుగో! మాటలోనే వచ్చాడు రాము."

అందరికనులూ అటుతిరిగాయి అందరిదెసా ఖంగా రుగా చూచాడు రాము. అయ్యగారివైపు చూచాడు.

ఏమి అవమానకరమైన విషయం వినవలెనోననే భయారాటాలు స్పష్టంగా చదవగలిగాడు సతీష్ వదనంలో.

"కుటుంబం అందరూ ఎవరో బంధువులింట వివాహాని కెళ్ళారంటండి నౌకర్లకు చెప్పాను. వెంటనే బయల్దేరుతా మన్నారండి. అయ్యగారి గురించి నేను వెంటనే తిరిగొచ్చా నండి."

సతీష్ వదనంలోని ఆరాటం సమసి తేలిగ్గా నిశ్వ సించాడు.

గంగ మనసు తేలికపడినట్లుగా నిట్టూర్చింది.

"డాక్టర్ని పిలవండి. నేను మాట్లాడాలి" అన్నాడు సతీష్.

"అరుగో ఆయన రానేవచ్చారు"

"అదృష్టవంతులు లెండి మీరు మిస్టర్ సతీష్!" డాక్టర్ స్నేహంగా భుజం తట్టాడు. "ఫ్రాక్చర్స్ ఏమీ కాలేదు. కట్లు ఓ వారంరోజుల్లో విప్పేయవచ్చు. కుడిచేతికి కట్టుమాత్రం మరికొన్ని రోజులుండాలి గట్టిదెబ్బ తగిలింది."

"ఇంటికి వెళ్ళిపోతాను డాక్టర్! మీరు చ్చి చూస్తుండండి."

"ఆల్ రైట్! అన్నట్టు.....ఈ అమ్మాయి మీ కేమౌతుంది మిస్టర్ సతీష్? మంచి ట్రెయిన్డ్ నర్సులాగా చూచుకొంటోంది."

సతీష్ కనులు కృతజ్ఞతగా గంగ వేప చూచాయి కానీ డాక్టర్ ప్రశ్నకు జవాబుమాత్రం చెప్పలేదు.

ఇంటికి జేరి, సతీష్ స్నేహితులంతా నిష్క్రమించిన అనంతరం రాము నెమ్మదిగా చెప్పాడు.

"నేను చెప్పింది అబద్ధం అయ్యగారూ ! అమ్మగారు రానన్నారు"

సతీష్ జ్ఞానివలె చిరుహాసం చేశాడు.

"నాకు తెలుసు. అందరిఎదుటా పరువు కాపాడావు రామూ!"

"చాలా కోపంగా వున్నారండి అమ్మగారు."

"ఊం. బాగా తిట్టివుంటారు అందర్నీ."

"ఔనండి..అసలు ఆర్ని యిక్కడికి రప్పించడానికి ఇదొక దొంగఎత్తు అంటూ నామాట నమ్మనే లేదండి"

అంతవరకూ మౌనంగా గదిలో అవీ యివీ సర్దుతూన్న గంగ రామును మందలించింది.

"రామూ! నీకసలు అయ్యగారితో ఏం చెప్పాలో ఏమి చెప్పకూడదో కూడ తెలియదా ? వెళ్ళి అయ్యగారి బట్టలన్నీ చాకలికి వేసిరా."

రాము వెళ్ళిపోయాడు.

సతీష్ గంగను పరిశీలనగా చూచాడు.

చాలా చిక్కివున్నది. చాలా ముభావంగా వున్నది.

"గంగా, ఇలారా."

నెమ్మదిగా వచ్చి మంచంప్రక్కన స్టూలుమీద కూర్చున్నది

"లా భయపడ్డావా?"

"

"చాలా శ్రమపెట్టాను కదూ నిన్ను ఈ నాల్రోజుల నుండీ?"

'అమ్మగారు వస్తే బాగుండును అయ్యగారూ!" అంటూన్న ఆ గొంతులోని వేదననూ, నిరాశనూ పసిగట్టిన సతీష్ గ్రహించాడు అందుకు కారణాన్ని.

లోకుల కారుకూతలూ విషపుచూపులూ ఈమె వఱకూ వచ్చాయన్నమాట! ఏది దారి?

"మీరు అమ్మగారికి ఫోన్ చేయండి"

"హుఁ. రాళ్ళు కరగడం అనేది ఎప్పుడైనా చూశావా గంగా? అపర్ణ నల్లరాయి. పాషాణం!"

## 22

"అబ్బ...అమ్మా..."

దెబ్బలబాధకు మూల్గుతున్నాడు సతీష్.

అతడి మంచం ప్రక్కనే నేలపై నిద్రపోతూన రాముకు మెలకువ రానేలేదు.

ప్రక్కగదిలోనుండి గంగ పరుగున వచ్చింది.

"అయ్యగారూ! మంచినీళ్ళు కావాలా?"

"ఊఁ. కొద్దిగా."

తానే త్రాగించింది, అతడిని లేవదీసి.

"దెబ్బలు మరీ బాధగా వున్నాయాండీ?"

"ఊఁ. తలనొప్పి భరించరానంతగా వున్నది."

"డాక్టరుకు ఫోన్ చేస్తానండి."

"వద్దు వద్దు గంగా! ఈ దెబ్బల బాధకు తోడు ఆ

ఇంజక్షన్ల బాధపడలేను. నిద్రకు ఏ ఇంజక్షనో యిస్తాడు. వద్దు."

పసిపిల్లవాడిలాగా భయపడిపోతున్నాడు

గంగ మనసు ఆర్ద్రమై నేత్రాలు సజలమైనాయి

మాత్ర తెచ్చి మెల్లగా అతడిచేత మ్రింగించింది కుడిచేతికి కట్టు వుండడంవల్ల ఆమే నీరు త్రాగించవలసి వస్తోంది.

కానీ ఈ పరిస్థితి ఇద్దరికీ యిబ్బందికరంగానే వున్నది.

'ఈ సామీప్యత అనర్థహేతువు కాగలదు' అని సతీష్ మనస్సు పదేపదే హెచ్చరిస్తోంది.

'అసలే కాకులై గోలచేస్తూన్న లోకులు మరింత వాగే అవకాశం యిది! కానీ, నేను అయ్యగారి ఋణం తీర్చుకుంటున్నాను. నిజం ఆ పరంధామునికే తెలుసు. లోకుల్ని ఏడవనీ!'

అని మనస్సుకు నచ్చచెప్పుకొంది గంగ.

దిండ్లను ఆనుకొని కూర్చునేట్లు చేసింది అతడిని.

మంచు తెచ్చి కణతలకు పట్టించుతూ అన్నది :

"ఇక తలనొప్పి తగ్గిపోతుందండి"

సతీష్‌లో సంచలనం—అతడికే తెలియని ఏదో దావానలం ప్రాణం పోసుకున్నది.

"వద్దు వెళ్ళి పడుకో" అన్నాడు ఖరారుగా.

"పడుకుంటానులెండి. మీరు నిద్రపోయాక" గంగ తన సహజధోరణిలో అన్నది.

"వెళ్ళు. యిప్పుడే!"

ఉలికిపడి చూచింది గంగ. ఆ కంఠంలోని కఠినదనం

ఆమెకు నివ్వెరపాటు కలిగించింది. అర్థంకాని ఆయోమ యంలో చూడసాగింది.

"రామును లేపు. నా పనులు చూచుకుంటాడు నీగది లోనికి వెళ్ళు. ఊఁ." సతీష్ గుండె ఎందుకో ఎగసిపడుతోంది.

ఆజ్ఞ అక్షరాలా అమలు జరిగింది.

కానీ అశాంతిగానే గడిపారు యిరువురూ.

ఎంత లజ్జాకరమైన పరిస్థితి యిది!"

ఉభయం గంగ గదిలోకి రాలేదు. కాఫీవగైరాలు రాము చూచుకున్నాడు.

మందు యివ్వడానికి ఇక ఆమెకు రాక తప్పలేదు.

సతీష్ చూపులు ఆమె చూపులతో కలుసుకున్నాయి.

లోకన్యాయమూ, నైజమూ ఎరుగని పసితనమూ, ప్రశాంతతా కన్పించాయి సతీష్‌కు గంగ వదనంలో.

"క్షమించండి అయ్యగారూ,మందు గట్టిగా వ్రాస్తేమీకు నొప్పి కలిగిందనుకుంటాను రాత్రి?" అన్నది తలవంచుకుని.

'హుఁ. ఇంత అమాయిక గనుకనే రాత్రింబవళ్ళూ నా దగ్గర యింత సన్నిహితంగా మసలుతోంది పాపం!'

"లేదు గంగా. నీకు శ్రమ ఔతోందని అంతే." అన్నాడు పైకి మాత్రం ప్రకాశంగా.

తెల్లవారిందో లేదో మరలా స్నేహితుల-పరిచితుల రాకపోకలు మొదలయ్యాయి.

మరొకప్పుడైతే సతీష్ సంతోషించి వుండే వాడే ఈ పరామర్శలకు. కానీ ఇంట అపర్ణ లేదు. గంగ ఉనికిలోకానికి ఉల్కాపాతం వలె వున్నది.

"మీ శ్రీమతి ఏరీ? ఇంత జరిగినా రాలేదా?"

అనే ప్రశ్నలకు సతీష్ ఏమీ చెప్పలేక పోతున్నాడు.

పదకొండు గంటలకు డాక్టర్ వచ్చి వెళ్ళాడు.

రాము సహాయంతో సతీష్‌కు భోజనం తినిపించుతోన్న గంగ బెబ్బులిని చూచి బెదరినట్లు చేతిలోని స్పూన్ జారవిడచి నిలబడింది ద్వారంవైపే చూస్తూ.

సతీష్ చూపు అటు మరల్చాడు.

రాజేశ్వరి! వెంట మరో పురుషుడున్నాడు."

భ భ భ భ ఏమిటిది సతీష్‌గారూ? పెద్ద రొమాంటిక్ హీరోగారు యిలాగైపోయారు?" అంటూ వచ్చి చొరవగా అతడి పాదాల చెంత మంచం మీదనే కూర్చున్నది.

"ఆఁఆఁ. గంగా ఆ కుర్చీ యిలా తే." అంటూ ఖంగారుపడిపోయాడు సతీష్.

"ఫర్వాలేదు కానీ——అపర్ణ రాలేదా? ఏం జరిగిందబ్బా? పోనెండి గంగ అయినా ఆదుకుంది. ఆపదలో అర్ధాంగిని మించి."

గంగ ప్రక్కగదిలోనికి పారిపోయింది వినలేక.

సతీష్ ముఖం జేవురించింది.

"అన్నట్టు వీరు మావారు. మీఆఫీసులో మీ దగ్గర పని జేయాలని ఉబలాటంగా వున్నారు." అని పరిచయం చేసింది.

"ఓ!" అన్నాడు సతీష్, యింకేమనాలో తెలియక. సదరు రాజేశ్వరి భర్త ఓ వెకిలి నవ్వు నవ్వి, ఆడవాళ్ళలాగా బట్టలూ, తలా సవరించుకు కూర్చున్నాడు.

గంగవదలి వెళ్ళిన గిన్నె, స్పూనూ రాజేశ్వరి తీసు

కుంది. "పాపం మీ భోజనం సగంలో ఆగిపోయింది. నేను తినిపిస్తాను."

"వద్దు వద్దు." గాభరాగా అన్నాడు సతీష్. "ఈ దెబ్బల బాధలో ఏమీ తినాలని లేదు. ఏదో నామకార్థం కాస్త తిన్నాను అదే చాలు."

"ఓ! దెబ్బల బాధ మరవాలంటే ఒక ఉపాయం వుంది. సింపుల్ — మీకు తెలియదా?" అన్నది రాజేశ్వరి.

"ఏమిటీ?" సతీష్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అబ్బ. మీరు చెప్పండీ. అది నేనెలా చెప్పనూ?" అంటూ భర్తను ఓ పోటు పొడిచింది.

అతడు బుజ్జగోక్కుని, "ఓ! అదా! బ్రాందీ తాగితే అంతా మరువవచ్చు. అంతేగా రాజీ?" అన్నాడు.

"ఆఁ ఆఁ. కరెక్ట్, మరింకా కూర్చున్నారేం? అదుగో ఆ కబర్డ్‌లో వుంటాయి. తీసి తెండి ఓ సీసా."

"వద్దువద్దు. గాభరాగా అన్నాడు సతీష్." ఎవరైనా ముఖ్య స్నేహితులకోసం యింట అవి వుంచుతుంటాను. నాకు లేదా అలవాటు."

"అరె! అలా ఆడవాళ్ళల్లే భయపడ్తారేమిటండీ?" అంటూ రాజేశ్వరి వయ్యారంగా మెలికలు తిరిగింది. "అల వాటు ఎప్పుడో ఒకప్పుడు చేసుకోనిదే ఎలా వస్తుంది? చూడండి — మీకు బాధలన్నీ మరపు వస్తాయి."

రాజేశ్వరి ది భల్లూకపు పట్టు.

సతీష్ చేత బాగా త్రాగించే వరకూ ఆమెకు తృప్తే లేకపోయింది.

"ఏమండీ? మీ కిప్పుడు హాయిగా లేదూ?" రాజే

శ్వరి భర్త అడిగాడు
"ఆఁఆఁ నిజంగా చాలా బాగుంది" సతీష్ కనులు మూతలు పడుతూండగా అన్నాడు.

"ఔనూ, అపర్ణ ఎందుకు రావడంలేదు? ఎందుకు మిమ్మల్ని వదలి వెళ్ళిపోయిందీ?" సతీష్ మీాదికి వంగి రహస్యము అడుగుతూన్నట్లే అడిగింది రాజేశ్వరి.

"రాదట!" నిగ్రహమూ, గాంభీర్యమూ మరచిన వివశస్థితిలో వున్న సతీషు, ఎపుడూ మాటలాడనంత అతిగా మాటాడడం ప్రారంభించాడు.

"రాను-అన్నది అపర్ణ రాదట. నాకింక ఎవతెతోనో సంబంధం వున్నదట-మీారే చెప్పండి. నేను అలాంటి వాడినేనా?"

"ఛ్ఛ కాదు. అపర్ణకు బుద్ధిలేదు." సానుభూతి కురిపించుతూ అన్నది రాజేశ్వరి.

"కాదు. నాకే బుద్ధిల్లేదని నా పెళ్ళాం అంటుంది. బుద్ధిలేక యింట ఎవతెనో పెట్టుకున్నానట!"

"అలా అందా?" ఆనందంగా మరిన్ని రహస్యాలు లాగడానికి ప్రయత్నించింది రాజేశ్వరి.

"ఔను. నాకిలా యాక్సిడెంటు జరిగిందని రాము స్వయంగా వెళ్ళి చెప్పినా ఆమె రాలేదు. విడాకులు కావాలట విడాకులు!"

"ఆఁ!!"

రాజేశ్వరి సంతోషానికి పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి.
"మరి మరలా నేను రేపు వస్తాను. వెళ్ళనా మరి?"

"వెళ్ళొద్దు రాజేశ్వరీ! ఎప్పుడూ యిక్కడే వుండిపో నువ్వు. నీలాగా నాకేం కావాలో కనుక్కొనే వాళ్ళెవరు?"

రాజేశ్వరి ముఖం విప్పారింది. అర్థయుక్తంగా చూచింది భర్తదెస.

"ఆయన స్నేహితులంతా వస్తున్నారుగా? ఇప్పుడెందుకు? అందరూ చూస్తారు. మళ్ళీ రాత్రో రేపో వద్దువుగాని" అన్నాడు ఆ అసమర్థుడు.

అయితే రాజేశ్వరి సేరుగా బయటికిపోలేదు.

తన చర్యలన్నిటినీ నిస్సహాయంగా గమనించుతూన్న గంగదెస ఒక గర్వపు చూపు ప్రసరించి, డ్రాయింగ్ రూంలోని టెలిఫోన్ వద్ద కూర్చున్నది.

అపర్ణకు ట్రంక్ కాల్ బుక్ చేసి ఇటు భర్తతో బాతాఖానీకి దిగింది.

"అపర్ణకు చెప్తాను. దాని స్థితి ఎలా మారనున్నదో, దాని యింట్లో జరుగుతూన్న భాగోతాలేమిటో! ఓహ్! దానికంటికి మేమేనాడైనా మనుష్యుల్లాగా ఆనామా? దాసీలను చూచినట్లు చూచేది... ఇప్పుడు దాని యింటినే ఒక దాసీది ఏలుతోంది. ఒకనాటికి ఈ దాసీదానికే అది దాసి కాగలదు."

"రాజేశ్వరిగారూ!" ఆవేశంగా అదలించినట్లే అన్నది గంగ.

నిర్లక్ష్యంగా విసపుచూపు చూచింది రాజేశ్వరి.

"ఏమిటే? ఏదో అతగాడిని కట్టుకున్నదానిలాగే గింజుకుంటున్నావ్? వెళ్ళి చెప్పు పోనీ వైన. నీమాట వినే స్థితిలో లేడు!"

నిస్సహాయంగా చూడటమేకానీ ఏమీ చేయలేక పోయింది గంగ. సమయానికి రాముకూడ లేడు. బజారు కెళ్ళాడు.

అపర్ణ దొరికినట్లుంది లైన్ మీద.

రాజేశ్వరి వాగుడు ప్రారంభించింది.

ముగింపుగా అన్నది సానుభూతివాక్యాల అనంతరం.

"నీ శ్రేయోభిలాషిని గనుక యింతగా చెప్తున్నాను అపర్ణా! నీ యింటినీ, నీ భర్తనూ చూస్తోంటే నాకు ఏడుపొస్తోంది. ఏం చేయాలో మరి నీవే నిర్ణయించుకో. మళ్ళీ రేపో ఎప్పుడో మాట్లాడతానులే."

అటునుండి అపర్ణ ఏం మాట్లాడిందోగానీ, రాజేశ్వరి వదనం వికసించింది.

"ఆఁ. అదీ! మనం మన హక్కులు నిలుపుకోవాలి. ఈమగవాళ్ళను సహించి ఊరుకోకూడదు. కోర్టుకు ఈడ్చాలి."

రాజేశ్వరి విలాసంగా నవ్వి, భర్తతో కలసి బయటకు నడచింది.

గంగకు కాలిక్రింది భూమి కదలిపోతున్నట్లు అనిపించింది. 'ఏమిటిది?'

'ఏమి జరుగనున్నది?'

'నేనేం చేయగలను?'

అన్నీ ప్రశ్నలే! భయంకరమైన ప్రశ్నలు, సమాధానంలేని ప్రశ్నలు!

రాము వచ్చి విషయం విని వణికిపోయాడు.

"ఎవతె? అదే ఆ రాజి కదూ? దొంగనా ... అది ఎప్పుడూ అయ్యగారిని నాశనంచెయ్యాలనే చూస్తావుంది.

ఎందుకూరుకున్నావు అక్కా? చెప్పతీసుక్కొట్టి బయటకు గెంటేయలేకపోయావా?"

"నేనెవరిననీ అంత సాహసం చేయను రామూ? ఇప్పటికే కుక్కల్లా మొరుగుతున్నారు ఎవరి నోటికొచ్చినట్లు వాళ్ళు!" అంటూన్న గంగ కనులు చెమర్చాయి

వారు భయపడినంతా జరిగింది.

రాజేశ్వరి ఆ మర్నాడూ వచ్చింది. అతడిచేత త్రాగించింది. మూడవనాడూ ఆమె వచ్చింది.

సతీష్ గంగను ప్రేమగా పలుకరించడంలేదు.

ఆఫీసు సిబ్బందిగానీ, సహోద్యోగులుగానీ వస్తే ముక్తసరిగా మాట్లాడున్నాడు తెలివిగావుంటే. తెలివిలో లేనపుడు వచ్చినవారి కనుబొమలు పైకి లేస్తున్నాయి, గుస గుసలు వినవస్తున్నాయి.

అందరికంటికీ అపరాధిచలె గంగ కన్పిస్తోంది.

అసలైన దుర్మార్గురాలు రాజేశ్వరి ఎవరికీ కన్పించకుండా జాగ్రత్తపడుతోంది.

అందరి జాలీ, సమర్థనా, సానుభూతీ అక్కడలేని అపర్ణపై వర్షిస్తున్నాయి.

రోజులు గడుస్తున్నాయి, దెబ్బలు నయమైనాయి.

ఆరోజు సతీష్ స్నేహితులు కొందరు వచ్చారు.

"ఇక ఆఫీసుకు రావచ్చు. ఇంట్లో వుండి వుండీ విసుగెత్తడం లేదటోయ్? కుడిచెయ్యి కట్టుకూడ విప్పేరుగా?"

"ఈ కుడిచేయి-యింకా వ్రాయడానికి కష్టంగానే వున్నది" వంక పెట్టాలని చూచాడు సతీష్.

"ఆఁ ఫర్వాలేదు. నువ్వేమైనా నవలలు వ్రాయాలా? పద."

బలవంతంగా బయలుదేరదీశారు.

ఆరోజు అతడింకా త్రాగలేదు, ఆఫీసుకు వెళ్తున్నందువల్లనేమో? అందుకే గంగ జ్ఞాపకం వచ్చింది.

గంగకు చెప్పి వెళ్ళాలన్పించి మేడదిగి వచ్చాడు.

వంటపనిలో వున్న గంగ సతీష్‌ను చూస్తూనే బెదరి పనిమాని శిలావిగ్రహంవలె నిలచిపోయింది.

సతీష్ నేత్రాలు గంగపై నిలచిపోయాయి పరీక్షగా చూస్తూ.

ఆమె తల్లడిపోయిన క్రొత్తరోజులలో వున్నట్లు చిక్కిపోయి, దీనవదనంతో కన్పట్టింది.

"ఏమిటి గంగా అలావున్నావు? ఈరోజు ఆఫీసుకు వెళుతున్నాను."

గంగ యిప్పటికీ మాట్లాడలేదు. ఆమెచూపులు అతడిపైననే వున్నా, ఆలోచనలు ఎక్కడోవున్నాయి.

"గంగా!" ఆ పిలుపులో ఎప్పటి మమతా మార్దవాలు వున్నాయి.

ఒక్కసారిగా వచ్చి సతీష్ పాదాలను చుట్టివేసి భోరుమన్నది గంగ.

'ఏమిటి గంగా? ఏమిటి?" ఆర్ద్రంగా లేవనెత్తాడు.

వెక్కి వెక్కి ఏడుస్తూన్న గంగనుండి సమాధానం లేదు.

"చెప్పు గంగా! ఏమిటిది? నాకు పూర్తిగా బాగైంది కదా? ఎందుకీ విచారం యింకా?"

ఇప్పటికీ గంగనుండి సమాధానం శోకమే అయ్యింది.

సతీష్ రాము వైపు చూచాడు.

రాము తలవంచుకుని బూట్ పాలిష్ చేస్తున్నాడు.

"ఏమిట్రా రామూ ఏం జరిగింది?"

రాము నిర్లిప్తంగా అన్నాడు.

"గంగ ఏడుపును ఈ రోజే చూడగలిగారు అయ్యగారూ మీరు. ఆమె రోజూ ప్రతి నిముషం ఏడుస్తూనేవున్నది."

"ఊఁ?"

"ఔనండి......"

"గంగా......"

"మీరు నన్నింత ప్రేమగా ఆప్యాయంగా పిలిచి ఎన్నాళ్లైయింది బాబుగారూ? నేను బ్రతికి ఉన్నాననే మీరు మరచి పోయారు!"

సిగ్గుతో కుచించుకు పోయాడు సతీష్.

రాము బయటకు వెళ్ళిపోయాడు.

"గంగా! నేను ఒళ్ళు తెలియని స్థితిలోగానీ నిన్నే మైనా కోప్పడ్డానా?"

"లేదు బాబుగారూ. నేనసలు మీ దగ్గరకు రావ టానికీ, మీరు కోప్పడడానికి అవకాశమేది? నిత్యం మీ చుట్టూ ఎవరో ఒకరు!"

సతీష్ గౌరవర్ణపు వదనం అరుణిమ దాల్చింది.

"క్షమించండి అయ్యగారూ, నేను మీ సంగతులు మాట్లాడకూడదేమో? కానీ చెప్పకుండా వుండలేక పోతు న్నాను. మీ చుట్టూ జేరే అందరూ మీ మంచిని కోరడం లేదు."

"ఊఁ." తల పంకించాడు. "వెళ్తున్నాను."

నాలుగడుగులు నడచి ఆగిపోయాడు, గంగ వెనకనే వేగంగా రావడం గమనించి.

"అయ్యగారూ......"

"ఏమిటి? ఏమైనా కావాలా బజారునుంచి?"

"లేదండి"

"మరి?"

"మీరు———అక్కడ మళ్ళీ త్రాగకండి. త్వరగా వచ్చేయండి." అన్నది నేల చూపులతో.

బలవంతాన నవ్వినట్లు నవ్వాడు సతీష్.

"అనవసరంగా గాభరాపడకు.త్వరగా వచ్చేస్తానులే"

సతీష్ తిరిగి హాలులోనికి వచ్చేసరికి గుస గుసలన్నీ ఆగిపోయి ఎవరి మటుకు వారే గంభీరంగా చూస్తూ నిల బడ్డారు.

అయితే ఆ గుసగుసలో కొన్ని సతీష్ వినకపోలేదు.

'పర్మిషన్ కోసం వెళ్ళాడా?'

"వదిలినట్టం లేనట్లుంది...ఇంకా రాలేదు."

'అసలు ఈ ఉద్దేశ్యంతో నే జేరదీసి వుంటాడు. ఏమైనా జాంపండులా వుంది.

సతీష్‌కు అందరినీ ఒక్క వేటున నరికి పోగులు పెట్టా లన్పించింది.

'వీళ్ళకి భగవంతుడు ఎప్పుడూ ఏ ఆపదా రానీయడని భరోసా ఏమిటి, ఇతరుల బాధలను ఇంత అలుసుగా వ్యాఖ్యా నిస్తారు. వాళ్ళ కుటుంబ స్త్రీల గురించి ఎవరైనా అలా తేలి కగా మాట్లాడితే భరించగలరా?'

"హల్లో సతీష్! ఏమిటా ఆలోచన?"

ఆ పలుకరించిన వ్యక్తి తన సహోద్యోగి కాడనీ ఊళ్ళో పేరు మోసిన లాయర్ సుబ్బారావు అనీ స్ఫురణకు రావడానికి కొన్ని నిముషాలు పట్టింది సతీష్‌కు.

'ఏమైంది తనకు యింత పరాకు?"

"ఓ! మీ కొల్లీగ్స్ ముఖ్యులంతా ఇక్కడేవున్నారా? మంచి సమయంలోనే వచ్చానన్నమాట!"

"ఏమిటి విశేషం?" సతీష్ యథాలాపంగా అడిగాడు.

"క్షమించాలి——మీ శ్రీమతి గారు——"

అందరినీ కలియజూస్తూ అర్థోక్తిలో ఆపుజేశాడు ఆగంతకుడు.

"ఊ్. ఏమిటో స్పష్టంగా చెప్పండి." అసహనంగా అన్నాడు సతీష్.

"నిన్న వూళ్ళోకి వచ్చారు హోటల్ అజంతాలో బస చేశారు......"

ముచ్చెమటలు పోశాయి సతీష్‌కు. అందరూ విభ్రాంతులై చూస్తున్నారు సతీష్‌నూ సుబ్బారావునూ మార్చి మార్చి.

"ఆమెగారు మీనుండి విడాకులు కోరుతున్నారు, దావా చెయ్యమన్నారు."

సుబ్బారావు నిదానంగానే చెప్పాడు.

అయితే, సతీషు కుపితుడై ఆగ్రహావేశాంతో, భవనమంతా దద్దరిల్లేట్లు అరిచాడు.

"డైవోర్స్? గోటు కోర్ట్, గోటు హెల్! ఇక్కడి కెందుకు? బెదరించడానికి వచ్చావా?"

సుబ్బారావు నిదానం కోల్పోలేదు.

"మిష్టర్ సతీష్! మిమ్మల్ని బెదిరించమనిగానీ, అసలు ఇక్కడకు వెళ్ళమనిగానీ నాకెవరూ చెప్పలేదు. భార్యాభర్తలు విడిపోవడమంటే సాధారణ విషయంకాదు."

"ఇవన్నీ పోయి మీ క్లయింటుకు చెప్పుకోండి."

"చెప్పాను. మీకు కూడ చెప్పడం నా ధర్మంగా భావించి వచ్చాను నేనే. ఏదో ఆవేశంలో కొన్ని నిర్ణయాలకు వచ్చినా కాలక్రమాన ఆ పట్టుదలలు వీగిపోవచ్చు. అప్పుడు పశ్చాత్తాపం కలుగుతుంది. అందుకే నా ఉద్దేశ్యం మీ యిద్దరూ ఒక్కసారి ముఖాముఖి కలుసుకుని మాట్లాడుకుంటే——"

"పెగడు జ్వాజల మానమౌతుంది" అని పూర్తిచేశాడు సతీష్.

"ఆఁ!"

"ఔను సుబ్బారావుగారూ, నేనే స్వయంగా వెళ్ళాను ఆమెను అన్నీ నచ్చజెప్పి తీసుకురావాలని, ఎంత నిర్లక్ష్యం చేసిందో నన్ను...అంత ఘోరంగానూ మాట్లాడి అవమానించింది. తండ్రి మద్దతు వున్నది ఆమెకు. అక్కడి నుండి వస్తూండగా నా కారుకు యాక్సిడెంటు అయింది. ఆనాడు నేను మంచాన పడడం-యిదిగో ఇదే లేవడం. ఆసుపత్రిలో అపస్మారక స్థితిలో పడివున్నానని మా నౌకరు స్వయంగా వెళ్ళి చెప్పినా ఆమె రాలేదు...ఇప్పుడు చెప్పండి నా దోషం ఏమిటో!"

సుబ్బారావు చెప్పాడు.

"సరే...నా ధర్మంగా విషయం మీకు చెప్పాను ఒక మనిషిగా. ఆలోచించుకోండి"

"హుఁ! ఆలోచనలూ అంతర్యాలూ అన్నీ మీకు చెప్పాను. రాజీధోరణీ, సరసతా కల వ్యక్తి అయితే తన భర్తా తన యిల్లూ వున్న ఊళ్ళో ఒక హోటల్‌లో బస చేస్తుందా? ఏమైనా ఆలోచన ఉన్నదా? ఇంతకంటె నా తలకొట్టి నాల్గువీధుల కూడలిలో వ్రేలాడగట్టితే నయం. ఇంత అవమానంగా భావించను."

"మీ బాధను నేను అర్థంచేసుకోగలను. కానీ మీరూ ఆలోచించండి. ఇంట పరాయిస్త్రీని వుంచడం మీకూ సబబుకాదు కదా!"

"సుబ్బారావుగారూ!"

"సారీ! మీ శ్రీమతిగారే చెప్పారు."

"ఆ యువతి తండ్రి నాకోసం ప్రాణం విడిచాడు. ఆ విషయం చెప్పిందా?"

"ఆఁ. అదంతా చెప్పారు. కానీ అటువంటి అనాథలూ సంఘటనలూ కోకొల్లలు. ప్రత్యేకంగా ఈమెపైననే మీకు అభిమానం ఎందుకని మీ మిసెస్ వాదన!"

'వాదనలు జరుగవలసినది న్యాయస్థానంలో. ఇక్కడ యదార్థాన్ని గుర్తించడం మాత్రమే అవసరం."

"సరే మరి సెలవు. కోర్టుకు వెళ్ళడం తప్పదంటారుగా?"

"ఆఁ. తప్పదు, ఆమె సరదా అదే అయితే."

ప్లీడరు వెళ్ళిపోయాడు.

"సతీష్! మీరుకూడ యింత పట్టుదల పెంచుకుంటున్నారా? సంసారం విచ్ఛిన్నమైపోతుంది."

అంతవఱకూ అంతా చూచిన స్నేహితులు నచ

జెప్ప ప్రయత్నించారు.

"హుం!" హేళనగా చూచాడు సతీష్ "ఔను. సంసారం విచ్ఛిన్నం కావాలనే కదా మీ అందరికోరి ?"

"సతీష్!" వారు ఆశ్చర్యంగా అన్నారు.

"ఇంతకుముందు నేను లోనికి వెళ్ళినప్పుడు మీ రందరూ అనుకున్నమాటలు విన్నాను."

అంతా తలలు వాల్చుకున్నారు.

"ఎందుకు? ఎందుకలా ఆలోచిస్తారు? పినిమనిషినుండి పై చదువులు చదివి పై అంతస్థులలో వున్న వారివఱకూ ఒకే తరహా భావ-ఆలోచన! దైవం మనకేమైనా భరోసా యిచ్చాడా మనకుటుంబాలలో ఎటువంటి ఘోరాలూ జరగవని! మన భార్యా బిడ్డలకే అటువంటి దుస్థితి వస్తే— ఇతరులు ఈరోజు గంగను నిందించినట్లే నిందించాలా?"

ఎవ్వరూ మాట్లాడలేదు.

"సంస్కారం...సంస్కృతీ అంటాం. కానీ అవి ఎక్కడున్నాయి? నేను నిలబడిన ఈ భూమిసాక్షిగా, నన్ను కన్న తలిదండ్రులపై... నేను కన్నబిడ్డలపై ప్రమాణంచేసి చెపుతున్నాను. గంగ పవిత్రురాలు, సంస్కారవతి. నివురు గప్పిన నిప్పు. మన కుటుంబస్త్రీలకు ఏ మాత్రమూ తీసి పోదు సరికదా...వారిని తలదన్నే ఉన్నత హృదయం. ఏ మాలిన్యమూ ఎరుగని అమాయకురాలిని మీ కాలక్షేపపు పకపకలకూ, పరిహాసాలకూ గురిచేయకండి."

రామీ లోనుండి పరుగున వచ్చాడు.

"అయ్యగారూ. గంగ......గంగ......"

"ఏదో ౹మింగేసింది. కళ్ళు తేలవేస్తోంది."

ఏ మాత్రం ఆలస్యం చేయకుండా పరుగున వెళ్ళి గంగను చేతులమీదుగా తెచ్చి, కారులో హాస్పిటల్‌కు దూసుకుపోయాడు సతీష్.

అతడి మనస్సు అగ్నిగుండమై ప్రజ్వరిల్లుతోంది.

మెదడు అతివేగంగా ఆలోచిస్తోంది.

హృదయం అలమటించి ఆక్రోశిస్తోంది.

# 23

"గంగా!"

కనులు తెఱచిన గంగ ముందు అందరినీ అయోమయంగా చూచింది.

తర్వాత ముఖం రెండుచేతులతో ఆచ్ఛాదించుకొని హృదయ విదారకంగా రోదించసాగింది.

"ఎందుకు? ఎందుకు బ్రతికించారు నన్ను. అందరూ నిత్యం మాటలతో చిత్రవధ చేస్తోంటే ఎలాగ? ఎలా జీవించను నేను? నాకున్నదారి చావు ఒక్కటే అయ్యగారూ."

అలా రకరకాలుగా తన మనసులోని వేదననూ, దుఃఖాన్నీ వ్యక్తీకరిస్తూనే వున్నది గంగ.

ఆమె శోకానికి అవధిలేదు.

సతీష్ మౌనం వీడలేదు.

శిలవలె గంగనే చూస్తూ కూర్చున్నాడు. అతడినోటి నుండి ఒక్కమాటకూడ వెలువడలేదు. ఆ కనులు ఎక్కడో చూస్తున్నాయి. ఆ ఆలోచనలు ఎక్కడో వున్నాయి.

డాక్టరుకూడ సతీష్ ధోరణి చూచి కలవరపాటు చెందాడు.

"మిష్టర్! ఏమీ ఫర్వాలేదు. ఆవిడకిక భయంలేదు. మీరు మామూలు మనుషులు కండి."

సతీష్ మాట్లాడలేదు.

అంతా చూస్తూన్న రాముా భయపడ్డాడు.

"అయ్యగారూ! అయ్యగారూ! మీకేమైంది?" అంటూ కన్నీళ్ళతో అతడిని ప్రాథేయపడ్డాడు.

అప్పటికీ సతీషునుండి సమాధానం పొందక, బయటకు పరుగెత్తి కారుడ్రైవర్‌తో చెప్పాడు.

"చూడూ నాకేమిటో భయంగా వుంది. అయ్యగారి స్నేహితులెవరైనా వెంటనే తీసుకురా. నేను ఆ హోటలుకు పోయి అమ్మగార్ని తీసుకొస్తాను."

"అలాగే."

ఏడ్చి ఏడ్చి అలసిపోయినట్లు మౌనం వహించిన గంగ కూడ నిర్లిప్తంగా శిలాకృతిలో కూర్చున్న సతీషును కలవరపాటుతో చూడసాగింది.

అరగంటఅయ్యేసరికి అక్కడకు సతీషు స్నేహితులూ పరిచయస్థులూ చాలమందే గుమిగూడారు.

కానీ అపర్ణమాత్రం రాలేదు.

"డాక్టర్, ఏవో జరుగుతుంటాయి. అంతా సర్దుకుంది గనుక విషయం పోలీసులవరకూ వెళ్ళనీయకండి" అని సర్ది చెప్పారు సతీషు స్నేహితులు.

డాక్టర్ అనుమతితో గంగను యింటికి తీసుకు వచ్చారు.

యాంత్రికంగా అందరితోపాటు సతీష్‌కూడా కారులో

కూర్చుని యింటికి వచ్చాడే కానీ అతడు ఇప్పటికీ మాట్లాడ లేదు.

స్నేహితులూ, సహోద్యోగులూ ముఖముఖాలు చూచుకున్నారు.

"సతీష్! ఏమిటలా వున్నావు?" దగ్గర స్నేహితుడొకతడు సాహసించి అడిగాడు.

"ఏమీ లేదు." ముభావంగా అన్నాడు సతీష్.

రాము వచ్చాడు.

"అమ్మగారి కోసం వెళ్ళాను. లేరండి. బజారుకో స్నేహితుల దగ్గరకో ఎళ్ళారట. వచ్చాక చెప్తామన్నారు హోటల్ మేనేజర్."

అందుకు సతీష్ ఏమీ మాట్లాడ లేదు.

"ఇటురా రామూ." అని లోపలి గదిలోనికి తీసుకెళ్ళాడు.

"ఏంటండి?"

"త్వరగా బజారు వెళ్ళి ఈ వ్రాసిన సరుకులు తీసుకురా. ఇవి దొరికే షాపు ఫలానా—" అంటూ కొన్ని వేల డబ్బు బీరువానుండి తీసి యిచ్చాడు రాముకు.

"ఇంతాండీ?" వెఱ్ఱిగా చూచాడు రాము.

"ఔను. కార్లో వెళ్ళు. త్వరగా రావాలి. మా డ్రైవర్‌డీకి నా పేరు చెప్పు"

రాము వెళ్ళిపోయాడు.

సతీష్ తిరిగి హాలులోనికి వచ్చి, స్నేహితులను వెళ్ళి

పోవలదనీ, మరి కొద్దిసేపు ఆగమనీ కోరి, తాను గంగ గది లోనికి వెళ్ళాడు.

పడుకున్న గంగ అతడిని చూచి చివాలున లేచి కూర్చున్నది.

"ఫర్వాలేదు పడుకో గంగా ఒక్కమాట అడుగు తాను. ఏ మాత్రం దాపరికం, మొగమాటం లేకుండా చెప్పు."

"విషం ఎందుకు తాగాననేగా? అంతకంటె నాకు దారి ఏది అయ్యగారూ?"

"దారి నేనే చూపుతానని మాట యిచ్చాను కదా? ఆ మాట నిలుపుకొంటాను గంగా? నన్ను వివాహం చేసు కోవడం నీ కిష్టమేనా?"

"అయ్యగారూ!" అనే శబ్దం గంగ పెదవులను దాట లేకపోయింది. ఆమె నేత్రాలు విశాలమై, భయోత్పాతంతో అతడినే చూడసాగాయి.

"భయపడకు, ఆవేశపడకు, నిజంగానే అడిగాను. సమాధానం సరిగా చెప్పవలసిన ముఖ్య క్షణాలు యివి."

"అయ్యగారూ. ఇదంతా ఏమిటి?" భయ విహ్వాల తతో, దుఃఖ పూరిత స్వరంతో అడిగింది.

"అదుగో ఆ భయమే వద్దు. నిజంగా అడుగుతున్నాను. 'అయ్యగారి వంటి భర్త కావా'లని నువ్వు దైవాన్ని ప్రార్థించడం నేను చూచానొకనాడు!"

తన రహస్యం పట్టుబడిపోయినట్లు తల వాల్చుకున్నది గంగ.

"చూడు గంగా."

లేచి అటు యిటు పచార్లు ప్రారంభించాడు సతీష్
"నీకు నేను తగను. నీ కంటె చాలా పెద్దవాడిని, ఇద్దరు పిల్లలున్న వాడిని———"

"అయ్యగారూ. అలా అనకండి. మీ పాదాలవద్ద పూచికపుల్లవంటి దానిని."

"కాదు. బుద్ధిమంతురాలివి. అపర్ణ నేను లేకపోయినా బ్రతకగలదు. కానీ నీవు? మరణం తప్ప దారిలేదనుకున్నావు. కానీ అలా జరగడానికి వీలులేదు. నిన్ను నీ యింటినుండి, మీ జనం అందరి నుండీ నా యింటికి తీసుకొచ్చిన దెందుకు? నీకు మంచి జీవితం యివ్వాలని. ఈనాడూ అదేమాట మీద వున్నాను. నావాళ్ళే నన్ను వదలి పోయినప్పుడు నిస్సంకోచంగా నిన్ను నీవు మరచి నాకు సేవ చేశావు, లోకనిందకు గురి అయ్యావు. అందుకు బాధ్యుడను నేను గనుక, పరిష్కారముకూడ నేనే! ఏమంటావు?

"నాకేమిటో భయంగా వుంది అయ్యగారూ."

"భయం వద్దు గంగా, లోకంలో నువ్వు ఒంటరిగా బ్రతకలేవు. ఎవరైనా ఉత్తముడికి యిచ్చి వివాహం జరిపించాలనుకున్నాను. కానీ యింటా బయటాకూడా నాకు శత్రువులు తయారై అతి హీనంగా చిత్రీకరించారు. ఈనాడు నిన్నెవరికైనా వివాహంచేసినా ప్రమాదమే. ఈ పాడులోకపు ప్రగుడ్డి మాటలు నమ్మి అతడు నిన్నేమైనా అనుమానించితే నువ్వు ఎన్నుకొనే దారి ఒకటే. ఆత్మహత్య. అదే జరిగితే నేను సుఖంగా వుండగలనా? మీ నాన్న, దైవమూ కూడ నన్ను జన్మజన్మలకూ క్షమించరు."

గంగ కృతజ్ఞతతో చూచింది.

"అయ్యగారు దేవుడే" అనేవాడు మా నాన్న, అలా ఎందుకనేవాడో యిప్పుడు తెలిసింది అయ్యగారూ. కానీ యిందువల్ల అపర్ణగారికి అన్యాయం జరుగుతుంది!"

"ఆమె అహంకారమే ఆమెకూ ఆమె చుట్టూ వున్న వారికీ అన్యాయం చేస్తోంది. నువ్వు అవన్నీ ఆలోచించకు."

సతీష్ హాలులోకి వచ్చి స్నేహితులందరి దెసా చూచాడు.

చూడండి. మీ అందరి సమక్షంలోనూ నా జీవిత సమస్యను పరిష్కారం చేయబోతున్నాను. గంగ నా యింట ఆశ్రయం పొందటం, అందుకు కారణమూ మీ అందరికీ తెలుసు కానీ ఆ విషయానికి మీరందరూ కూడ రంగులు వేసి చిలవలూ పలవలూ కల్పించారు ఫలితం చూచారు కదా! ఒక అమాయకురాలు ఆత్మహత్యకు తలపడింది... ఆమెను బ్రతికించాను. కానీ ఎందుకు? ఆమెను ఎవరూ వివాహమాడటానికి సిద్ధంగా లేరు. 'ఇన్నాళ్ళు మీ యింట వున్నామెను ఎవరు చేసుకుంటారు సార్?' అన్నాడు నా దయా దాక్షిణ్యాలతో ఉద్యోగం పొందిన ఒకతడు. ఆమె యింట్లో వున్నందుకే తనకు విడాకులు కావాలన్నది నా అర్థాంగి!"

అతడు మాటలు ఆపి అప్పుడే హాలులో ప్రవేశించిన అపర్ణను చూస్తూ ఉండిపోయాడు. ఆమె వెంట చెలికత్తె రాజేశ్వరి కూడా వున్నది.

"అక్కడే ఆగు అపర్ణా, ఎందుకొచ్చావు?"

అనుకోని అఘాతం వలె తగిలిన ఆ ప్రశ్నకు ... అయి చూచింది అపర్ణ.

"ఎందుకొచ్చావు? ఏమిటి నీకిక్కడ పని?" రెట్టించాడు సతీష్.

రాజేశ్వరి అన్నది: "రాము చెప్పాడట గంగ ఆత్మహత్య చేసుకుందని. చాలా సారీ అండి."

"ఓ! అయితే ఒక అమాయకురాలి సమాధిమీద నీ స్నేహితురాలు తన ప్రేమమందిరం కట్టుకోవడానికి వచ్చిందన్నమాట?"

"అందుకు బాధ్యురాల్ని నేనుకాదు. ఆమె తెలివి తక్కువ అది!" అన్నది అపర్ణ.

"కాదు. నీవే బాధ్యురాలివి. విడాకులు కోరుతూ నీవు ప్లీడర్ని కలపడం చూచి భయపడి ఆత్మహత్యను శరణు కోరింది."

"ప్చ్. ఏంచేస్తాం? భగవన్నిర్ణయం!" అన్నది రాజేశ్వరి.

"ఏదీ గంగ? మేము చూడాలి."

"ఎందుకు? స్నేహితురాండ్రిద్దరూ కలసి యింకా చిత్రవధ చేస్తారా? సారీ అపర్ణా! నీవు వెళ్ళవచ్చు. కోర్టు ద్వారా విడాకులు యిస్తాను. ఒక గంట...ఒక్కగంట క్రితంవట వచ్చినా నీ స్థానం నీకు వుండివుండేది. కానీ సమయం మించిపోయింది. నా మనస్సు విరిగిపోయింది. భర్త ప్రమాదానికి గురిఅయి ఆస్పత్రిలో పడివున్నాడన్నపుడు కూడా రాని రాయివి...ఇపుడు వచ్చావంటే ఏమనుకోవాలి? నీకు చాలా ఆనందంగా వున్నదికదూ? విను—గంగ చనిపోలేదు. ఇది సినిమాకాదు, గంగచనిపోయి నీ స్థానాన్ని నిలబెట్టడానికి. యదార్థం యిది. గంగ బ్రతికింది—నాకు బ్రతుకులో నీవు ఈయని సుఖమూ, చూపని తీపీ ప్రసాదించడానికి!"

"ఆఁ ?!!?"

"ఔను. అండకోసం పంచనజేరిన అబలకదా అని అలుసుతో నీ అహంకారమంతా చూపి నిందలు వేశావు. ఆమె రూపవతీ, యౌవనవతీ అనే విషయాలను మాటి మాటికీ నాకు గుర్తుచేసి పోరిపోరి నా మనసును చెదర గొట్టావు. అయినా తట్టుకున్నాను. నిష్కారణంగా ఆమెను దూషించి, చేయని నేరాలు అంటగట్టి నిష్క్రమించావు. నేనూ గంగా ఇంట ఒంటరిగా మిగిలాం.

"ఎంత పవిత్రంగావున్నా లోకం కథలల్లింది. ఆమెకు బయటిప్రపంచంలోకి దారులు లేకుండాపోయాయి. అర్థాంగి వయ్యా నా కష్టసుఖాలతో నిమిత్తంలేకుండా నీ ఆనందా వనిలో నీవు మునిగివున్నావు పుట్టింట. నేను వస్తే నన్నవమా నించి పంపావు. ఆనాడే విడాకుల ప్రసక్తి తెచ్చావు.

"నీవు లేకపోయినా నిస్సంకోచంగా ఈ యింట నిష్కల్మషంగా మెలిగింది గంగ. యాక్సిడెంటుకులోనై ఒళ్ళు తెలియక పడివున్న నాకు తనను తాను విస్మరించి సేవలు చేసింది. నీ రాజేశ్వరి నన్ను త్రాగుబోతును చేసింది. ఆ త్రాగుబోతునుకూడా అసహ్యించుకోనక అహోరాత్రులూ కంటికి రెప్పయై కాపాడింది అమాయకురాలు గంగ. నీ నిర్లక్ష్యానికి లోనైన నేను గంగే లేకుంటే ఏమైపోయి వుండే వాడిని?

కొడిగడుతూన్న దీపాన్ని తన అమృతహస్తంతో ఎగద్రోసి, జ్యోతిని ఆరకుండా చేసిన గంగ నాపై అర్థాం గిగా హక్కును ఎన్నడో సంపాదించుకుంది. నేనే ఆలస్యంగా గుర్తించాను.

గంగ తండ్రి మరణానికి కారకులం మనం, నేడు గంగకు వివాహం కాకపోవడానికి కారకులం మనం, ఆమె ఆత్మ హత్యకు తలపడడానికి కారకులం మనం !

నేడు నా సుఖం నేను చూచుకొని ఆమెను విస్మరించేంత విశ్వాసహీనుడను కాను. నా జీవనజ్యోతిని నిలిపిన ఆమె జీవనమాధుర్యానికి దూరమై నిస్సారంగా బ్రతక కూడదు."

"ఏమిటి సతీష్‌బాబూ ? ఆమెను మీరు......" ఒకతడు అడిగాడు ఆశ్చర్యంగా.

"ఆ అనామకురాలిని కట్టుకొని నన్నవమానించుతారా?" అపర్ణ గద్గదస్వరంతో అడిగింది.

"ఔను. ఆమె అనామిక! అది మీ దృష్టిలో. అతి ఉత్తమురాలు నా దృష్టిలో. ఆరిపోతూన్న జ్యోతిని ఎగద్రోసే చిన్నపుడక అనామికే ! కానీ అతివిలువైనది నా దృష్టిలో."

రాము వచ్చాడు.

అతడు తెచ్చిన సరుకులు ఒక చిన్న, నగపెట్టె ఒక పట్టుచీర.

"గంగా ఇటురా."

గంగ వచ్చి అందరి సమక్షంలో నిలబడింది.

రాము తెచ్చిన నగలపెట్టెనుండి మంగళసూత్రాలు చేతికి తీసుకున్నాడు సతీష్.

అందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా గంగ మెడలో మూడుముళ్ళూ వేశాడు సతీష్.

"అపర్ణా ! నీకు ప్రశాంతంగా బ్రతకడం...బ్రతక

నీయిష్టం యిష్టమైతే లోనికిరా. లేదా నీదారి నువ్వు ఎన్నుకో."

రాము అందరిచేతికీ అక్షతలు యిస్తూ, అపర్ణవద్దకు వచ్చి బెదరి ఆగిపోయాడు.

అపర్ణ తానే అక్షతలు చేతికి తీసుకుని వధూవరులపై జల్లి లోనికి నడచివచ్చింది.

గంగ అపర్ణకూ, సతీష్‌కూ పాదాభివందనం చేస్తూంటే రాజేశ్వరి సహించలేకపోయింది.

"అపర్ణా! ఎంత ఘోరం జరిగిపోయిందే ? నువ్వూ అందరాడవాళ్ళలానే నీ హక్కులు మరచి మగని అన్యాయాన్ని సహిస్తావా?" అంటూ రాజేశ్వరి నెత్తీ నోరూ కొట్టుకున్నది.

గంగ చురుగ్గా చూచింది రాజేశ్వరిని.

'చూడు రాజేశ్వరీ!"

ఈ సంబోధన విని రాజేశ్వరి అందరికంటె ఎక్కువ నిర్ఘాంతపోయింది.

గంగ స్థిరంగా, నిబ్బరంగా చెప్పింది :

"రాజేశ్వరీ! ఎవరి సంసార బాధలు వాళ్ళవి. నీ కనవసరం. ఇక ఈ యింట పేకాటకుగానీ, త్రాగుడికి కానీ తావుపుండదు. ఇంటి యజమానురాలి హోదాలో చెప్తున్నాను. నీవు వెళ్ళవచ్చు!"

సహాయంకోసం రాజేశ్వరి అపర్ణ దెస చూచింది. అపర్ణ మాట్లాడకపోవడంతో నిర్ఘాంతపోయి, నెమ్మదిగా బయటకు అడుగులు వేసింది.

సమాప్తం